# గ్రంథస్థ విషయములు.

సమాప్తము.



# పీఠిక.



శ్లో॥ తర్కవ్యాకరణౌ ధర్మశాస్త్రం మీమాంసమిత్యపి ।
వైద్యశాస్త్రం జ్యోతిషంచ షట్శాస్త్రాణీతికథ్యతే॥

శ్రీమదఖండ భూమండలమునకు మండనంబై యుండు భరతఖండంబునందు సురక్షితంబై నివసించు దైవజ్ఞశిఖామణులగు సకల సజ్జనులకుఁ దెలియఁజేయుట యేమనిన:—

ఇదివరలో ముహూర్తభాగమును గుఱించి ముద్రింపబడిన నక్షత్రదర్పణి, ముహూర్తచంద్రిక, ముహూర్త దర్పణము, ముహూర్తదీపిక, ముహూర్తసారము, కాలప్రకాశిక, జ్యోతిషచక్రబోధిని, కాలామృతాది బహుగ్రంథములు ముద్రింపఁబడియున్నవి. అట్టిగ్రంథములందు చేర్పబడని ముహూర్త విషయములెన్నియో ఇందులో గలవు. చాలా భాగము ఈజ్యోతిషగ్రంథంబగు (ముహూర్త చింతామణియందు) జేర్పబడినవి. ఈజ్యోతిషగ్రంథము మనపూర్వులగు మహాపెద్దలగు జ్యోతిష్కులవలన సంగ్రహింపఁబడి తాళపత్రములయందు వ్రాయఁబడియుండెను, అట్టి తాళపత్రగ్రంథము లన్నియును బ్ర॥ రాయప్రోలు సుబ్రహ్మణ్య సిద్ధాంతిగారు నాకు బంపినందున సదరు గ్రంథమునందలి విషయసూచిక ప్రకారము అక్కడక్కడ ఆయా సందర్భములకుఁ దగిన హెడ్డింగులు పడనందున విషయములను దెలిసికొనుట కష్టంబనియెంచి, వాటినన్నిటిని సందర్భానుసారముగా హెడ్డింగులు వ్రాయఁబడి ముద్రింపఁబడెను.

---

ఆర్యానంద ముద్రాక్షరశాల,
మచిలీపట్టణము.

ఇట్లు,
చెల్లా లక్ష్మీనృసింహశాస్త్రి.



ఓమ్ పరబ్రహ్మణేనమః.

శ్రీ గ ణే శా య న మః.

# శ్రీ ముహూర్తచింతామణి.

(మంగళాచరణమ్.)

శ్లో॥ గౌరీశ్రవః కేతకపత్రభంగ మాకృష్య హస్తేనదదన్ముఖాగ్రే ।
విఘ్నం ముహూర్తాకలితద్వితీయ దంతప్రరోహో హరతుద్విపాస్యః॥

తా॥ తల్లియైన పార్వతీదేవియొక్క కర్ణమందున్న కేతకీపత్రమును తొండము చేతలాగి నోటియందుంచుకొన్నవాఁడై క్షణకాలము ద్వితీయదంత సద్భావశోభను వహించిన గజాస్యుఁడైన విఘ్నేశ్వరుఁడు విఘ్నములను హరించుఁగాక.

## ముహూర్తప్రయోజనము.

శ్లో॥ క్రియాకలాపప్రతిపత్తిహేతుం । సంక్షిప్తసారార్థ విలాసగర్భం అనంతదైవజ్ఞసుతః స రామః। ముహూర్తచింతామణిమాతనోతి॥

తా॥ అనంత సిద్ధాన్తి పుత్రుఁడైన రామపండితుఁడు సమస్త క్రియాజ్ఞాన హేతువైనటువంటిన్నీ, సంక్షిప్తార్థగర్భితమైన ముహూర్తచింతామణియను గ్రంథమును చేయుచున్నాఁడు.

## తిథీశులు.

శ్లో॥ తిథీశావహ్నికౌగౌరీ గణేశోహిర్గుహోరవిః । శివోదుర్గాంతకోవిశ్వే హరిః కామః శివఃశశీ ॥ దర్శేపితరః॥

తా॥ పాడ్యమికి అగ్ని, విదియకు బ్రహ్మ, తదియకు పార్వతీ, చవతికి విఘ్నేశ్వరుఁడు, పంచమికి శేషుఁడు, షష్టికి కుమారస్వామి, సప్తమికి సూర్యుఁడు, అష్టమికి శివుఁడు, నవమికి దుర్గా, దశమికి యముఁడు, ఏకాదశికి విశ్వేదేవతలు, ద్వాదశికి విష్ణువు, త్రయోదశికి మన్మథుఁడు, చతుర్దశికి శివుఁడు, పూర్ణిమకు చంద్రుడు, అధిపతులు. అమావాస్యకు పితృదేవతలని.

### తిథిసంజ్ఞలు – సిద్ధియోగములు.

శ్లో॥ నందాచభద్రాచజయాచరిక్తాపూర్ణేతితిథ్యోశుభమధ్యశస్తాః।
సితేసితేశస్తసమాధమాస్స్యుః సితజ్ఞభౌమార్కిగురౌచసిద్ధాః॥

తా॥ 1, 6, 11, తిథులు నందతిథులు, 2, 7, 12, భద్రతిథులు, 3, 8, 13 జయతిథులు, 4, 9, 14 రిక్తతిథులు, 5, 10, 15 పూర్ణతిథులు, ఈసంజ్ఞలు ఇందు శుక్లపక్షమందు మొదటిపంచక మశుభకరము. రెండవపంచకము మధ్యమఫలప్రదము, మూడవ పంచకము ప్రశస్తము, కృష్ణపక్షమందు ప్రథమపంచకము ప్రశస్తము, ద్వితీయపంచకము సామాన్యఫలప్రదము, తృతీయపంచక మశుభకరము, ఇంకొకవిశేష మేమనగా:— శుక్రవారమందు నందతిథులున్నా, బుధవారమందు భద్రతిథులున్నా, మంగళవారమందు జయతిథులున్నా. శనివారమందు రిక్తతిథులున్నా, గురువారము నందు పూర్ణతిథులున్నా, సిద్ధతిథులనిచెప్పఁబడును. అనఁగా శుభప్రదములు.

### రవ్యాదివారములయందు క్రమముగా నిషిద్ధతిథులు.

శ్లో॥ నందాభద్రానందికాఖ్యాజయాచ।
రిక్తాభద్రాచైవపూర్ణామృతార్కాత్।

తా॥ ఆదివారమందు నందతిథులు, సోమవారమందు భద్రతిథులు, మంగళవారమునందు నందతిథులు, బుధవారమందు జయతిథులు, గురువారమందు రిక్తతిథులు, శుక్రవారమందు భద్రతిథులు, శనివారమందు పూర్ణతిథులును, మృత్యుప్రదములు.

### నిషిద్ధనక్షత్రములు.

శ్లో॥ యామ్యంత్వాష్ట్రం వైశ్వదేవంధనిష్ఠా ర్యమ్ణంజ్యేష్ఠాంత్య రవేర్దగ్ధభంస్యాత్॥

తా॥ ఆదివారమందు భరణియు, సోమవారమందు చిత్తయు, మంగళవారమందు ఉత్తరాషాఢయు, బుధవారమందు ధనిష్టయు, గురువారమందు ఉత్తరయు, శుక్రవారమందు జ్యేష్ఠయు, శనివారమందు రేవతియు, దగ్ధనక్షత్రము లనఁబడును అనగా శుభకార్యములయందు వర్జ్యములు.

———



### తిథిచక్రమ్.

| తిథులు. | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 30 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అధిపతులు. | అగ్ని | బ్రహ్మ | గౌరి | వినాయకు | శేషుడు | కుమారస్వామి | సూర్యుడు | శివుడు | దుర్గ | యముడు | విశ్వేదేవులు | హరి | మన్మథుడు | శివుడు | చంద్రుడు | పితృదేవతలు |
| సంజ్ఞలు. | నంద | భద్ర | జయ | రిక్త | పూర్ణ | నంద | భద్ర | జయ | రిక్త | పూర్ణ | నంద | భద్ర | జయ | రిక్త | పూర్ణ | పూర్ణ |
| శుక్ల. | అధ | అ | అ | అ | అ | మధ్య | మ | మ | మ | మ | ఉత్త | ఉ | ఉ | ఉ | ఉ | : |
| కృష్ణ. | ఉత్త | ఉ | ఉ | ఉ | ఉ | మధ్య | మ | మ | మ | మ | అధ | అ | అ | అ | : | అ |

### నిషిద్ధయోగములు.

శ్లో॥ షష్ఠ్యాదితిథయోమందాత్ విలోమంప్రతిపద్బుధే। సప్తమ్యార్కేఽధమాఃషష్ఠ్యాద్యామాశ్చరదథావనే॥

తా॥ శనివారమందు షష్ఠియు, శుక్రవారమునాడు సప్తమియు, గురువారమునాడు అష్టమియు, బుధవారమునాడు నవమియు, మంగళవారమునాడు దశమియు, సోమవారమునా డేకాదశియు, ఆదివారమునాడు ద్వాదశియు, బుధవారమునాడు పాడ్యమియు, ఆదివారమునాడు సప్తమియు, శుభకార్యములయందు నిషిద్ధములు, ప్రతిపత్షష్ఠ్యమావాస్యలు దంతధావనమునకు నిషిద్ధములు.

## కార్యభేదముచేత నిషిద్ధతిథులు.

శ్లో॥ షష్ఠ్యష్టమీభూతవిధుక్షయేషు సేవేతనా తైలపలేతక్షురంరతమ్ । నాభ్యంజనంవిశ్వదశద్వికేతిథౌ ధాత్రీఫలైఃస్నానమమాదిగోష్వసత్ ॥

తా॥ షష్ఠియందు తైలాభ్యంగనమున్నూ, అష్టమియందు మాంసభోజనమున్నూ, చతుర్దశియందు క్షౌరమున్నూ, అమావాస్యయందు స్త్రీసంభోగమున్నూ చేయఁగూడదు. మఱియు ఏకాదశి, దశమి, ద్వితీయాతిథులయందు అభ్యంగనముకూడదు. అమావాస్య సప్తమి, నవమి తిథులయందామలక స్నానము చేయఁగూడదు.

### —* దగ్ధాదియోగ చతుష్టయము *—

శ్లో॥ సూర్యేశపంచాగ్నిరసాష్టనందా దశాంగసప్తాశ్వగజాంకశైలాః । సూర్యాంగసప్తోరగగోదిగీశా దగ్ధావిషాఖ్యాశ్చహుతాశనాశ్చ ॥

శ్లో॥ సూర్యాదివారే తిథయోభవంతి మఘావిశాఖా శివమూలవహ్నిః । బ్రాహ్మంకరోర్కాద్యమకంటకాశ్చ శుభేవివర్జ్యాగమనేత్వవశ్యమ్ ॥

తా॥ ద్వాదశీ ఆదివారమున్నూ, ఏకాదశి సోమవారము, పంచమీ మంగళవారము, తృతీయా బుధవారము, షష్ఠీ గురువారము, అష్టమీ శుక్రవారము, నవమీ శనివారమున్నూ, దగ్ధయోగములని చెప్పఁబడును. చతుర్థీ ఆదివారమున్నూ, షష్ఠి సోమవారము, సప్తమీ మంగళవారము, ద్వితీయా బుధవారము, అష్టమీ గురువారము, నవమీ శుక్రవారము, సప్తమీ శనివారమున్నూ, విషయోగము లనఁబడును. ద్వాదశీ ఆదివారమున్నూ, షష్ఠి సోమవారము, సప్తమీ మంగళవారము, అష్టమీ బుధవారము, నవమీ గురువారము, దశమీ శుక్రవారము, ఏకాదశీ శనివారమున్నూ హుతాశనయోగములు, మఘా భానువారము, విశాఖా సోమవారము, ఆర్ద్రా కుజవారము, మూలా బుధవారము, కృత్తికా గురువారము, రోహిణీ శుక్రవారము, హస్తా శనివారమున్నూ యమకంటకయోగములు, ఈచెప్పిన నాలుగు యోగములు శుభకార్యములయందు వర్జించవలెను, యాత్రయందు ముఖ్యముగా విసర్జించవలయును.

---



## దగ్ధాదియోగచక్రము.

| ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని | వారములు. |
| --- | --- | --- | --- | --- | --- | --- | --- |
| 12 | 11 | 5 | 3 | 6 | 8 | 9 | దగ్ధయోగః |
| 4 | 6 | 5 | 2 | 8 | 9 | 7 | విషయోగః |
| 12 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | హుతాశనయోగః |
| మఖ | విశా | ఆర్ద్ర | మూల | కృత్తి | రోహి | హస్త | యమకంటయోగః |

## మాసశూన్యతిథులు.

శ్లో॥ భద్రేచంద్రదృశౌనభస్యనలనేత్రేమాధవేద్వాదశీ పౌషేవేదశరాఇషేదశశివామార్గేద్రినాగామధౌ । గోష్టాచోభయపక్షగాశ్చతిథయఃశూన్యాబుధైఃకీర్తితాః । ఊర్జాషాఢతపస్యశుక్రతపసాంకృష్ణేశరాంగాబ్ధయః ॥

శ్లో॥ శుక్లేఃపంచస్వితేశక్రాద్రిగ్నివిశ్వరసాఃక్రమాత్ ॥

తా॥ భాద్రపదమందు ౧, ౨ తిథులున్నూ, శ్రావణమందు ౩, ౨ తిథులున్నూ, వైశాఖమందు ౧౨ తిథియు, పుష్యమందు ౪, ౫, తిథులున్నూ, ఆశ్వయుజమందు ౧౦, ౧౧ తిథులున్నూ, మార్గశీర్షమందు ౭, ౮, తిథులున్నూ, చైత్రమందు ౯, ౮ తిథులున్నూ, ఉభయ పక్షములయందున్నూ శూన్యతిథులు, కార్తికమందు పంచమియు, ఆషాఢమందు షష్ఠియు, ఫాల్గుణమందు చతుర్థియు, జ్యేష్ఠమందు చతుర్దశియు, మాఘమందు పంచమియు, కృష్ణపక్షమందు శూన్యతిథులు, కార్తికమందు చతుర్దశియు, ఆషాఢమందు సప్తమియు, ఫాల్గుణమందు తృతీయయు, జ్యేష్ఠమందు త్రయోదశియు, మాఘమందు షష్ఠియు, శుక్లపక్షమందు శూన్యతిథులు.

## తిథినక్షత్ర సంబంధి దోషములు.

శ్లో॥ తథానింద్యంశుభేసార్పం ద్వాదశ్యాంవైశ్వమాదిమే ॥

అనూరాధాద్వితీయాయాం పంచమ్యాంపితృభంతథా త్ర్యుత్త
రాశ్చతృతీయాయా మేకాదశ్యాంచరోహిణీ॥
శ్లో॥ స్వాతీచిత్రేత్రయోదశ్యాం సప్తమ్యాంహస్తరాక్షసౌ।
నవమ్యాంకృత్తికాష్టమ్యాం పూభాషష్ఠ్యాంచరోహిణీ॥

తా॥ ద్వాదశియందు ఆశ్లేషయు, పాడ్యమియం దుత్తరాషాఢయు, విదియం దనూరాధయు, పంచమియందు మఖయు, తృతీయయందు ఉత్తర, ఉత్తరాభాద్ర, ఉత్తరాషాఢలు, ఏకాదశియందు రోహిణియు, త్రయోదశియందు స్వాతీ, చిత్తలు, సప్తమియందు హస్త, మూలలు, నవమియందు కృత్తికయు, అష్టమియందు పూర్వాషాఢయు, షష్ఠియందు రోహిణియు, శుభకార్యములయందు నింద్యములు.

## మాసశూన్య నక్షత్రములు.

శ్లో॥ కథాస్రభేత్వాష్ట్ర వాయూవిశ్వేజ్యౌభగవాసవౌ వైశ్వశ్రు
తీపాశి పౌష్ణేఅజపాదగ్నిపిత్ర్యభే ॥ చిత్రాద్వీశౌశివాశ్వ్యర్కాః శ్రుతి
మూలేయమేంద్రభే। చైత్రాదిమాసేశూన్యాఖ్యాస్తారావిత్తవినాశదాః॥

తా॥ చైత్రమాసమందశ్వనీ రోహిణులు, వైశాఖమందు చిత్తాస్వాతులు, జ్యేష్ఠమందు పుష్యోత్తరాషాఢలు, ఆషాఢమందు పుబ్బ ధనిష్ఠలు, శ్రావణమందు శ్రవణోత్తరాషాఢలు, భాద్రపదమందు రేవతీ శతభిషములు, ఆశ్వయుజమందు పూర్వాభాద్ర, కార్తికమందు మఖాకృత్తికలు, మార్గశీర్షమందు చిత్రావిశాఖలు పుష్యమందు ఆర్ద్రాశ్వనిహస్తలు, మాఘమందు మూలాశ్రవణములు, ఫాల్గుణమందు భరణీ జ్యేష్ఠలును, శూన్యనక్షత్రములుగాన శుభకార్యములయందు వర్జించవలెను.

## మాస శూన్యరాసులు.

శ్లో॥ ఘటోర్ఝుషోగౌర్మిధునం మేషకన్యాలితౌలినః।
ధనుఃకర్కోమృగస్సింహః చైత్రాదౌశూన్యరాశయః॥

తా॥ చైత్రాది మాసములయందు క్రమముగా కుంభము, మీనము, వృషభము, మిధునము, మేషము, కన్య, వృశ్చికము, తుల, ధనుస్సు, కటకము, మకరసింహములు శూన్యరాసులని యెఱుంగునది.

## తిథిశూన్య లగ్నములు.

శ్లో॥ పక్షాదితస్త్వోజతిథౌఘటైణౌమృగేంద్రనక్రౌమిధునాంగనేచ।
చాపేందుభేకర్కహరీహయాంత్యౌ గోంత్యౌచనేష్టేతిథిశూన్యలగ్నే॥



తా॥ ఉభయపక్షములయందు బేసి తిథులైన ౧, ౩, ౫, ౭, ౯, ౧౧, ౧౩, తిథులయందు క్రమముగా తులామకరములు, మకరసింహములు, కన్యామిథునములు ధనుఃకర్కాటకములు, సింహకటకములు, ధనుర్మీనములు, వృషభమీనములున్నూ శూన్యలగ్నములు.

## దుష్టయోగాపవాదము.

నారదః॥ శ్లో॥ తిథయోమాసశూన్యాశ్చ శూన్యలగ్నానియా
న్యపి। మధ్యదేశేవివర్జ్యాని నదూష్యాణీతరేషుచ ॥ పంగ్వంధకాణ
లగ్నాని మాసశూన్యాశ్చరాశయః । గౌడమాలవయోస్త్యాజ్యా అన్య
దేశేనగర్హితాః॥

తా॥ పైనచెప్పిన మాస శూన్యతిథులును, శూన్యలగ్నములును, మధ్యదేశమందు విడువదగినవి. ఇతరదేశములయం దదూష్యములు, పంగ్వంధకాణ రాశులున్నూ, శూన్యతిథులున్నూ, శూన్యరాశులున్నూ గౌడమాళవదేశములయందు త్యాజ్యములు, తదితరదేశములయందు గర్హితములు కావనియు నారదుఁడు చెప్పుచున్నాడు.

## వర్జ్యయోగములు

శ్లో॥ వర్జయేత్సర్వకార్యేషు హస్తార్కంపంచమీతిథౌ భౌమా
శ్వినీచసప్తమ్యాం షష్ఠ్యాంచంద్రేందవంతథా ॥ బుధానురాధామష్ట
మ్యాం దశమ్యాంభృగురేవతీం। నవమ్యాంగురుపుష్యం చైకాదశ్యాం
శనిరోహిణీం॥

తా॥ పంచమీ ఆదివార హస్తానక్షత్రములున్నూ, సప్తమీ కుజవార అశ్వనీ నక్షత్రములున్నూ, షష్ఠీమృగశీర్షా సోమవారములున్నూ, అష్టమీ బుధవారానూరాధలు, దశమీ శుక్రవార రేవతులు, నవమీ గురువార పుష్యములు, ఏకాదశీశనివార రోహిణులు, ఈయోగములు సమస్త శుభకార్యములయందు విడువఁదగినవి.

శ్లో॥ గృహప్రవేశేయాత్రాయాం వివాహేచయథాక్రమం।
భౌమాశ్వినీంశనౌబ్రాహ్మం గురౌపుష్యంచవర్జయేత్ ॥

తా॥ కార్యభేదముచేత విడువదగిన యోగములను చెప్పుచున్నాడు. గృహప్రవేశమునకు భౌమాశ్వినీయోగమున్నూ, యాత్రయందు శని రోహిణీయోగమున్నూ, వివాహమందు గురుపుష్యమీయోగమున్నూ, విడువఁదగినవి.

## ఆనందాది యోగములు.

శ్లో॥ ఆనందాఖ్యఃకాలదండశ్చ ధూమ్రోధాతాసౌమ్యోధ్వాంక్ష
కేతూక్రమేణశ్రీవత్సాఖ్యోవజ్రకం ముద్గరశ్చఛత్రంమిత్రం మానసం

పద్మలంబాః ఉత్పాతమృత్యూకిల కాణసిద్ధీ శుభోమృతాఖ్యోముసలంగ దశ్చ' మాతంగరక్షశ్చరసుస్థిరాఖ్య ప్రవర్ధమానాఃఫల నాశస్వనామ్నా॥

తా॥ ౧ ఆనంద ౨ కాలదండ ౩ ధూమ్రి ౪ ధాతృ ౫ సౌమ్య ౬ ధ్వాంక్ష ౭ ధ్వజ ౮ శ్రీవత్స ౯ వజ్ర ౧౦ ముద్గర ౧౧ ఛత్రి ౧౨ మిత్ర ౧౩ మానస ౧౪ పద్మ ౧౫ లంబమాన ౧౬ ఉత్పాత ౧౭ మృత్యు ౧౮ కాణ ౧౯ సిద్ధి ౨౦ శుభ ౨౧ అమృత ౨౨ ముసల ౨౩ గద ౨౪ మాతంగ ౨౫ రాక్షస ౨౬ చర ౨౭ స్థిర ౨౮ వర్ధమాన యోగము ఈ౨౮యోగములు యాత్రిమలుయందు తమ పేరునకు దగినఫలమునిచ్చును.

శ్లో॥ దస్రాదర్కేమృగాదింద్రా సార్పాద్భౌమేకరాద్బుధే। మైత్రాద్గురౌభృగౌవైశ్వా ద్గణ్యామందేచవారుణాత్॥

తా॥ ఈయోగముల దెలిసికొను విధమును చెప్పుచున్నాడు ఆదివారమునా డశ్విని మొదలు, సోమవారమునాడు మృగశీర్ష మొదలు, మంగళవారమునాడాశ్లేష మొదలు, బుధవారమునాడు హస్త మొదలు గురువారమునా డనూరాధ మొదలు, శుక్రవారమునాడు ఉత్తరాషాఢ మొదలు, శనివారమునాడు శతభిషక్ మొదలు, యోగ గణన చేయవలెను, అనగా అశ్వినితో గూడిన ఆదివారమున్నూ, మృగశీర్షతో గూడిన సోమవారమున్నూ, ఆశ్లేషతో గూడిన మంగళవారమున్నూ, హస్తతో గూడిన బుధవారమున్నూ, అనూరాధతో గూడిన గురువారమున్ను, ఉత్తరాషాడతో గూడిన శుక్రివారమున్న, శతభిషముతో గూడిన శనివారమున్నూ ఆనందయోగములు భరణీ ఆర్ద్రి, మఖా, చిత్త, జ్యేష్ట, అభిజిత్, పూర్వాభాద్రిలతో గూడిన ఆది, సోమ, మంగళ, బుధ, గురు, శుక్రి, శనివారములు, కాలదండయోగములు ఈవిధముననే మిగిలినవియు నూహించవలెను. ఈయోగములలో ఆనందయోగ మానందకరము, కాలదండయోగము భయంకరము, ఇట్లేయోగ ఫలముల నూహించునది.

శ్లో॥ ధ్వాంక్షేవజ్రేముద్గరేచేషు నాడ్యోవర్జ్యా వేదాః పద్మలుంబేగదేశ్వాః। ధూమ్రేకాణేమాసలేభూర్ద్వయం ద్వేరక్షోమృత్యూత్పాత కాలాశ్చసర్వే॥

తా॥ ఈ 28 యోగములలో ధ్వాంక్షాది త్రియోదశ దుష్టయోగములయం దత్యంతము పీడాకరములైన నాడీసంఖ్యను చెప్పుచున్నాడు. ధ్వాంక్ష ముద్గర యోగములయందు ౫ ఘడియలును పద్మ లంబమానయోగములయందు 4 ఘడియలును, గదాయోగమందు 7 ఘడియలును, ధూమ్రియందు 1 ఘడియయును, కాణ ముసల యోగములయందు 2 ఘడియలున్ను, మిక్కిలి హానికరములుగనుక ఆవశ్యకమైన కార్యము సంభవించి నప్పుడీ ఘడియలనువిడిచి మిగిలిన కాలమందు యాత్రిమలు జరుప



వచ్చును మృత్యు, ఉత్పాత, కాలదండ, రాక్షస, యోగములెంతఆవశ్యకమైన కార్యములున్నను సంపూర్ణముగా విడువవలయును.

—: యోగచక్రము :—

| ఆ॥ | సో॥ | మం॥ | బు॥ | గు॥ | శు॥ | శ॥ | యోగములు, | ఫలములు, ఘ॥ | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| అ | మృ | ఆశ్లే | హ | అనూ | ఉషా | శత | ఆనంద | కార్యసిద్ధి | |
| భ | ఆ | మ | చి | జ్యే | అభి | పూభా | కాలదండ | మృత్యు | |
| కృ | పున | పు | స్వా | మూ | శ్రి | ఉ | ధూమ్ర | కార్యభంగ | ౧ |
| రో | పు | ఉ | వి | పూ | ధ | రే | ధాతృ | సౌభాగ్యం | |
| మృ | ఆ | హ | అ | ఉ | శ | అ | సౌమ్య | సుఖము | |
| ఆర్ద్రి | మ | చి | జ్యే | అభి | పూ | భ | ధ్వాంక్ష | ధనక్షయం | ౫ |
| పున | పు | స్వా | మూ | శ్రి | ఉ | కృ | కేతు | సౌభాగ్యం | |
| పు | ఉ | వి | పూ | ధ | రే | రో | శ్రీవత్స | సంపత్ | |
| ఆశ్లే | హ | అ | ఉ | శ | అ | మృ | వజ్రి | కార్యభంగ | ౫ |
| మఖ | చి | జ్యే | అభి | పూ | భ | ఆ | ముద్గర | కార్యహాని | ౫ |
| పూఫ | స్వా | మూ | శ్రి | ఉ | కృ | పున | ఛత్ర | రాజసన్మా | |
| ఉఫ | వి | పూషా | ధ | రే | రో | పు | మిత్ర | పుష్టి | |
| హ | అన | ఉ | శ | అ | మృ | ఆ | మానస | సర్వలాభం | |
| చి | జ్యే | అభి | పూభా | భ | ఆ | మ | పద్మ | లాభ | ౪ |
| స్వా | మూ | శ్రి | ఉభా | కృ | పున | పు | లంబ | కార్యహాని | ౪ |
| వి | పూ | ధ | రే | రో | పు | ఉ | ఉత్పాత | మృత్యు | - |
| అనూ | ఉ | శ | అ | మృ | ఆ | హ | మృత్యు | మృత్యు | - |
| జ్యే | అభి | పూ | భ | ఆ | మ | చి | కాణ | క్లేశము | ౨ |
| మూ | శ్రి | ఉ | కృ | పున | పు | స్వా | సిద్ధి | కార్యసిద్ధి | |
| పూషా | ధ | రే | రో | పు | ఉ | వి | శుభ | శుభము | |
| ఉషా | శ | అ | మృ | ఆ | హ | అ | అమృత | సర్వసిద్ధి | |
| అభి | పూ | భ | ఆ | మ | చి | జ్యే | ముసల | కార్యహాని | ౨ |
| శ్రి | ఉ | కృ | పున | పు | స్వా | మూ | గదా | బంధనం | ౭ |
| ధ | రే | రో | పు | ఉ | వి | పూ | మాతంగ | వృద్ధిలాభం | |
| శ | అశ్వి | మృ | ఆ | హ | అనూ | ఉ | రాక్షస | పీడ | |
| పూభా | భ | ఆ | మ | చి | జ్యే | అభి | చర | కార్యసిద్ధి | |
| ఉభా | కృ | పున | పు | స్వా | మూ | శ్రి | స్థిర | కార్యసిద్ధి | |
| రే | రో | పు | ఉ | వి | పూ | ధ | వర్ధమాన | శుభం | |

## రవియోగములు.

శ్లో॥ సూర్యభాద్వేదగోతర్క దిగ్విశ్వనఖసమ్మితే। చంద్రర్క్షే రవియోగాస్స్యుర్దోషసంఘవినాశకాః॥

తా॥ సూర్యుఁడున్న నక్షత్రము మొదలు దిననక్షత్రమువఱకు లెక్కించగా దిననక్షత్రము సూర్యనక్షత్రమునకు ౪, ౯, ౬, ౧౦, ౧౩, ౨౦ వ దైన యెడల నది రవియోగ మనబడును, ఈరవియోగ నక్షత్రములు పూర్వోక్తదుష్టయోగ దోషములను గూడ గొట్టివేయును.

## సిద్ధియోగములు.

శ్లో॥ సూర్యేర్కమూలోత్తరపుష్యదాస్రం చంద్రే శ్రుతిబ్రాహ్మశశీజ్యమైత్రం భౌమేశ్వ్యహిర్బుధ్న్యకృశానుసార్పం జ్ఞే బ్రాహ్మమైత్రార్కకృశానుచాంద్రం॥ జీవేంత్యమైత్రాశ్వ్యదితీజ్యధిష్ణ్యం శుక్రేంత్యమైత్రాశ్వ్యదితిశ్రవోభం శనౌశ్రుతిబ్రాహ్మసమీరభాని సర్వార్థసిద్ధ్యై కథితానిపూర్వైః॥

తా॥ ఆదివారమునందు హస్త మూల, ఉత్తరాత్రయ, పుష్య, అశ్వనులున్ను, సోమవారమందు శ్రవణ- రోహిణీ- మృగశిర- పుష్య- అనూరాధలున్ను, మంగళవారమందు అశ్వనీ - ఉత్తరాభాద్ర - కృత్తిక - ఆశ్లేషలున్ను, బుధవారమందు రోహిణీ- అనూరాధ- హస్త- కృత్తిక- మృగశీర్షలున్ను, గురువారమందు రేవతీ అనూరాధ- అశ్విని- పునర్వసు- పుష్యములున్ను, శుక్రవారమందు రేవతి - అనూరాధ- అశ్విని- పునర్వసు- శ్రవణములున్ను, శనివారమందు శ్రవణ- రోహిణీ- స్వాతులున్ను సిద్ధియోగములు. ఈయోగములు సర్వార్థప్రదములని పూర్వులచేఁ జెప్పఁబడియున్నవి.

## ఉత్పాతాది యోగములు.

శ్లో॥ ద్వీశాత్తోయాద్వాసవాత్పౌష్ణభాచ్చబ్రాహ్మాత్పుష్యాదర్యమర్క్షాచ్చతుర్భైః స్యాదుత్పాతోమృత్యుకాణౌచ సిద్ధిర్వారేర్కాద్యే తత్ఫలంనామతుల్యమ్॥

తా॥ ఆదివారమందు విశాఖ మొదలున్ను, సోమవారము పూర్వాషాఢ మొదలున్ను, మంగళవారమునందు ధనిష్ఠ మొదలు బుధవారమందు రేవతి మొదలున్ను, గురువారమునాడు రోహిణి మొదలు, శుక్రవారమునందు పుష్యమి మొదలు శనివారమునం దుత్తర మొదలున్ను నాల్గునక్షత్రములు క్రమముగా ఉత్పాతమృత్యుకాణ సిద్ధియోగములనఁబడును, ఈయోగములు నామార్థములకుఁ దగిన ఫలముల నిచ్చును.



## ఉత్పాతాది యోగచక్రము.

| ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని | వారములు. |
|---|---|---|---|---|---|---|---|
| విశా | పూషా | ధ | రే | రో | పుష్య | ఉ | ఉత్పాత |
| అనూ | ఉషా | శ | అశ్వ | మృ | ఆశ్లే | హ | మృత్యు |
| జ్యేష్ఠ | శ్ర | పూభా | భ | ఆర్ద్ర | మ | చి | కాణ |
| మూల | ధ | ఉభా | కృత్తి | పున | పూఫ | స్వా | సిద్ధి |

## దేశభేదముచేత దుష్టయోగ పరిహారము.

శ్లో॥ కుయోగాస్తిథివారోత్థాస్తిథిభోత్థాభవారజాః। హూణవంగఖసేష్వేవ వర్జ్యాస్త్రితయజాస్తథా॥

తా॥ పైనచెప్పఁబడిన దుష్టయోగములన్నియు, అనగా తిధివార సంయోగము వలనగాని తిధినక్షత్రసంయోగమువలనగాని వారనక్షత్ర సంయోగమువలనగాని తిధివారనక్షత్ర వారనక్షత్రసంయోగమువలనగాని కలిగిన దుష్టయోగములు హూణబంగాళదేశములయందును, ఉత్తరహిందూస్థానమందును అశుభకరములు తదితరదేశములయందు నింద్యములుగావు.

## సకల శుభకార్యములయందు విడువవలసిన కాలములు.

శ్లో॥ సర్వస్మిన్విధుపాపయుక్తనులవావర్ధనిశాహ్నోర్ఘటీ। త్ర్యంశంవైకునవాంశకం గ్రహణతః పూర్వందినానాంత్రయం। ఉత్పాతగ్రహతో ద్ర్యహంశ్చ శుభదోత్పాతైశ్చదుష్టందినం షణ్మాసంగ్రహభిన్నభం త్యజశుభేయాద్ధం తథోత్పాతభమ్॥

తా॥ చంద్రపాపగ్రహయుక్త లగ్ననవాంశలను, మధ్యాహ్నార్ధ రాత్రుములయందు ఘటికాత్రిభాగమును, నవాంశను గ్రహములకు పూర్వము మూఁడుదినములన్ను

ఉత్పాతములయందును సంపూర్ణగ్రహణమందును యేడుదినములను, ఫలపుష్పపతనాది శుభోత్పాతములయందొక దినమును, ఆఱుమాసములవఱకు గ్రహణనక్షత్రమును, గ్రహయుద్ధనక్షత్రమును, ఉత్పాతనక్షత్రమును, సకల శుభకార్యములయందు విడువవలయును.

శ్లో॥ నేష్టంగ్రహర్క్షంసకలార్ధపాద గ్రాసక్రమాత్తర్కగుణేందుమాసాః । పూర్వంపరస్తాదుభయో ఘస్రాగ్రస్తేస్తగేవాభ్యుదితేర్ధఖండే ॥

తా॥ గ్రాసభేదముచేత గ్రహణనక్షత్ర త్యాజ్యకాల పరిమాణమును చెప్పుచున్నాడు. సంపూర్ణగ్రాస మందాఱుమాసముల వఱకును అర్ధగ్రహణమందు మూడు మాసముల వఱకును, పాదగ్రహణమందొక మాసమువఱకును గ్రహణనక్షత్రమునువిడువవలయును. గ్రస్తాస్తమయ ఖండగ్రహణమందు పూర్వము 3 దినములును గ్రస్తోదయ ఖండగ్రహణమందు పరము 3 దినములును శుభకార్యములు చేయగూడదు.

శ్లో॥ జన్మర్క్షమాసతిథయో వ్యతీపాతభద్రావైధృత్యమాపితృదినాని తిథిక్షయర్ధీ । న్యూనాధిమాసకులికా ప్రహరార్ధపాత విష్కంభవజ్రఘటికాత్రయమేవవర్జ్యం ॥

తా॥ జన్మనక్షత్రము, జన్మమాసము, జన్మతిథి, వ్యతీపాత, భద్ర, వైధృతి, అమావాస్య, శ్రాద్ధదినము, త్రిదినస్పృక్, దినత్రయము, క్షయమాసము, అధికమాసము, కులికయోగము, ప్రహరార్ధయోగము, మహాపాత, విష్కంభ వజ్రయోగములయందు 3 ఘడియలును శుభకార్యములయందు వర్జ్యములు.

శ్లో॥ పరిఘార్ధంపంచశూలే షడ్గండాతిగండయోః । వ్యాఘాతేనవనాడ్యశ్చ వర్జ్యాస్సర్వేషుకర్మసు ॥

తా॥ పరిఘపూర్వార్ధమున్నూ, శూలయోగమందు ౫ ఘడియలున్నూ, గండాతిగండములయందు ౬ ఘడియలును, వ్యాఘాతమందు ౯ ఘడియలును, శుభకర్మలయందు వర్జ్యములు.

## పక్షచ్ఛిద్రములయందు విడువవలసిన ఘడియలు.

శ్లో॥ వేదాంగాష్టనవార్కేంద్ర పక్షరంధ్రతిథౌత్యజేత్ । వస్వంకమనుతత్త్వాశాశరానాడ్యః పరాశ్శుభాః ॥

తా॥ పక్షచ్ఛిద్రములైన చతుర్థి, షష్ఠి, అష్టమి, ద్వాదశి చతుర్దశులయందు క్రమముగా ౮, ౯, ౧౪, ౨౫, ౧౦, ౫ ఘటికలను విడచి మిగిలిన కాలమందు శుభకార్యములు జేయవచ్చును.



## గుళికాది ముహూర్తములు.

శ్లో॥ గుళికః కాలవేలాచ యమఘంటశ్చకంటకః । వారాద్విఘ్నక్రమాన్మందే బుధేజీవేకుజేక్షణాః ॥

తా॥ వర్తమానవారము మొదలు శనివారము వఱకు లెక్కించి సామొత్తమును, ౨ చేత హెచ్చించగా వచ్చిన మొత్తం గులికము ఇట్లె బుధవారమువరకు లెక్కించిన కాలవేళయనబడును. గురువారమువరకు లెక్కించిన యమకంటకము కుజవారము వఱకు లెక్కించిన కంటకమనబడును. అనగా ఆదివారమందు ౧౪ ముహూర్తము గులికము. ౮ కాలవేలా, ౧౦ యమకంటకము. ౬ కంటకము, అని తెలుసుకునేది.

## వార దుర్ముహూర్తములు.

శ్లో॥ సూర్యేషట్స్వరనాగ దిఙ్మనుమితాః చంద్రేబ్ధిషట్కుంజరాంకార్కవిశ్వపురందరాః క్షితిసుతేద్వ్యబ్ధ్యగ్నితర్కాదశ । సౌమ్యేద్వ్యబ్ధిగజాంకదిఙ్మనుమితాః జీవేద్విషడ్భాస్కరాః । శక్రాఖ్యాస్సిథయః కలాశ్చభృగుజేవేదేషుతర్కగ్రహాః ॥ దిగ్భాస్కరామనుమితాశ్చ శనౌశశిద్వినాగాదిశోభవదివాకరసమ్మితాశ్చ । దుష్టక్షణాఃగులికకంటకకాలవేలాః స్యుశ్చార్ధయామయమఘంట గతాఃకలాంశాః ॥

తా॥ ఆదివారమందు 6, 7, 8, 10, 14, ముహూర్తములును, సోమవారమందు 4, 6, 8, 9, 12, 13, 14 ముహూర్తములును, మంగళవారమందు 2, 4, 3, 6, ౧౦ ముహూర్తములును బుధవారమందు 2, 4, 8, 9, 10, 14 ముహూర్తములును, గురువారమందు 2, 6, 12, 14, 15, 16 ముహూర్తములును, శుక్రవారమందు 4, 5, 6, 9, 10, 12, 14 ముహూర్తములును, శనివారమందు 1, 2, 8, 10, 11, 12, ముహూర్తములును నింద్యములు. అనగా దుష్టక్షణము, గులికము, కంటకము, కాలవేళ, అర్ధయామము యమఘంటకములు, అనుయోగములు యథావకాశమేగానగును. తాత్కాలికాహః ప్రమాణమును, 16 చేత భాగించగా వచ్చిన లబ్ధము ముహూర్తకాల పరిమాణమగును.

## హోళికాష్టక నిషేధము.

శ్లో॥ విపాశేరావతీతీరే శతద్రోశ్చత్రిపుష్కరే । వివాహాదిశుభేనేష్టం హోళికాప్రాగ్దినాష్టకమ్ ॥

తా॥ విపాశానదీ, ఇరావతీనదీ, శతద్రునదీతీరములయందున్ను, త్రిపుష్కర దేశమందున్ను, ఫాల్గుణశుక్ల పూర్ణిమకు పూర్వము ౮ దినములు వివాహాది శుభకార్యములు జేయకూడదు.

## మృత్యుయోగాదుల కపవాదము.

శ్లో॥ మృత్యుక్రకచదగ్ధాదీ నిందౌశ స్తేశుభాంజగుః । కేచిద్యా మోత్తరంచాన్యే యాత్రాయామేవనిందితాః॥

తా॥ చంద్రబలమున్నప్పుడు మృత్యుక్రకచదగ్ధాదిదుష్టయోగములు శుభప్రద ములగును యామోర్ధ్వము శుభప్రదములని కొందరు చెప్పిరి. మఱికొందఱు యాత్రయందే నింద్యములుగాని మిగిలిన కార్యములయం దనింద్యములని చెప్పిరి.

శ్లో॥ అయోగేసుయోగోపి చేత్స్యాత్తదానిమయోగంనిహత్యై షసిద్ధింతనోతి । పరేలగ్నశుద్ధ్యాకుయోగాదినాశం దినార్ధోత్తరంవిష్టి పూర్వంచశస్తమ్॥

తా॥ దుష్టయోగమందు సుయోగముండెనేని యాదుష్టయోగ ఫలమును నివా రించి శుభఫలమునిచ్చును, లగ్నము బలవంతమైనచో దుష్టయోగ నాశనమును చేయు నని కొందఱు చెప్పిరి, మధ్యాహ్నమునకుఁ బరమందును విష్టిక పూర్వమందు దుష్ట యోగములు ఫలముల నివ్వఁజాలవని మఱికొందఱు చెప్పిరి.

## భద్రాయోగము.

శ్లో॥ శుక్లేపూర్వార్ధేష్టమీపంచదశ్యోః, భద్రైకాదశ్యాం చతుర్థ్యాంపరార్ధే। కృష్ణేంత్యార్ధేస్యాత్తృతీయాదశమ్యోః పూర్వేభాగే సప్తమీశంభుతిథ్యోః॥

తా॥ శుక్లపక్షమందు అష్టమీపూర్ణిమలయొక్క పూర్వార్ధమున్ను, ఏకాదశీ చతుర్థులయొక్క పరభాగమున్ను, కృష్ణపక్షమందు తృతీయాదశములయొక్క పరభాగ మున్ను, సప్తమీచతుర్దశులయొక్క పూర్వభాగమున్ను భద్రయనఁబడును.

శ్లో॥ పంచద్వ్యద్రికృతాష్టరామ రసభూయామాదిఘట్యశ్శరా। విష్టేరాస్యమసద్గజేంద్రప్రసరామాద్ర్యశ్విబాణాబ్ధిషు । యామేష్వంతి ఘటీత్రయంశుభకరం పుచ్ఛంతథావాసరే విష్టిస్తిథ్యపరార్ధజా శుభకరీరాత్రౌతుపూర్వార్ధజా॥

తా॥ భద్రకు ముఖపుచ్ఛవిభాగమును జేయుచున్నాడు 5, 2, 7, 4, 8, 3, 6, 1 యామముల మొదట ౫ ఘటికలు భద్రకు ముఖము ఇది శుభకర్మలకు అయోగ్య ము 8, 1, 6, 3, 7, 2, 5, 4, యామముల చివరను 3 ఘటికలు భద్రాపుచ్ఛము. ఇది మంగళకరము తిథిపూర్వార్ధజాతయైన భద్ర రాత్రియందును అపరార్ధజాత యైన భద్రదివమందును శుభకరియగును, పూర్వోక్తయామ సంఖ్యాక్రమముగా చతుర్థీ అష్టమీ, ఏకాదశీ, పూర్ణిమా, తృతీయా, సప్తమీ, దశమి, చతుర్దశులయందు



గ్రహించవలసినది అనగా చతుర్థియందు ౫ వ యామాదిని 5 ఘటికలు ముఖము 8 వ యామాంతమున 3 ఘటికలు పుచ్ఛము, ఇట్లే ఊహించవలెను.

శ్లో॥ కుంభకర్కద్వయేమర్త్యే స్వర్గేబ్జేజాత్రయేలిగే । స్త్రీధనుర్జూకనక్రేధో భద్రాయత్రైవతత్ఫలమ్॥

తా॥ చంద్రుఁడు, కుంభ, మీన, కటక, సింహములయందుండగా మర్త్యలోక మందును, మేష, వృషభ, మిథున, వృశ్చికములయందుండగా స్వర్గమందును, కన్యా, తుల, ధనుర్మకరములయందుండగా పాతాళలోకమందును, భద్రయుండునుగాన, భద్ర లేనిలోకములయందు తద్దోషములేదు.

## గురుశుక్రమాఢ్య వర్జ్యములు.

శ్లో॥ వాప్యారామతటాకకూప భవనారంభప్రతిష్ఠేవ్రతా। రంభోత్సర్గవధూప్రవేశన మహాదానానిసోమాష్టకే । గోదానాగ్రయణప్రపా ప్రథమకోపాకర్మవేదవ్రతమ్ । నీలోద్వాహమథాతిపన్న శిశుసంస్కారానురస్థాపనం దీక్షామౌంజివివాహముండనమపూర్వం దేవతీర్థేక్షణం । సన్న్యాసాగ్నిపరిగ్రహౌ నృపతిసందర్శాభిషేకౌగమం। చాతుర్మాస్యసమావృతీ శ్రవణయోర్వేధం పరీక్షాంత్యజేత్ । వృద్ధత్వాస్తశిశుత్వఇజ్యసితయోః న్యూనాధిమాసేతథా॥

తా॥ గురుశుక్రులయొక్క మాఢ్యములందు అనగా వృద్ధత్వ, బాల్య అస్తమయ ములయందు, వాప్యారామ తటాకకూప గృహారంభ గృహప్రవేశములును, వ్రతా రంభ వ్రతోద్యాపన వధూప్రవేశ మహాదానసోమయాగాష్టకాశ్రాద్ధములును, సాగ్రత కేష్టిసంచయన ప్రపాప్రథమోపాకర్మ వేదవ్రతములును, కామ్యవృషోత్సర్గవివాహాతీత జాతకర్మాది శిశుసంస్కార దేవప్రతిష్ఠలును, దీక్షోపనయన చూడాకర్మలును, అపూ ర్వదేవతీర్థదర్శనమును, సన్న్యాసగ్రహణము, అగ్నిస్వీకారమును, రాజదర్శనమును, రాజ్యాభిషేకము, యాత్రయు, చాతుర్మాస్యవ్రతములు, సమావర్తనము, కర్ణవేధ పరీక్షలు, చేయగూడదు. క్షయాధిక మాసములయందుగూడ నీచెప్పిన కర్మలఁజేయఁ గూడదని తా॥

## సింహమందు గురువుండగా వర్జింపదగిన కార్యములు

శ్లో॥ అస్తేవర్జ్యంసింహనక్రస్థజీవే । వర్జ్యం కేచిద్వక్రగేచాతిచారే। గుర్వాదిత్యేవిశ్వఘస్రేపిపక్షేప్రోచుస్తద్వద్దంతరత్నాదిభూషామ్॥

తా॥ గురుడస్తమించినప్పుడే వివర్జ్యములో, అవియన్నియు గురుఁడు సింహ మకరములయందుండగానున్ను, వక్రించినప్పుడును, అతిచారగతుఁడైనపుడును, గురు

సూర్యులు కలసియున్నప్పుడును, పక్షమునకు, ౧౩ దినములు వచ్చినప్పుడును శుభాచరింపగూడదని కొందఱు చెప్పిరి. రత్నదంతాద్యలంకారములను ధరింపగూడదని తా॥

సింహస్థ గురుదోషాపవాదము.

శ్లో॥ సింహేగురౌసింహలవే వివాహోనేష్టోథగోదోత్తరతశ్చయావత్ । భాగీరథీయామ్యతటంహిదోషో । నాన్యత్రదేశేతవనేపిమేషే॥

తా॥ సింహమందు గురువుండగా గంగాగోదావరీ మధ్యదేశమందు సింహాంశయందు వివాహాదులాచరింపగూడదు. తదితర దేశములయందు చేయవచ్చును మేషమందు సూర్యుడుండగా గూడ యిదేపరిహారము చేయునది.

శ్లో॥ మఖాదిపంచపాదేషు గురుస్సర్వత్రనిందితః । గంగాగోదాంతరంహిత్వా శేషాంఘ్రిషునదోషకృత్ ॥ మేషేర్కేసద్వ్రతోద్వాహా గంగాగోదాంతరేపిచ । సర్వసింహగురుర్వర్జ్యః కలింగేగౌడఘూర్జరే ।

తా॥ (మతాంతరము) గురువు సింహమందుండగా మఖాది పంచపాదములయందు సకలదేశములయందును శుభకర్మ లాచరింపగూడదు, తదితర పాదములయందు గంగాగోదావరీ మధ్యదేశముగాక నితరదేశములయందు శుభకర్మలాచరింపవచ్చును కళింగ గౌడ ఘూర్జరదేశములయందు సింహమునంతను శుభకార్యముల జేయగూడదు సింహమందు గురువుండగా మేషమందు సూర్యుడుండిన యెడల గంగాగోదావరీ మధ్యదేశమందు వివాహోపనయనము లాచరింపవచ్చును.

మకరస్థ గురుదోషాపవాదము.

శ్లో॥ రేవాపూర్వేగండకీ పశ్చిమేచ శోణస్యోదగ్దక్షిణేనీచఇజ్యః । వర్జ్యోనాయంకొంకణే మాగధేచగౌడేసింధౌ వర్జనీయశ్శుభేషు॥

తా॥ నర్మదాపూర్వభాగమందున్ను, గండకీ పశ్చిమభాగమునందును శోణాదక్షిణోత్తర తీరములయందును శుభములయందు మకరగురువును విడువవలెను. కొంకణ మాగధ, సింధుదేశములయందట్టి గురువు నింద్యుడుకాడు.

లుప్తసంవత్సర దోషాపవాదము.

శ్లో॥ గోజాంత్యకుంభేతరభేతి చారగోనోపూర్వరాశిం గురురేతి వక్రితః। తదావిలుప్తాబ్దఇహాతినిందితః శుభేషురేవాసురనిమ్నగాంతరే॥

తా॥ గురువు, మేష, వృషభ, కుంభ, మీన రాసులనువిడిచి మిగిలిన రాసులలో నతిచారగతుడై వక్రించి పూర్వరాశిని యెప్పుడు పొందడో అప్పుడు లుప్తాబ్ద



మని పేరు ఆలుప్తసంవత్సరమందు శుభము లాచరించగూడదు. ఈదోషము గంగా నర్మదా మధ్యదేశమందుగాని ఇతరదేశములయందు లేదని తాత్పర్యము.

వార ప్రవృత్తి.

శ్లో॥ పాదోనరేఖాపరపూర్వయోజనైః పలైర్యుతో నాస్తిధయో దినార్ధతః । ఊనాధికాస్తద్విపరోద్భవైః పలైస్తూర్ధ్వాం తథాధోదినః ప్రవేశః॥

తా॥ లంకా సుమేరువులకు నొకసూత్రమునుబట్టగా నాసూత్రమునకు క్రింది దేశములు మధ్యరేఖలనబడును ఏదేశమందువారప్రవృతికావలెనో ఆదేశము ఈమధ్యరేఖకు ప్రాక్పశ్చిమములయందు ఎన్నియోజనముల దూరములోనున్నదో అన్ని పలములుగా నెంచవలెను ఈపలసంఖ్యలో నాల్గవ వంతు తీసివేయవలెను, ఇష్టదేశము పశ్చిమమందైన యెడల మిగిలిన మూడువంతులను ౧౫ తో కలపవలెను. ఈ ౧౫ ఘటికలు, ఇష్టదేశము ప్రాక్యందైన యడల ఈ ౧౫ ఘటికలలో తీసివేయవలెను తర్వాత ఏదినమందు వారప్రవృత్తికావలెనో నాదినాహస్సును రెండుభాగములు చేయగా పైమొత్తము ఈదినార్ధముకంటె తక్కువాయెనా ఎన్నిఘటికలు పలములు తక్కువగునో సూర్యోదయానంతరము అన్ని ఘటికల అన్నిపలములకును పైమొత్తము దినార్ధముకంటె నెక్కువాయనా ఎంతయెక్కువైనదో సూర్యోదయానకుపూర్వము అంతకాలమునకును వారపరివృత్తియగును.

ఉదాహరణ॥ మధ్యరేఖకు ఇష్టదేశము 64 యోజనములుగాన 64 పలములు, 4 భాగము 16 శేషము, 48 ఘటికలు, 15 పశ్చిమమైతే ఘ 15 ప॥ 48 తూర్పునైతే ఘ 14 ప 12 ఇష్టదినార్ధము ఘ 16-0, క్రమముగా తీసివేత, 16-0 లో 15-48తీసివేయగా మిగిలినది ఘ 0-ప- 12-16-0 లో 14-12 తీసివేయగా మిగిలినది 1-48- గాన, సూర్యోదయానంతరం, పశ్చిమానైతె 0-12 కిని- తూర్పునైతె 1-48 కిని వారపరివృత్తి దినార్ధముకంటె నెక్కువాయనా అనగా దినార్ధము ఘ 13-0, 15-48 లో 13-0, తీసివేయగా మిగిలినది 2-48-14-12, లో 13.0 తీసివేయగా మిగిలినది 1-12 గాన, ఉదయానకు పూర్వం పశ్చిమైతె 2-48 కిని తూర్పునైతె1-12 కిని వారప్రవేశము అగును.

శ్లో॥ వారాదెఘటికాద్విఘ్నా స్త్యాత్ఖహృచ్ఛేష వర్జితాః। సైకాత్సప్తానగైః కాలహోరేశాదినపాత్క్రమాత్ ॥

తా॥ అతీతానంతర శ్లోకోక్తవార ప్రవేశకాలము మొదలు ఇష్టఘటీ సంఖ్యను 2 చేత హెచ్చించి 5 చేత భాగించగా వచ్చిన శేషమును పైవిభాజ్యములో తీసివేసి 1 కలిపి 7 చేత భాగించగావచ్చిన శేషము వారముమొదలు కాలహోరేశసంఖ్యయగును

(యథా) రవివాసర ఇష్టఘటికాః 7 తాద్విగుణితాః (7=2) 14 భవతి పంచభిః హృతానుసతీషు (5) (14) (2) శిష్టాః ర చతుర్దశానాంమధ్యే చతస్రః త్యక్త్వా శిష్టానుదశను 10 ఏకాంసంయోజ్య 7 సప్తభిః హృతాను శిష్టాః 4 రవివారమారభ్య క్రిమాత్ గణనయాబుధోభవతి అతః కాలహోరేశోబుధః॥

## కాలహోరా ప్రయోజనము.

శ్లో॥ వారేప్రోక్తంకాలహోరాసుతస్యధిష్ణ్యేప్రోక్తంస్వామితిథ్యం శకేస్య । కుర్యాద్దిక్ఛూలాదిచిత్యంక్షణేషు నైవోల్లంఘ్యాః పారిఘశ్చాపిదండః॥

తా॥ ఏవారమందు ఏకర్మవిహితంగా జెప్పబడియున్నదో ఆవారమందు ఆకర్మ జేయుటకు అనుకూలపడనంతట్లో ఇతరవారములయందైనను ఆవారాధిపతియొక్క కాలహోరయందు, జేయదగినది. ఇట్లె ఏనక్షత్రమందు ఏకర్మజేయదగినదో ఇతరనక్షత్రమందును ఆనక్షత్రస్వామి ముహూర్తమందు ఆకర్మజేయవచ్చును ముహూర్తములయందు దిక్ఛూలవారశూలలను విచారించవలెను పరిఘాదండములు దాటగూడదు.

### పై దానికి ఉదాహరణము. (మన్వాదులు)

గురువారమందు గమనము విహితము, అది ఆవారమందు జరుగదు ఆదివారమందైనను, ఆగురుకాలహోరయందు గమనము జేయవచ్చును. ఇట్లె నక్షత్రోక్తకర్మ తన్నక్షత్రస్వామి ముహూర్తమందు జేయవచ్చును. (ఇది అత్యావశ్యకమైనప్పుడు)

శ్లో॥ మన్వాద్యాశ్శ్రుతితిథీమధా తిథిరవీఊర్జేశుచాది క్తిథీ జ్యేష్ఠేంత్యేచతిథి స్స్విషేనవతపస్యశ్యాః సహస్యేశివాః । భాద్రేగ్నిశ్చసితేత్వమాష్టనభసః కృష్ణేయుగాద్యాశ్సితే గోగ్నిబాహులరాధయోర్మ దనదశో భాద్రేమాఘాసితే॥

ఇతి ముహూర్తచింతామణౌ ప్రథమంశుభాశుభప్రకరణంసమాప్తం.

తా॥ చైత్రశుక్లతృతీయా పౌర్ణమాసులును కార్తీకశుక్ల పూర్ణిమా ద్వాదశులును, ఆషాఢశుక్లదశమీ పూర్ణిమలును, జ్యేష్ఠ పూర్ణిమయు, ఫాల్గునపూర్ణిమయు, ఆశ్వయుజ శుక్లనవమియు, మాఘశుక్ల సప్తమియును, పుష్యశుక్లైకాదశియును, భాద్రపదశుక్ల తృతీయయు, శ్రావణ కృష్ణాష్టమ్యమావాస్యలును, మన్వాదులు, కార్తీకశుక్ల నవమియు, వైశాఖశుక్ల తృతీయము, భాద్రపద బహుళ త్రయోదశియు, మాఘామావాస్యయు, యుగాదులు ఇవి వివాహాదులయందువిడువదగినవి.

ఈ ప్రకారముగా ముహూర్తచింతామణియందు మొదటిదైన శుభాశుభప్రకరణము ముగిసెను.



## నక్షత్రాధి పతులు.

శ్లో॥ నాసత్యాంతకవహ్నిధాతృశశభృద్రుద్రాదితీజ్యోరగాఖుక్షేశాః పితరోభగోర్యమరవీత్వష్టా సమీరఃక్రమాత్ । శక్రాగ్నీఖలు మిత్రఇంద్రనిరృతిః క్షీరాణివిశ్వేవిధి గోవిందోవసుతోయపాజచరణాహిర్బుధ్న్యపూషాభిధాః॥

తా॥ అశ్వినికి అశ్వనీదేవతులు, భరణికి యముడు, కృత్తికకు అగ్ని, రోహిణికి బ్రహ్మ, మృగశిరకు చంద్రుడు, ఆర్ద్రకు శివుడు, పునర్వసునకు అదితి, పుష్యమికి బృహస్పతి, ఆశ్లేషకు సర్పము, మఖకు పితరులు, పుబ్బకు భగుడు, ఉత్తరకు అర్యముడు, హస్తకు సూర్యుడు, చిత్రకు విశ్వకర్మయు, స్వాతికి వాయువు, విశాఖకు ఇంద్రాగ్నులు, అనూరాధకు సూర్యుడు, జ్యేష్ఠకు నింద్రుడు, మూలకు నిరృతి పూర్వాషాఢకు నుదకములు, ఉత్తరాషాఢకు విశ్వదేవతలు, అభిజిత్తుకు విధియు, శ్రవణమునకు విష్ణువు, ధనిష్ఠకు వసువులు, శతభిషమునకు వరుణుడు, పూర్వాభాద్రకు, అజైకపాదుడు, ఉత్తరాభాద్రకు అహిర్బుధ్న్యుడు, రేవతికి పూషుడును, అధిపతులు.

## ధ్రువ నక్షత్రములు.

శ్లో॥ ఉత్తరాత్రయరోహిణ్యో భాస్కరశ్చధ్రువంస్థిరం । తత్రస్థిరంబీజగేహ శాంత్యారామాదిసిద్ధయే ॥

తా॥ ఉత్తరాత్రయము, రోహిణి, భానువారము, ఇవిధ్రువ (స్థిర) సంజ్ఞలు, ఇవి బీజావాపన గృహారంభశాంతి, ఉద్యాపనప్రతిష్ఠాదులకు బ్రశస్తము.

## చర నక్షత్రములు.

శ్లో॥ స్వాత్యాదిత్యేశ్రుతేస్త్రీణి చంద్రశ్చాపిచరంచలం । తస్మిన్ గజాదికారోహో వాటికాగమనాదికమ్॥

తా॥ స్వాతి, పునర్వసు, శ్రవణము, ధనిష్ఠ, శతభిషములును, చంద్రుడు, చరనామకములు ఇవి గజాశ్వాద్యారోహణమునకును, వాటికా యాత్రాదులకును, ప్రశస్తములు.

## ఉగ్ర నక్షత్రములు.

శ్లో॥ పూర్వాత్రయంయామ్యమఖె ఉగ్రంక్రూరం కుజస్తథా । తస్మిన్ఘాతాగ్నిశాఠ్యాణి విషశస్త్రాదిసిద్ధ్యతి॥

తా॥ పూర్వాత్రయము, భరణి, మఖలును, అంగారకవారమును, ఉగ్రాహ్వయములు, ఇవి మారణకర్మ, అగ్నికర్మ, కపటకృత్య, విషప్రయోగ, శస్త్రప్రయోగాది ఉగ్రకర్మలకు యోగ్యములు.

## సాధారణ నక్షత్రములు.

శ్లో॥ విశాఖాగ్నేయభేసౌమ్యో మిశ్రంసాధారణంస్మృతం। తత్రాగ్నికార్యంమిశ్రంచ వృషోత్సర్గాదిసిద్ధ్యతి॥

తా॥ విశాఖ, కృత్తిక, బుధవారము, సాధారణాఖ్యలు. ఇవి అగ్నిహోత్ర, కామ్యవృషోత్సర్గాదుల కర్హములు.

## క్షిప్ర నక్షత్రములు.

శ్లో॥ హస్తాశ్విపుష్యాభిజితః క్షిప్రంలఘుగురుస్తథా। తస్మిన్పణ్య రతిజ్ఞాన భూషాశిల్పకళాదికమ్॥

తా॥ హస్త, అశ్విని, పుష్యమి, అభిజిత్తులును, గురువారమును, క్షిప్రనామధేయములు. ఇవి అంగడి, స్త్రీసంభోగ, శాస్త్రాది జ్ఞానారంభ, అలంకార, శిల్ప, నృత్యాదిచతుః షష్టి (64) కళలకును యోగ్యములు.

## మృదునక్షత్రములు.

శ్లో॥ మృగాంత్యచిత్రామిత్రర్క్షం మృదుమైత్రంభృగుస్తథా। తత్రగీతాంబరక్రీడా మిత్రకార్యం విభూషణమ్॥

తా॥ మృగశీర్ష, రేవతి, చిత్త, అనూరాధలును, శుక్రవారమును, మృదునామకములు, ఇవి గాన, వస్త్ర, క్రీడా, మిత్ర, కృత్యాదులకు ప్రశస్తములు.

## దారుణ నక్షత్రములు.

శ్లో॥ మూలేంద్రార్ద్రాహిభంసౌరిః తీక్ష్ణందారుణసంజ్ఞకం। తత్రాభిచారఘాతోగ్ర భేదాఃపశుదమాదికమ్॥

తా॥ మూల, జ్యేష్ఠ, ఆర్ద్ర, ఆశ్లేషలును, శనివారమును దారుణనామధేయములు, ఇవి అభిచారకృత్య, మరణకృత్య, భయంకరకృత్య, విద్వేష, పశుశిక్షాదుల కుపయోగకరములు.

## ఊర్ధ్వముఖాది నక్షత్రములు.

శ్లో॥ మూలాహిమిశ్రోగ్రమధోముఖం భవేదూర్ధ్వాస్యమార్ద్రేజ్య హరిత్రయంధ్రువం। తిర్యఙ్ముఖంమైత్రకరానిలాదితిజ్యేష్ఠాశ్విభాని దృశకృత్యమేషుసత్ ।



తా॥ మూల, ఆశ్లేష, విశాఖ, కృత్తికలు, అధోముఖ నక్షత్రములు, ఆర్ద్ర, పుష్య, శ్రవణ, ధనిష్ఠ, శతభిష, ఉత్తరాత్రయ, రోహిణులూర్ధ్వముఖములు, హస్త స్వాతి, పునర్వసు, జ్యేష్ఠ, అశ్వని, మృగశీర్ష, రేవతి, చిత్త, అనూరాధలు, తిర్యఙ్ముఖనక్షత్రములు, ఇందధోముఖ నక్షత్రములు కూపాదులకును ఊర్ధ్వముఖ నక్షత్రములు వృక్షాది స్థాపనలకును, తిర్యఙ్ముఖ నక్షత్రములు గృహారంభాదులకును ప్రశస్తములు.

---

## నూతనాభరణ ధారణము.

శ్లో॥ పౌష్ణధ్రువాశ్వికరపంచకవాసవేజ్యాదిత్యే ప్రవాళరదశంఖ సువర్ణవస్త్రం। ధార్యంవిరిక్తశనిచంద్రకుజేహ్నిరిక్తం భౌమేధ్రువాదితియుగే సుభగానదధ్యాత్ ।

తా॥ రేవతీ, ధ్రువనక్షత్రములు, అశ్విని, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, ధనిష్ఠ, పుష్యమి, పునర్వసులయందును రిక్తేతర తిథులయందును భాను, సోమ, బుధ, గురు, శుక్రవారములయందును, ప్రవాళదంతశంఖసువర్ణాది కృతాభరణ వస్త్రధారణములు ప్రశస్తములు, మంగళవారమున రక్తవస్త్రాదిధారణము మంచిది, ధ్రువనక్షత్రములయందును, పునర్వసు పుష్యములయందును, మంగళవారమందును, సౌభాగ్యవతియగు నారి పూర్వోక్తాభరణాదికముల ధరింపగూడదు.

## వస్త్రధారణమందు విశేషము.

శ్లో॥ వస్త్రాణాంనవభాగకేషుచ చతుష్కోణేమరారాక్షసా। మధ్యత్ర్యంశగతానరాస్తుసదశే పార్శ్వేచమధ్యాంశయోః। దగ్ధేవాస్ఫుటితేంబరే నవతరే పంకాదిలిప్తేనస ద్రక్షోంశేన్నృమరాంశయోశ్శుభమసత్సర్వాంశకేప్రాంతతః॥

తా॥ నూతనవస్త్రము దగ్ధముగాని స్ఫుటితము (విడిపోవుట) గాని పంకా (బురద) దిచేత పూయబడినగాని యైనప్పుడు ఆవస్త్రమునందు 3 లైనులు 3=3 తొమ్మిది భాగములు నేర్పరచవలెను అందులో నాలుగు కోణములందున్న ౪ భాగములు దేవభాగములు, సరాసరి మధ్యనున్న 3 భాగములు మనుష్యభాగములు పార్శ్వములయందు మధ్యనున్న ౨ భాగములు రాక్షసభాగములు ఇందులో దగ్ధాదిదోషము రాక్షసభాగమందైన వస్త్రమును ధరించగూడదు, దేవమనుష్య భాగములయందైన ధరించవచ్చును. అన్నిభాగముల యందున్న అశుభము.

| | | |
|---|---|---|
| దేవభాగము | రాక్షసభాగము | దేవభాగము |
| మనుష్యభాగము | మనుష్యభాగము | మనుష్యభాగము |
| దేవభాగము | రాక్షసభాగము | దేవభాగము |

## నింద్యతిథులయందు వస్త్రధారణము.

శ్లో॥ విప్రాజ్ఞయాతథోద్వాహే రాజ్ఞాప్రీత్యార్పితంచయత్ ।నింద్యే
పిధిష్ణ్యేవారాదౌ వస్త్రంధార్యంజగుర్బుధాః॥

తా॥ నింద్యతిథులయందును, బ్రాహ్మణాజ్ఞచేతగాని, వివాహమందుగాని, రాజుచేత పారితోషకముగాని నివ్వబడినప్పుడుగాని, నూతనవస్త్రధారణ చేయవచ్చునని విద్వాంసులు చెప్పుచున్నారు.

## వృక్షారోపణాదులకు శుభనక్షత్రములు.

శ్లో॥ రాధామూలమృదుధ్రువర్క్షే వరుణక్షిప్రైర్లతాపాదపారో
పోద్ధోనృపదర్శనం ధ్రువమృదుక్షిప్రశ్రవోవాసవైః । తీక్ష్ణోగ్రాంబుప
భేషు మద్యముదితంక్షిప్రాంత్యవహ్న్యుడుభా దిత్యేంద్రాంబుపవాస
వేషుహి గవాంశస్తఃక్రయోవిక్రయః॥

తా॥ అనూరాధా, మూలా, మృదునక్షత్ర ధ్రువనక్షత్ర క్షిప్రనక్షత్ర, శతభిష క్కులయందు వృక్షలతాద్యారోపము మంచిది ధ్రువమృదుక్షిప్ర నక్షత్రములయందును, శ్రవణ ధనిష్ఠలయందును ప్రథమరాజదర్శనము యోగ్యము దారుణ నక్షత్రములయందును, ఉగ్రనక్షత్రములయందును, శతభిషమందును మద్యపానము శ్రేష్ఠము క్షిప్రనక్షత్ర, రేవతీ, కృత్తిక, జ్యేష్ఠ, మృగశిర, పునర్వసు, శతభిషక్, ధనిష్ఠలయందు పశువులయొక్క క్రయవిక్రయములు ప్రశస్తములు.

## పశురక్షా ముహూర్తము.

శ్లో॥ లగ్నేశుభేచాష్టమశుద్ధిసంయుతే రక్షాపశూనాం నిజయోని
భేచరే । రిక్తాష్టమీదర్శకుజశ్రవో ధృవత్వాష్ట్రేషుయానం స్థితివేశ
నంనసత్ ॥

తా॥ అష్టమశుద్ధితోఁ గూడిన శుభలగ్నమందును, చరనక్షత్రములయందును, పశుయోని నక్షత్రములయందును, పశురక్షప్రశస్తము, రిక్తతిథులయందును, అమావ-



అమావాస్యలయందును, మంగళవారమందును శ్రవణచిత్త ధ్రువనక్షత్రములయందును, పశుప్రవేశము చేయఁగూడదు.

## ఔషధసేవన సూచీకర్మలు.

శ్లో॥ భైషజ్యంసల్లఘుమృదుచరే మూలభేద్వ్యంగలగ్నే శుక్రేం
దౌజ్ఞేవిదిచదివసే చాపితేషాంరవేశ్చ । శుద్ధేరిఃపద్యూనమృతిగృహే
సత్తిథౌనోజనేర్భే।సూచీకర్మాప్యదితివసుభత్వాష్ట్రమిత్రాశ్విపుష్యే॥

తా॥ క్షిప్రమృదుచర మూల నక్షత్రములయందును ద్విస్వభావ లగ్నమందును, లగ్నమునకు సప్తమాష్టమ ద్వాదశస్థానములయందు గ్రహములు లేకుండునప్పుడును, భాను, సోమ, బుధ, గురు, శుక్రవాసరములయందును, యోగ్యతిథులయందును, ఔషధసేవనము ప్రశస్తము, జన్మనక్షత్రమందౌషధారంభముఁ జేయగూడదు. పునర్వసు ధనిష్ఠ, చిత్త, అనూరాధ, అశ్విని, పుష్యములయందు సూచీకర్మ (కుట్టుపని) ఆరంభింప వచ్చును.

## క్రయ విక్రయ నక్షత్రములు.

శ్లో॥ క్రయర్క్షే విక్రయో నేష్టో విక్రయర్క్షే క్రయోపిచ ।
పౌష్ణాంబుపాశ్వినీవాత శ్రవశ్చిత్రాఃక్రయేశుభాః॥

తా॥ క్రయ నక్షత్రములయందు విక్రయమును, విక్రయ నక్షత్రములయందు క్రయమును చేయగూడదు. రేవతీ, శతభిషక్, అశ్వినీ, స్వాతీ, శ్రవణ, చిత్తలు, క్రయమునకు శుభనక్షత్రములు, (క్రయము కొనుట, విక్రయము అమ్ముట)

## విపణి ముహూర్తము.

శ్లో॥ పూర్వాద్వీశకృశానుసార్పయమభే కేంద్రద్వికోణేశుభైః ।
షట్త్ర్యాయేష్వశుభై ర్వినాఘటతనుం సద్విక్రయస్సత్తిథౌ । రిక్తాభౌమ
ఘటాన్వినాచవిపణి ర్మైత్రధ్రువక్షిప్రభై। ర్లగ్నే చంద్రసితేవ్యయా
ష్టరహితైః పాపైశ్శుభై ర్దాయ్యాయభే॥

తా॥ పూర్వాత్రయ, విశాఖ, కృత్తిక, ఆశ్లేష, భరణి, నక్షత్రములయందును, కేంద్రములయందును, ద్వితీయమందును, త్రికోణస్థానములయందును, శుభగ్రహము లుండగాను, తృతీయ షష్ఠైకాదశములయందు పాపగ్రహములుండగాను, కుంభేతర లగ్నములయందును, యోగ్యతిథులయందును, విక్రయారంభముఁ జేయవలెను. అనూరాధా ధ్రువక్షిప్ర నక్షత్రములయందును, రిక్తేతర తిథులయందును, కుజేతర వారములయందును, కుంభేతర లగ్నములయందును, లగ్నమందున చంద్రశుక్రులుండగాను,

ద్వాదశాష్టమస్థానములయందు పాపగ్రహములు లేనప్పుడును. ద్వితీయనవమైకాదశములయందు శుభులుండగాను, విపణ్యారంభము (అంగడి పెట్టుట) శుభప్రదము.

పూర్వము సకల శుభకార్యములకును లగ్నచంద్రుడు నిషేధింపబడి నప్పటికిని చంద్రుడు వైశ్యకులజుడగుటచేతనున్నూ, వర్తకులు వైశ్యులగుటచేతనున్నూ, ఇచ్చట విపణ్యారంభమునందు వైశ్యులకు లగ్నచంద్రుడు శుభుడుగా చెప్పబడియె.

## గజాశ్వకృత్యములు.

శ్లో॥ క్షిప్రాన్త్యవస్విందుమరుజ్జలేశాదిత్యేష్వరిక్తారదినే ప్రశస్తం। స్యాద్వాజికృత్యం త్వథహస్తికార్యం కుర్యాన్మృదుక్షిప్రచరేషు విద్వాన్॥

తా॥ క్షిప్రనక్షత్ర రేవతీ, ధనిష్ఠ, మృగశిర, స్వాతి, శతభిషక్, పునర్వసుల యందును, రిక్తేతరతిథులయందును, భౌమేతర వారములయందును, అశ్వకృత్యము ప్రశస్తము. మృదుక్షిప్ర చరనక్షత్రముల యందు గజకృత్యమును జేయవలయును.

## భూషాఘటనాది ముహూర్తము.

శ్లో॥ స్యాద్భూషాఘటనం త్రిపుష్కర చరక్షిప్రధ్రువైరత్నయుక్ తీక్ష్ణోగ్రవిహీనభే రవికుజే మేషాలిసింహే తనౌ। తన్మిశ్రాసహితం చర ధ్రువమృదుక్షిప్రే శుభే సత్తనౌ తీక్ష్ణోగ్రాశ్విమృగ ద్విదైవదహనే శస్త్రం శుభం ఘట్టితం॥

తా॥ చర క్షిప్ర ధ్రువ నక్షత్రములయందును, త్రిపుష్కరమందును, భూషాఘటనము (అలంకార నిర్మాణము) ప్రశస్తము. దారుణ ఉగ్రములుగాక మిగిలిన నక్షత్రములయందును. ఆదివార మంగళవారములయందును. మేషవృశ్చికసింహలగ్నములయందును. రత్నములతోగూడిన భూషణము చేయదగినది. చర. మృదు. ధ్రువ. క్షిప్ర. నక్షత్రములయందును శుభవార శుభలగ్నములయందును. ముత్తెములతోగూడి నాభరణ నిర్మాణము చేయదగినది. దారుణ. ఉగ్ర నక్షత్రములయందును. అశ్వనీ. మృగశీర్ష. విశాఖ కృత్తికలయందును ఆయుధఘటనము (నిర్మాణము) ప్రశస్తము.

## ముద్రాపాతన వస్త్రక్షాళనములు.

శ్లో॥ ముద్రాణాంపాతనం సద్ధ్రువ మృదుచరభక్షిప్రభైర్వీందుసౌరేఘస్రే పూర్ణాజయాఖ్యే న చ గురుభృగుజాస్తే విలగ్నే శుభైఃస్యాత్। వస్త్రాణాంక్షాళనం సద్వసు హయదినకృత్పంచకాదిత్య పుష్యైర్నో రిక్తాపర్వషష్ఠీ పితృదినరవిజజ్ఞేషు కార్యం కదాపి॥



తా॥ ధ్రువమృదు చరక్షిప్రనక్షత్రములయందును ౧. ౩. ౪. ౫. ౬. వారములయందును, ౩. ౭. ౧౩. ౫. ౧౦. ౧౫ తిథులయందును గురు శుక్రమౌఢ్య రహిత సమయమందును, శుభలగ్నమందును, ముద్రాపాతనయోగ్యమైనది. ధనిష్ఠ. అశ్విని. హస్తాదిపంచక పునర్వసు. పుష్యములయందును. నూతనవస్త్రప్రక్షాళనము శుభకరము, క్షాళనము ౪. ౯. ౧౪ తిథులయందును, కృష్ణాష్టమీ చతుర్దశులయందును, పూర్ణిమా అమావాస్య సూర్యసంక్రమణములయందు, ఉభయషష్ఠులయందును శ్రాద్ధదినమందును, శని. బుధవారములయందును, ఎప్పుడును జేయగూడదు.

## శస్త్రశయ్యాది ధారణము.

శ్లో॥ సంధార్యాఃకుంతవర్మేష్వసనశరకృపాణాసి పుత్ర్యోవిరిక్తే శుక్రేజ్యార్కేహ్ని మైత్ర ధ్రువలఘుసహితాదిత్యశాక్రద్విదైవే। స్యుర్లగ్నేపిస్థిరాఖ్యే శశినిచశుభదృష్టే శుభైః కేంద్రగైః స్యాద్భోగః శయ్యాసనాదేర్ధ్రువమృదులఘు హార్యంతకాదిత్య ఇష్టః॥

తా॥ రిక్తాన్యతిథులయందును రవి. గురు. శుక్రవారములయందును, అనూరాధా ధ్రువక్షిప్ర పునర్వసు జ్యేష్ఠ విశాఖలయందును, స్థిరలగ్నమందును, చంద్రుడు శుభగ్రహములచే చూడబడుచుండగాను శుభులు ౧. ౪. ౭. ౧౦ స్థానములనుండగాను బల్లెము. కవచము. ధనువు. బాణములు, కత్తి చూరకత్తి మొదలైన యాయుధములు ధరించుట మంచిది. ధ్రువమృదుక్షిప్ర శ్రవణ భరణీ పునర్వసులయందు, పర్యంక పీఠాదిభోగము ప్రశస్తము.

## అంధాది నక్షత్రములు.

శ్లో॥ అంధాక్షం వసుపుష్యధాతృ జలభద్వీశార్యమాంత్యాభిధం మందాక్షం రవివిశ్వమిత్ర జలపాశ్లేషాశ్విచాంద్రం భవేత్। మధ్యాక్షం శివపిత్రజైకచరణత్వాష్ట్రేంద్రవిధ్యంతకం। స్వక్షం స్వాత్యదితిశ్రవోదహనభాహిర్బుధ్న్యరక్షోభగం॥

తా॥ రోహిణి. పూర్వాషాఢా. ధనిష్ట. పుష్య. విశాఖ. ఉత్తరా రేవతులు. అంధాక్షనామకములు, హస్త. ఉత్తరాషాఢా. అనూరాధా. శతభిష. ఆశ్లేషా. అశ్విని. మృగశీర్షలు, మందాక్ష సంజ్ఞలు ఆర్ద్ర మఖ పూర్వాభాద్ర చిత్ర జ్యేష్ఠ అభిజిత్ భరణులు. మధ్యాక్షములు. ఉత్తరాభాద్ర. మూల. పుబ్బ. స్వాతి పునర్వసు. శ్రవణ కృత్తికలు సులోచనములు. రోహిణి మొదలు నాలుగు నక్షత్రములు క్రమముగా అంధ. మంద. మధ్యసులోచన సంజ్ఞలు, యథా రోహిణి అంధ. మృగశీర్షమందు. ఆరుద్ర మధ్య. పునర్వసు సులోచన, తిరిగి పుష్యమి అంధ. ఆశ్లేషమంద, ఈప్రకారముగా నూహించునది.

## అంధాది ఫలములు.

శ్లో॥ వినష్టార్థస్యలాభోంధేశీఘ్రం మందేప్రయత్నతః । స్యాద్దూరేశ్రవణంమధ్యే శ్రుత్యాప్తిర్నసులోచనే ॥

తా॥ నష్టద్రవ్యమును గురించి ప్రశ్న అంధనక్షత్రములయందు జేయబడెనేని పోయినసొమ్ము దొరకుననిన్ని, మందనక్షత్రములయందు ప్రశ్నించిన ప్రయత్నము వలన శీఘ్రముగా లభించును, మధ్యనక్షత్రములయందు ప్రశ్నజేయబడిన దూరముగా నున్నదని వార్తవచ్చును. సులోచన నక్షత్రములయందు ప్రశ్నజేయబడెనేని సొమ్మునుగురించిన వార్తగూడా వినరాదు అని చెప్పేది.

## ధన ప్రయోగము.

శ్లో॥ తీక్ష్ణమిశ్రధ్రువోగ్రైర్యద్ద్రవ్యం దత్తంనివేశితం । ప్రయుక్తం చవినష్టంచ విష్ట్యాంపాతేచనాప్యతే ॥

తా॥ దారుణ నక్షత్ర సాధారణ నక్షత్ర ధ్రువనక్షత్ర ఉగ్ర నక్షత్రములయందును, భద్రకరణమందును పాతలయందును, వృద్ధినిమిత్తమై నిచ్చిన ధనమును తిరిగి పొందబడదు.

## తటాక ఖనన కృత్యారంభములు.

శ్లో॥ మిత్రార్క ధ్రువవాసవాంబుపమఘాతోయాంత్యపుష్యేందుభిః । పాపైర్హీనబలైర్విలగ్నసురగురౌజ్ఞేవాభృగౌఖేవిధౌ ఆప్యే సర్వజలాశయస్య ఖననంవ్యంభోమఘైః సేంద్రభైస్త్రైర్నకృత్యంహిబుకే శుభే తనుగృహే జ్ఞేజ్ఞేజ్యరాశౌశుభమ్ ॥

తా॥ అనూరాధ - హస్త - రోహిణి - ఉత్తరాత్రయ - ధనిష్ట - శతభిషక్ - మఖ - పూర్వాషాఢ - రేవతి - పుష్య - మృగశిర్షా - నక్షత్రములయందును, పాపగ్రహములు బలహీనములగుచుండగాను, శుభలగ్నమందును, బుధ - గురు - శుక్రవారముల యందును. చంద్రుడు దశమస్థానమందును మీన - మకర - కటక రాసులయందుండగాను తటాకాదులు త్రవ్వుట మంచిది. పూర్వాషాఢా మఖలను విడిచి జ్యేష్టతోగూడిన పైనక్షత్రములయందును లగ్నచతుర్థమందు శుభులుండగాను లగ్నమందు బుధుడుండగాను బుధుని రాశియందు చంద్రుడుండగాను, కృత్యారంభము ప్రశస్తము.



## సేవా నక్షత్రములు.

శ్లో॥ క్షిప్రేమైత్రేపిత్ర్యతోర్కేజ్యవారే సౌమ్యేలగ్నేర్కే కుజేవా ఖలాభే । యోనేర్మైత్రం రాశిపోశ్చాపిమైత్రం సేవాకార్యా స్వామినః సేవకేన॥

తా॥ అశ్వినీ - హస్త - పుష్య - మృదునక్షత్రములయందును, బుధ - శుక్ర - రవి గురువారములయందును శుభలగ్నమందును, సూర్యుడుగాని కుజుడుగాని ౧౦ - ౧౧ స్థానములయందుండగాను యోని మైత్రి రాశీశ మైత్రులుండగాను సేవకుడు స్వామికార్యారంభమును జేయవలెను.

## ఋణ గ్రహణము.

శ్లో॥ స్వాత్యాదిత్యమృదుద్విదైవ గురుభేకర్ణత్రయాశ్వే చరే । లగ్నేధర్మసుతాష్టశుద్ధిసహితే ద్రవ్యప్రయోగఃశుభః ॥ నారేగ్రాహ్యమృణంతు సంక్రమదినే వృద్ధౌకరేర్కేహ్నియత్తద్వంశేషు భవేదృణంనచబుధే దేయంకదాచిద్ధనమ్॥

తా॥ స్వాతి - పునర్వసు - మృదు - విశాఖ - పుష్య - శ్రవణ - ధనిష్ఠ - శతభిషగశ్వినులయందును చరలగ్నమందును ౯ - ౫ స్థానములయందు శుభులుండగాను, అష్టమశుద్ధితోగూడిన లగ్నమందును అప్పివ్వవలెను.

మంగళవారమందును సంక్రమణ దినమందును హస్తాయుక్త భానువారమందును ఋణమును పుచ్చుకొనకూడదు అలాపుచ్చుకున్నయెడల వానివంశమందుగూడా నాఋణము తీరదు ఒకానొకప్పుడును బుధవారమందు ఋణమునివ్వగూడదు.

## కృషి కర్మ.

శ్లో॥ మూలద్వీశమఘాచరధ్రువమృదుక్షిప్రైర్వినార్కంశనిం పాపైర్హీనబలైర్విధౌ జలలవే శుక్రేవిధౌపూర్ణాంశకే । లగ్నేదేవగురౌ హలప్రవహణం శస్తం నసింహే ఘటేకర్క్యజైణధటేతనౌ క్షయకరం రిక్తాసు షష్ఠ్యాంతథా॥

తా॥ మూల - విశాఖ - మఖ - చర - ధ్రువ - మృదుక్షిప్ర నక్షత్రముల యందును సోమ - మంగళ - బుధ - గురు - శుక్రవారములయందును పాపులు బలహీనులై యుండగాను చంద్రుడు జలరాశులయందును జలాంశలయందు నుండగాను చంద్ర శుక్రులు బలవంతులై యుండగాను గురువు లగ్నమందుండగాను హలప్రవహణాది (నాగలితో దున్నుట) కృషికర్మ ప్రశస్తము. సింహ - కుంభ - కటక - మేష - మకర - తులా

లగ్నముల యందును ౪-౬-౯-౧౪ తిథులయందును చేయబడిన కృషికర్మ నాశనమును పొందును.

## బీజావాపనము.

శ్లో॥ ఏతేషుశ్రుతివారుణాదితి విశాఖోడూనిభౌమం వినాబీజోప్తి ర్గదితా శుభాత్వశుభతోష్టాగ్నీందురామేందవః। రామేంద్వగ్నియుగాస్య సచ్ఛుభకరాణ్యుష్ణాం హాలేరోర్క్షత్రిభాద్భాద్రా మూష్టనవాష్ట భానిమునిభిః ప్రోక్తాన్యసత్సంతిచ।

తా॥ పైన చెప్పిన నక్షత్రములలో శ్రవణ- శతభిష- పునర్వసు విశాఖ నక్షత్రములనున్ను మంగళవారమునున్ను విడిచి మిగిలిన నక్షత్రవారములలో బీజావాపనము జేయవలెను.

రాహువున్న నక్షత్రము మొదలుకొని ౮ వ నక్షత్రములు అశుభములు తరువాత 3 శుభములు తరువాత ౧ అశుభము తర్వాత 3 శుభములు ఆవల ౧ అశుభము అనంతరము 3 శుభములు తరువాత ౧ అశుభము తర్వాత 3 శుభములు తర్వాత ౪ అశుభములు.

సూర్యుని చేత విడువబడిన నక్షత్రము మొదలుకొని 3 నక్షత్రములు అశుభములు తరువాత ౮ శుభములు, తర్వాత ౯ అశుభములు తర్వాత ౮ శుభములు, యీ రెండవ ప్రకారమందు అభిజిన్నక్షత్రముగూడా లెక్కించవలెను.

## శిరామోక్షణాదులు.

శ్లో॥ త్వాష్ట్రాన్మిత్రకభాద్వయేందు వలఘుశ్రోత్రే శిరామోక్షణం। భౌమార్కేజ్యదినేవిరేకవమనాద్యం స్యాద్బుధార్కీవినా। మిత్రక్షిప్రచరధ్రువేరవిశుభాహేలగ్నవర్గేవిదో। జీవస్యాపితనౌగురౌ నిగదితా ధర్మక్రియాతద్బలే॥

తా॥ చిత్త- స్వాతి- అనూరాధ- జ్యేష్ట- ధనిష్ఠ- క్షిప్రశ్రవణ నక్షత్రములయందును మంగళ- గురు- భానువారముల యందును శిరామోక్షణము జేయవలెను శిరామోక్షణ మనగా బోలునరములద్వారా నెత్తురుగు ప్రవహింపజేయుట పూర్వోక్త నక్షత్రముల యందును ౧-౨-౩-౫-౬ వారములయందును విరేచన వమనములకు ఔషధమును పుచ్చుకొన వలయును అనూరాధా క్షిప్రచర ధ్రువనక్షత్రములయందును రవి- సోమ- బుధ- గురువారములయందును బుధ గురువుల లగ్న నవాంశలయందును లగ్నమందు గురువుండగాను గురువుయొక్క బలముండగాను కోటిహోమరుద్రాభిషేక స్నాన గ్రహజపాది ధర్మక్రియల నాచరించవలెను.



## పైరు కోయుట.

శ్లో॥ తీక్ష్ణాజపాదకరవహ్ని వసుశ్రుతీందుస్వాతీమఘోత్తర జలాంతకలేషుపుష్యే మందారరిక్తరహితే దివసేఽతిశస్తా ధాన్యచ్ఛిదానిగదితాస్థిరభేవిలగ్నే॥

తా॥ మూల, ఆర్ద్ర, జ్యేష్ఠ, ఆశ్లేష, పూర్వాభాద్ర, హస్త, కృత్తిక, ధనిష్ఠ, శ్రవణ, మృగశిర- స్వాతి- మఖ- ఉత్తరా- ఉత్తరాభాద్ర- ఉత్తరాషాఢ-పూర్వాషాఢ- భరణి- చిత్త- పుష్యమీ నక్షత్రములయందును, ఆది- సోమ- బుధ- గురు- శుక్రవారములయందును, ౧- ౨- 3-౫-౬-౭-౮-౧౦-౧౧-౧౨-౧3-౧౫ తిథులయందును స్థిరలగ్నమందును పైరుకోయుట మంచిది.

## సస్యారోపణము.

శ్లో॥ భాగ్యార్యమశ్రుతిమఖేంద్ర విధాతృమూలమైత్రాంత్యభేషు గదితంకణమర్దనంసత్ । ద్వీశాజపన్నిర్ఋతిధాతృ శతార్యమర్క్షే సస్యస్యరోపణమిహార్కికుజౌవినాసత్॥

తా॥ పుబ్బ- ఉత్త- శ్రవణ- మఖ- జ్యేష్ట- రోహిణీ, మూల- అనూరాధ రేవతి- నక్షత్రములయందును, శుభవారాదులయందును, కణమర్దనము, (అన్నమర్దనము) శనగలు మొదలైనవాటికి పొట్టుతీయుట అనియు అర్థము శుభకరము. విశాఖ- పూర్వాభాద్ర- మూల- రోహిణి- శతతార - ఉత్తరా నక్షత్రములయందు ౧- ౨- ౪- ౫- ౬ వారముల యందును సస్యారోపణము(పైరుపెట్టుట) చేయవలెను.

## ధాన్యవృద్ధి స్థితులు.

శ్లో॥ మిశ్రోగ్రార్ద్రభుజగేంద్రవిభిన్నభేషు కర్కాజతౌళిరహితే చతనౌశుభాహే। ధాన్యస్థితిశ్శుభకరీగదితాధ్రువేజ్యద్వీశేంద్రదస్రచరభేషుచ ధాన్యవృద్ధిః॥

తా॥ సాధారణ- ఉగ్ర- ఆరుద్ర- ఆశ్లేషలను విడిచి తక్కిన నక్షత్రములయందును తులా మేష కర్కాటక తరలగ్నములయందును శుభదినమందును ధాన్యస్థితి (అన్నము కొరకు ధాన్యమును నిలవజేయుట మంచిది, ధ్రువ పుష్య విశాఖ జ్యేష్ట అశ్విని చరనక్షత్రములయందు ధాన్యవృద్ధి (అన్నము కొరకు గాక విక్రయార్థముగా ధాన్యమును నిలవజేయుట) మంచిది.

## శాంతి కాదులు.

శ్లో॥ క్షిప్రధ్రువాంత్యచరమైత్రమఖామూలసంస్థే శ్చాంతికం సహచమంగళపౌష్టికాఖ్యం। ఖేర్కేపిధోసుఖగతే తనుగేగురౌనో మౌఢ్యాదిదుష్టసమయే శుభదంనిమిత్తే॥

తా॥ క్షిప్ర- ధ్రువ- రేవతి- చర- మృదు మఖలయందును లగ్నమునకు ౧౦ స్థానమున సూర్యుడును, ౪ ౬ చంద్రుడును లగ్నమందు గురువును వుండగాను శాంతి కర్మలును శుభకర్మలును పుష్ట్యర్థమైన కర్మయును చేయవలెను, మౌఢ్యాదిదుష్టసమయములయందు జేయగూడదు, నైమిత్తికములైతే మౌఢ్యాదిదుష్ట సమయములయందును జేయవచ్చును.

## హోమాహుతి.

శ్లో॥ సూర్యభాత్త్రిత్రిభేచాంద్రే సూర్యవిచ్ఛుక్రపంగవః। చంద్రారేజ్యాగుళిఖినోనేష్టా హోమాహుతిఃఖలే॥

తా॥ సూర్యుడున్న నక్షత్రము మొదలు చంద్రుడున్న నక్షత్రమువఱకులెక్కించిన 3, 3 నక్షత్రములకు క్రమముగా సూర్య- బుధ- శుక్ర- శని- చంద్ర- కుజ-గురు- రాహు కేతువు లధిపతులు, కావున నిందులో శుభగ్రహసంబంధ నక్షత్రములందు హోమము జేయవచ్చును పాపగ్రహ నక్షత్రములయందు చేయగూడదు.

## వహ్ని నివాసము.

శ్లో॥ సైకాతిథిర్వారయుతాకృతాప్తా శేషేగుణేభ్రేభువివహ్నివాసః। సౌఖ్యాయహోమేశశియుగ్మశేషే ప్రాణార్థనాశౌదివిభూతలేచ॥

తా॥ వర్తమాన తిథివారములఁగలపి నాలగింటచే భాగించగా శేషము 3 గాని సున్నగాని మిగిలిన అగ్నిహోత్రుఁడు భూమిపైనుండును కాన నప్పుడు చేయబడిన హోమము సౌఖ్యకరము, ౧ గాని ౨ గాని మిగిలినప్పుడు స్వర్గమందుండును గాన నప్పుడు చేయఁబడిన హోమము ప్రాణార్థనాశనకరము.

## నవాన్న భోజనము.

శ్లో॥ నవాన్నంస్యాచ్చరక్షిప్రమృదుభేసత్తనౌశుభం। వినానందావిషఘటీమధుపౌషార్కిభూమిజాన్॥

తా॥ చర- క్షిప్ర- మృదునక్షత్రములయందును, శుభలగ్నమందును నందేతర తిథులయందును, విషఘటికేతర కాలమందును, చైత్ర పుష్యేతర మాసములయందును, శని కుజేతర వారములయందును నవాన్న భోజనము శుభము.



## నౌకా కృత్యము.

శ్లో॥ యామ్యత్రయవిశాఖేంద్ర సార్పపిత్ర్యేశభిన్నభైః। భృగ్వీజ్యార్కేందినేనౌకాఘటనం సత్తనౌశుభం॥

తా॥ భరణీ, కృత్తికా, రోహిణీ, విశాఖా, జ్యేష్ఠ, ఆశ్లేష, మఖా, ఆర్ద్రలను విడిచి మిగిలిన నక్షత్రములయందును, ఆది, గురు, శుక్రవారములయందును, శుభలగ్నమందును, నౌకాకృత్యము (పడవను చేయుట, నీటిలో విడుచుట) శుభకరము.

## అభిచార కర్మ.

శ్లో॥ మూలార్ద్రాభరణీపిత్ర్యమృగేసౌమ్యేఘటేతనౌ। సుఖేశుక్రేష్టమేశుద్ధే సిద్ధిర్వీరాభిచారయోః॥

తా॥ మూల, ఆర్ద్ర, భరణి, మఖా, మృగశీర్ష, నక్షత్రములయందును, కుంభ లగ్నమందును, బుధుడుగాని, శుక్రుడుగాని, చతుర్థమందుండగాను, అష్టమశుద్ధితో గూడిన లగ్నమందును, వీరమారణకర్మలు ప్రశస్తములు.

## రోగ విముక్త స్నానము.

శ్లో॥ వంత్యాదిధ్రువమఖానిలసార్పధిష్ణ్యే। రిక్తేతిథౌచరతనౌ విశశీందువారే। స్నానంరుజావిరహితస్య జనస్యశస్తంహీనేవిధౌఖిలఖగైర్భవకేంద్రకోణే॥

తా॥ రేవతి, పునర్వసు, ధ్రువ, మఖ, స్వాతి, ఆశ్లేషలను విడిచి మిగిలిన నక్షత్రములయందును, రిక్తతిథులయందును, చరలగ్నమందును, శుక్రసోమవారములుగాని వారములందును, చంద్రుడు బలహీనుడై యుండగాను, అనగా ౬-౮-౧౨ స్థానముల నుండగాను, పాపగ్రహములు ౧- ౪- ౭- ౧౦- ౧౧ స్థానములయందుండగాను రోగ విముక్తుఁడారోగ్య స్నానము జేయవలెను.

## శిల్పారంభము.

శ్లో॥ మృదుధ్రువక్షిప్రచరేజ్ఞే గురౌవాఖిలగ్నగే। విధౌజ్ఞజీవవర్గస్థే శిల్పారంభఃప్రసిధ్యతి॥

తా॥ మృదు, ధ్రువ, క్షిప్ర, చరనక్షత్రములయందును, బుధగురువులలో నెవ్వరైనను దశమమందుండగాను, చంద్రుడు బుధునియొక్కగాని గురువుయొక్కగాని నవాంశాది వర్గలయందుండగాను శిల్పవిద్యారంభము శ్రేష్ఠము.

### స్నేహకృత్యము.

శ్లో॥ సుతేజ్యమిత్రభాగ్యేషు చాష్టమ్యాం తైతిలేహరా । శుక్రదృష్టేతనౌ సౌమ్యే వారేస్నానమిష్యతే ॥

తా॥ పుష్యమి, అనూరాధ, పుబ్బ, నక్షత్రములయందును, అష్టమి, ద్వాదశీ తిథులయందును తైతులకరణమందును, శుక్రునితో గూడుకొన్నది గాని శుక్రదృష్టికలది గానియగు లగ్నమందును శుభవారమందును, స్నేహము చేయుట మంచిది.

### పరీక్షా ముహూర్తము

శ్లో॥ త్యక్త్వాష్టభూత శనిభౌమకుజార్క జనుర్భమాసౌ మృతౌ రవి విధూ అపిభానినాడ్యః । ద్వ్యంగేచరేతనుల వే శశిజీవతారాశుద్ధాకరాదితిహరీంద్రికపైవరీక్షా॥

తా॥ అష్టమీ చతుర్దశీ తిథులను, శని మంగళవారములను, భద్రజన్మనక్షత్ర జన్మమాసములనున్ను గోచారముచేత అష్టమరవిచంద్రులనున్ను నాడీనక్షత్రములనున్న విడిచి మిగిలిన తిథ్యాదులయందును ద్విస్వభావ చరలగ్నములయందును తన్నవాంశల యందును చంద్రగురు తారాశుద్ధియందును హస్త పునర్వసు శ్రవణ జ్యేష్ఠ శతభిషక్కులయందును పరీక్ష చేయవలెను.

### లగ్న శుద్ధి.

శ్లో॥ వ్యయాష్టశుద్ధోపచయె లగ్నగెశుభదృగ్యుతె ।
చంద్రెత్రిషడ్దశాయస్థె సర్వారంభఃప్రసిధ్యతి॥

తా॥ ద్వాదశాష్టమశుద్ధి యుండగాను జన్మలగ్నమందును, ౩, ౬, ౧౦, ౧౧ స్థానములయందును లగ్నమందును, లగ్నమునకు ౩, ౬, ౧౦, ౧౧ స్థానములయందును చంద్రుడుండి శుభదృష్టియుతుడై యుండగాను సకలకార్యారంభము ప్రశస్తము.

### రోగ నివారణ పరిమాణము.

శ్లో॥ స్వాతీంద్రపూర్వాశివ సార్పభేమృతిర్జ్వరే త్వమైత్రస్థిరతా భవేద్రుజః । యామ్యశ్రవోవారుణ తక్షభేశివాఘుస్రాహిపక్షోద్వ్యధి పార్క్షవాసవే॥ మూలాగ్నిదాస్రేనవపిత్ర్యభేనఖాబుధ్న్యార్యమేజ్యాదిదిధాతృభేనగాః । మాసోబ్జవైశ్వేధయమాహిమూలభెమిశ్రె సపితెష్వఫణిదంశనెమృతిః ॥



తా॥ స్వాతి, జ్యేష్ఠ, పూర్వాత్రయ, ఆరుద్ర, ఆశ్లేషా నక్షత్రములయందు జ్వరము వచ్చిన వారోగి మృతుడౌను, అనూరాధా రేవతులయందు వచ్చినరోగము దీర్ఘముగానుండును భరణి, శ్రవణ, శతభిషక్, చిత్రానక్షత్రములయందు ప్రారంభమైన రోగము ౧౧ దినముల వరకును, విశాఖ, హస్త, ధనిష్ఠలయందు వచ్చిన రోగము ౧౪ దినముల వరకును. మూల, కృత్తిక, అశ్వినులయం దుద్భవించినరోగము ౯ దినములును, మఖయందావిర్భవించిన రోగము ౨౦ దినములును ఉత్తరాత్రయ పుష్య, పునర్వసు, రోహిణులయం దవతరించిన రోగము ౭ దినములును, మృగశీర్ష ఉత్తరాషాఢలయం దుత్పన్నమైన రోగము ౩౦ దినములును యుండి పిమ్మట కుదురును, ఆశ్లేష, భరణి, మూల, మఖ, కృత్తిక, విశాఖలయందు పాముచేత కరవబడిన వాడు చచ్చును.

శ్లో॥ రౌద్రాహిశక్రాంబుపయామ్య పూర్వాద్విదైవవస్వగ్నిషు పాపవారె। రిక్తాహరిస్కందదినేచరోగశ్రీఘ్రంభవేద్రోగిజనస్యమృత్యుః॥

తా॥ ఆర్ద్ర, ఆశ్లేష, జ్యేష్ఠ, శతభిషక్, భరణి, పూర్వత్రయ, విశాఖ ధనిష్ఠా, కృత్తిక, నక్షత్రములును, క్రూరవారములును, ౪, ౯, ౧౪, ౧౨, ౬, తిథులును కూడినయోగమందు రోగముదయించెనేని ఆరోగి శీఘ్రముగా యమగృహాతిథియగును.

### శయ్యావితానాది కృత్యమ్.

శ్లో॥ క్షిప్రాహిమూలేందుహరీశవాయుభే ప్రేతక్రియాస్యాద్ఝషకుంభగేవిధౌ । ప్రేతస్యదాహంయమదిగ్గమంత్యజెచ్ఛయ్యావితానం గృహగోపనాదిచ॥

తా॥ అశ్విని, హస్త, పుష్య, ఆశ్లేష, మూల, మృగశీర్ష, శ్రవణ, ఆర్ద్ర స్వాతీ, నక్షత్రములయందు ప్రేతక్రియనాచరింప వచ్చును చంద్రుడు కుంభ మీనముల యందుండగా ప్రేతదహనమును దక్షిణ దిగ్గమనమును, శయ్యావితాన కరణములను గృహాచ్ఛాదనమును, త్యజింపవలె ననుట.

### త్రిపుష్కర యోగము.

శ్లో॥ భద్రాతిథీరవిజభూతనయార్కవారే ద్వీశార్యమాజచరణాదితివహ్నివైశ్వే । త్రైపుష్కరోభవతి మృత్యువినాశవృద్ధౌ త్రైగుణ్యదో ద్విగుణకృద్వసుతక్షచాంద్రే॥

తా॥ ౨, ౭, ౧౨, తిథులును, శని, మంగళ, రవి, వారములును, విశాఖా, ఉత్తర, పూర్వాభాద్ర, పునర్వసు, కృత్తిక, పూర్వాషాఢ నక్షత్రము లొక్కమారు కూడెనేని త్రిపుష్కరయోగ మగును. ఈత్రిపుష్కరయోగము మృత్యువినాశ వృద్ధు

లయందు త్రిగుణఫలప్రదము - ఇదియే ధనిష్ఠ, చిత్త, మృగశిరలతోగూడిన, ద్విగుణ ఫలప్రదమగును.

## శవ ప్రతినిధి దహనము.

శ్లో॥ శుక్రారార్కిషుదర్శభూతమదనే నందాసుతీక్ష్ణోగ్రభే పౌష్ణే వారుణభే త్రిపుష్కరదినే న్యూనాధిమాసేయనే । యామ్యేబ్దాత్పరతశ్చపాతపరిఘే దేవేజ్యశుక్రాస్తకే । భద్రావైధృతయోఃశవప్రతికృతేర్దాహోనవత్షేసితే ॥ జన్మప్రత్యరితారయోర్మృతిముఖాం త్యే జ్జేచకర్తుర్నసన్మధ్యో మైత్రభగాదితిధ్రువవిశాఖా ద్వ్యంఘ్రిభేష్వపి చ। శ్రేష్ఠార్కేచవిధోర్దినే శ్రుతికరస్వాత్యశ్విపుష్యేతథా త్యాశౌ చాత్పరతో విచార్యమఖిలం మధ్యేయథాసంభవమ్॥

తా॥ శుక్ర, మంగళ, శని వారములయందును, 1, 6, 11, 13, 14, 30 తిథులయందును, ఉగ్రనక్షత్రములయందును, రేవతీ శతభిషములయందును, త్రిపుష్కర దినమందును క్షయమాసమందును, అధికమాసమందును, దక్షిణాయనమందును, సంవత్సరానంతరమునను, వ్యతీపాత పరిఘా యోగములయందును, గురు శుక్రుల మౌఢ్యములయందును, భద్రావైధృతులయందును, కృష్ణపక్షమందును శవప్రతికృతియొక్క దహనము కూడదు శవప్రతికృతియనగా పాలాశాదికము.

ఈపాలాశాది సంస్కారము జన్మప్రత్యక్తారలయందును చంద్రుడు జన్మరాశికి ౪-౮-౧౨ స్థానములయందుండగాను, ఆచరించెనేని కర్తకు శ్రేయస్కరముగాదు అనూరాధ, పుబ్బ, పునర్వసు, ధ్రువ, విశాఖ, ద్విపాద, నక్షత్రములయందును, బుధవారమునందును చేసెనేని మధ్యమ ఫలప్రదము రవి చంద్ర గురువారములయందును శ్రవణ, హస్త, స్వాతి అశ్వినీ, పుష్యములయం దాచరించెనేని శ్రేష్ఠఫలప్రదము ఈవిచారణ యంతయు దశాహానంతరము చేయదగినదిగాని దశాహము లోపల నవసరము లేదు.

## అభుక్తమూల లక్షణమ్.

శ్లో॥ అభుక్తమూలంఘటికా చతుష్టయం జ్యేష్ఠాంత్యమూలాహి భవంహినారదః । వసిష్ఠఏక ద్విఘటీమితంజగౌ బృహస్పతి స్త్వేకఘటీ ప్రమాణమ్ ॥

శ్లో॥ జ్యేష్ఠా మూలల మధ్యను ౪ ఘడియలకాలము అభుక్తము మూలమని నారదుడు చెప్పెను. ౨ ఘడియలని వశిష్ఠుడు వచించెను. ౧ ఘడియయేయని బృహస్పతి వాక్రుచ్చెను.



శ్లో॥ అథోచురన్యేప్రథమాష్టఘట్యో మూలస్యశాక్రాంతిమపంచ నాడ్యః జాతంశిశుంతత్రపరిత్యజేద్వా ముఖంపితాస్యాష్టసమానపశ్యేత్

తా॥ మఱికొందఱు జ్యేష్టాంతమందు ౫ ఘడియలును, మూలాదియందు ౮ ఘడియలును అభుక్తమూలమని చెప్పుచున్నారు. అభుక్తమూలసంజాత శిశువును పరిత్యజించవలెను. లేదా ఎనిమిది సంవత్సరములవఱకు తండ్రి యాశిశువునుచూడగూడదు.

## మూలాశ్లేషా జనన ఫలము.

శ్లో॥ ఆద్యేపితానాశముపైతిమూల పాదేద్వితీయేజననీతృతీయే । ధనంచతుర్థోస్యశుభోథశాంత్యా సర్వత్రసత్స్యాదహిభే విలోమమ్॥

తా॥ మూల ప్రథమ పాదమునందుద్భవించిన పుత్రికగాని, పుత్రుడుగాని, తండ్రిని చంపును. రెండవపాదమందైన మాతృనాశనము జేయును. మూడవపాదమందైన ధనక్షయముజేయును. నాలవపాదమందైన శుభము, ఈఫలములనే ఆశ్లేషాసంభవులకు విలోమముగాచూచేది అనగా ఆశ్లేషా చతుర్థచరణ జాతశిశువు తండ్రినిన్నీ, తృతీయపాద సంభవుడు తల్లినిన్నీ, ద్వితీయపాదోత్పన్నుడు ధనమునున్నూ నశింపజేయును, ప్రథమపాదము శుభకరము, ఈదుష్టఫలములన్నియు, యథాశక్తి యథాశాస్త్రీయముగా శాంతిజేసిన యెడల నివారణమగును.

## మూలా నివాసము.

శ్లో॥ స్వర్గేశుచిప్రోష్ఠపదేషుమాఘే భూమౌనభఃకార్తికచైత్రపౌషే। మూలంహ్యధస్తాత్తుతపస్యమార్గ వైశాఖశుక్రేష్వ శుభంచతత్ర॥

తా॥ ఆషాఢ- భాద్రపద - ఆశ్వయుజ - మాఘమాసములయందు స్వర్గమందును, కార్తీక- చైత్ర- పుష్య- శ్రావణమాసములయందు భూమియందును, ఫాల్గుణ- మార్గశీర్ష- వైశాఖ- జ్యేష్ఠమాసములయందు పాతాళమందును, మూలానక్షత్రముండును, గాన భూలోక స్థితియందు మిక్కిలి కీడుచేయును. తదితర లోకస్థితియందు స్వల్పదోషము.

## గండాంత పరిహారము.

శ్లో॥ గండాంతేంద్రభశూలపాత పరిఘువ్యాఘాతగండావమే సంక్రాంతి వ్యతీపాతవైధృతి సినీవాలీకుహూదర్శకే । వజ్రేకృష్ణచతుర్దశీషు యమఘంటెదగ్ధయోగేస్మృతే । విష్టౌసోదరభేజనిర్నపితృభేశస్తా శుభాశాంతితః ॥

తా॥ గండాంత సమయమందును జ్యేష్ఠనక్షత్రమందును శూలపాత పరిఘ వ్యాఘాత అతిగండములయందును, అవమసంక్రాంతి వ్యతీపాత వైధృతులయందును, దృష్టేందుకలా దృష్టేందుకలయైన అమావాస్యయందును, వజ్రయోగమందును, కృష్ణ చతుర్దశియందును, యమఘంట దగ్ధమృత్యుయోగములయందును, భద్రయందును సహోదర నక్షత్రమందును, మాతాపితృనక్షత్రములయందును జననము పీడాకరము గాన శాంతిచేయవలెను. శాంతివలన నివారణ మగును.

## నక్షత్ర తారలు.

శ్లో॥ త్రిత్ర్యంగపంచాగ్నికువేదవహ్నయశ్శరేషునేత్రాశ్వశరేందుభూకృతాః । వేదాగ్నిరుద్రాగ్నియమాగ్ని వహ్నయోఽబ్ధయః శతం ద్విద్విరదాభతారకాః॥

తా॥ అశ్వన్యాదులకు నీప్రకారము తారలు అ ౩- భ ౩ - కృ ౬ - రో ౫- మృ ౩- ఆ ౧- పున ౪ - పు ౩- ఆశ్లేష ౫ - మ ౫ - పుబ్బ ౨ - ఉఫ ౨ - హ ౫ - చి ౧ - స్వా ౧- వి ౪- అనూ ౪- జ్యే ౩- మూ ౧౧- పూషా ౩ - ఉషా ౨- అభి ౩- శ్ర ౩- ధ ౪- శ ౧౦౦- పూభా ౨- ఉభా ౨- రే ౩౨ తారలు.

## నక్షత్ర స్వరూపములు.

శ్లో॥ అశ్వ్యాదిరూపంతురగాస్యయోనీ క్షురోనశకటాస్యమణీగృహంచ । పృషత్కచక్రేభవసంచమంచః శయ్యాకరోమౌక్తిక విద్రుమంచ॥ తోరణంబలినిభంచకుండలం సింహపుచ్ఛగజదంత మంచకాః। త్ర్యస్త్రిచత్రిచరణాభమర్దలౌ వృత్తమంచ యమలాభమర్దలాః॥

తా॥ అశ్వని- గుఱ్ఱపు ముఖము, భరణి యోన్యాకారము, కృత్తిక మంగలకత్తి రోహిణి- బండి, మృగశీర్ష- లేడిముఖము, ఆర్ద్ర ప్రవాళము, పునర్వసు గృహము, పుష్యమి బాణము, ఆశ్లేష చక్రము, మఖ వల్లకీ, పుబ్బ మంచము, ఉత్తర శయ్య, హస్త హస్తాకారము, చిత్త ముత్యము, స్వాతి మాణిక్యము, విశాఖ తోరణము, అనూరాధ బలినిభము, జ్యేష్ఠ కుండలము, మూల సింహపుచ్ఛము, పూర్వాషాఢ గజదంతము, ఉత్తరాషాఢ మంచము, అభిజిత్ త్రికోణము, శ్రవణం త్రిపాదము, ధనిష్ఠ మద్దెల, శతభిషక్ వృత్తం, పూర్వాభాద్ర మంచము, ఉత్తరాభాద్ర జంట, రేవతి మృదంగము,

## తటాకాది ప్రతిష్ఠ.

శ్లో॥ జలాశయారామసురప్రతిష్ఠా సౌమ్యాయనేజీవశశాంకశుక్రే। దృశ్యేమృదుక్షిప్రచరధ్రువేస్యాత్పక్షేసితేస్వర్క్షతిథిక్షణేవా॥

తా॥ ఉత్తరాయణయందును గురు, శుక్ర, చంద్రులుదయించియుండగాను, మృదు, క్షిప్ర, చర, ధ్రువనక్షత్రములయందును శుక్లపక్షమందును, శుభనక్షత్ర తిథివార ముహూర్తములయందును తటాక ఉద్యానదేవ ప్రతిష్ఠలు ప్రశస్తములు.

## దేవ ప్రతిష్ఠ.

శ్లో॥ రిక్తారవర్జ్యేదివసే తిథిస్తాశశాంకపాపై స్త్రిభవాంగసంస్థైః। వ్యంత్యాష్టగైః సత్ఖచరైర్మృగేంద్రే సూర్యోఘటేకోయువతౌచ విష్ణుః॥ శివోనృయుగ్మే ద్వితనౌచదేవ్యః క్షుద్రాశ్చరేసర్వఇమేస్థిరర్క్షే। పుష్యేగ్రహావిఘ్నపయక్షసర్పభూతాదయోంత్యేశ్రవణేజినశ్చ॥

ఇతి శ్రీ దైవజ్ఞరామ విరచితే ముహూర్తచింతామణౌ ద్వితీయం నక్షత్రప్రకరణం సమాప్తం.

---

తా॥ చంద్రుడును పాపగ్రహములును 3- 6- 11 స్థానముల యందుండగాను శుభగ్రహములు, 8- 12 స్థానములయందు లేనప్పుడును రిక్తేతర తిథులయందును కుజేతర వారములందును, సర్వదేవత ప్రతిష్ఠచేయవచ్చును. రవి సింహమందును, బ్రహ్మ కుంభమందును, విష్ణువు కన్యయందును, శివుడు మిథునమందును, దేవి ద్విస్వభావరాశులయందును క్షుద్రదేవతలు చరలగ్నమందును, అనుక్త దేవతలు స్థిరలగ్నమందును, గ్రహములు పుష్యమియందును, యక్షరాక్షసభూత సర్పగణాధిపులు రేవతియందును, బుద్ధుడు శ్రవణమందును, ప్రతిష్ఠించదగినవారు ఈప్రకారముగా ముహూర్తచింతామణియందు నక్షత్రప్రకరణము రెండవది ముగిసెను.

---

## ౩ సంక్రాంతి ప్రకరణమ్.

## సంక్రాంతి ఫలము.

శ్లో॥ ఘోరార్కసంక్రమణముగ్రరవౌహి శూద్రాన్ ధ్వాంక్షీ విశోలఘువిధౌచ చరక్షభౌమే। చౌరాన్ మహోదరయుతాన్

వతీన్ జ్ఞమైత్రే మందాకినీస్థిరగురౌ సుఖయేచ్ఛమందా ॥ విప్రాంశ్చ మిశ్రిభభృగౌతు పశూంశ్చమిశ్రాతీక్ష్ణార్క జేంత్యజముఖాన్ ఖలు రాక్షసీచ॥

తా॥ సూర్యసంక్రాంతి పూర్వాత్రయ మఖ భరణీ భానువారమందైన, ఘోర నామమును వహించి శూద్రులను సుఖవంతులనుగాజేయును. అశ్వనీ - హస్త - పుష్య మీ సోమవారమందు ధ్వాంక్షినామకయై వైశ్యులకును, స్వాతి - పునర్వసు - శ్రవణ - ధనిష్ఠ - శతభిషక్ మంగళవారములందు మహోదర నామకమై దొంగలకును, చిత్రా - రేవతి - మృగశీర్ష బుధవారమందు మందాకినీయై రాజులకును, రోహిణి - ఉత్తరా త్రయ గురువారమందు, మందానామకయై బ్రాహ్మణులకును, కృత్తికా విశాఖ శుక్ర వారమందు మిశ్రనామకయై పశువులను, మూల - ఆర్ద్ర - జ్యేష్ట - ఆశ్లేష, శనివార మందు రాక్షసియై చండాలాదులకును సుఖమును జేయును.

శ్లో॥ త్ర్యంశేదినస్యనృపతీన్ ప్రథమేనిహంతి మధ్యేద్విజానపివిశోపరకేచశూద్రాన్ । అస్తేనిశాప్రహరకేషుపిశాచకాదీన్ నక్తంచరానపినటాన్ పశుపాలకాంశ్చ । సూర్యోదయే సకలలింగిజనంచ సౌమ్య యామ్యాయనం మకరకర్కటయోర్నిరుక్తమ్ ॥

తా॥ అహస్సును మూడుగా విభజించగా సంక్రమణము ౧ వ భాగమందైతే రాజులకును, ౨ వ భాగమందు బ్రాహ్మణులకును, ౩ వ భాగమందు వైశ్యులకును, అస్తమయ సమయమందు శూద్రులకును. రాత్రి ప్రథమయామమందు భూతప్రేత పిశాచాదులకును, ౨ వ యామమందు రాక్షసులకును, ౩ వ యామమందు నాట్యము జేయువారికిని, ౪ వ యామమందు పశుపాలకులకును సూర్యోదయ సమయమందు లింగ ధారులకును, (పాషండులకును) హానికలుగజేయును, మకర సంక్రమణము ఉత్తరాయ ణనామకమును కర్కటక సంక్రమణము దక్షిణాయన సంజ్ఞకమును నగును.

## సంక్రాంతి నామములు.

శ్లో॥ షడశీత్యాననంచాపనృయుక్కన్యా ఝుషేభవేత్ । తులా జావిషువత్ విష్ణుపదంసింహాలిగోఘటే॥

తా॥ కన్యామిథున ధనుర్మీన సంక్రాంతులు షడశీతి ముఖములనిన్ని తులా మేషములు విషువత్పుణ్యకాలములనిన్ని సింహ - వృశ్చిక - వృషభ - కుంభములు, విష్ణుపదములనిన్ని చెప్పబడును. కటక మకరములు అయనములని పూర్వశ్లోకమందు చెప్పబడినది.



## సంక్రాంతి పుణ్యకాలము.

శ్లో॥ సంక్రాంతికాలాదుభయత్ర నాడికాఃపుణ్యామతాష్షోడశషోడశోష్ణగోః । నిశీథతోర్వాగ పరత్రసంక్రమే పూర్వాపరాహాంతిమ పూర్వభాగయోః ॥

తా॥ రవి సంక్రమణములకు పూర్వమందు ౧౬ ఘటికలును పరమందు ౧౬ ఘటికలును పుణ్యకాలము అర్ధరాత్రమునకులోగా సంక్రమణమువచ్చేనేని నప్పుడు పూర్వాహ్నములో ఉత్తరార్ధమున్ను అర్ధరాత్రమునకు పిమ్మట సంక్రమణము వచ్చేనేని పరాహ్నములో పూర్వార్ధమున్ను పుణ్యకాలములు.

శ్లో॥ పూర్ణేనిశీథేయదిసంక్రమః స్యాద్దినద్వయం పుణ్యమథోదయాస్తాత్ । పూర్వంపరస్తాద్యదియామ్య సౌమ్యాయనేదినే పూర్వపరేతుపుణ్యే॥

తా॥ సరిగా అర్ధరాత్రిమందు సంక్రమణము వచ్చేనేని యప్పుడు పూర్వోత్తర దినద్వయ పుణ్యకాలము ఉదయానకు పూర్వం దక్షిణాయన ప్రవేశమందును అస్తమయానకు పరమందుత్తరాయణ ప్రవేశమందును పూర్వోత్తర దినములు క్రమముగా పుణ్యకాలములు.

శ్లో॥ సంధ్యాత్రినాడీప్రమితార్కబింబాదధోదితాస్త్యాదధఊర్ధ్వమత్ర । చేద్యామ్యసౌమ్యే అయనేక్రమాత్ స్తః పుణ్యౌతదానీంపరపూర్వఘస్రౌ ॥

తా॥ సూర్యోదయమునకు ముందు ౩ ఘటికలును, అస్తమయమునకు వెనుక ౩ ఘటికలును. సంధ్యాకాలమనంబడును గానదక్షిణాయనము ఉదయసంధ్యాకాలమందైన పరమదినముపుణ్యము, సాయంసంధ్యాకాలమందుత్తరాయణమైన పూర్వదినముపుణ్యము

శ్లో॥ యామ్యాయనేవిష్ణుపదే చాద్యామధ్యాతులాజయోః ।
షడశీత్యాననేసౌమ్యే పరానాడ్యోతిపుణ్యదాః॥

తా॥ ౨- ౪- ౫- ౮- ౧౧ సంక్రాంతులకుముందు ౧౬ ఘటికలును ౧-౭ సంక్రాంతులకు మధ్య ౧౬ ఘటికలును ౩- ౬- ౯- ౧౦- ౧౨ సంక్రాంతులకు పరమందు ౧౬ ఘటికలును మిక్కిలి పుణ్యకాలములు.

## సాయనాంశ సంక్రాంతి.

శ్లో॥ తథాయనాంశాఃఖరసాహతాశ్చ స్పష్టార్కగత్యా విహృతా

దినాద్యైః । మేషాదితః ప్రోక్తలగ్నసంక్రమాః స్యుర్దానజపాదౌ బహు పుణ్యదాస్తే ॥

వ్యా॥ యథారాశిసంక్రమాః పుణ్యదాస్తథా అయనాంశాః షష్ట్యాగుణితాః స్పష్టార్కగత్యావిభక్తాః లబ్ధైర్దినాద్యైః దినఘటీపలైః మేషాదిసంక్రాంతికాలాత్పూర్వం చలసంక్రమాం భవంతి ఇమేపి స్నానదానజపాదౌ పుణ్యతమాభవంతీతి॥ అయనాంశాదిః సిద్ధాంతాదవగంతవ్యత్వాన్నాత్రలిఖితుంశక్య ఇత్యవగంతవ్యం.

## సమాది నక్షత్ర సంజ్ఞలు.

శ్లో॥ సమంమృదుక్షిప్రవసుశ్రవోగ్ని మఖత్రిపూర్వాస్రవభం బృహత్స్యాత్. । ధ్రువద్విదైవాదితిభం జఘన్యంసార్వాంబుపార్ద్రానిల శాక్రయామ్యమ్ ॥

తా॥ చిత్త, రేవతి, మృగశీర్ష, అనూరాధ, అశ్విని, హస్త, పుష్య, ధనిష్ఠ, శ్రవణ, కృత్తిక, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, మూల, మఖ యీ ౧౫ నక్షత్రములు సమసంజ్ఞలు రోహిణి, ఉత్తర, ఉత్తరాభాద్ర, ఉత్తరాషాఢ. విశాఖ, పునర్వసు, యీ ౬ నక్షత్రములు బృహత్సంజ్ఞలు ఆశ్లేష, శతభిషక్, ఆర్ద్ర, స్వాతి, జ్యేష్ఠ భరణి ౬ ను జఘన్య సంజ్ఞలు.

శ్లో॥ జఘన్యభైః సంక్రమణేముహూర్తాః శ్వరేందవో బాణకృతా బృహత్సు। ఖరామసంఖ్యాస్సమభేమహర్ఘంసమర్ఘసామ్యం విధుదర్శనేపి

తా॥ జఘన్య నక్షత్రమందు సంక్రమణమైతే ౧౫ ముహూర్తములు. ఆపదిహేను ముహూర్తములలో సంక్రమణమైతే మహార్ఘము, బృహన్నక్షత్రములో ౪౫ ముహూర్తములలో సంక్రమణమైతే సమార్ఘం, సమనక్షత్రమందు 30 ముహూర్తములలో సంక్రమణమైతే సామ్యమును తెలుసుకునేది, చంద్రదర్శనమందు నీలాగుననె తెలుసుకునేది.

## అబ్దవిశోపకములు.

శ్లో॥ అర్కాదివారేసంక్రాంతౌ కర్కస్యాబ్దవిశోపకాః ।
దిశోనఖాగజాన్సూర్యా ధృత్యోష్టౌదశసాయకాః॥

తా॥ కర్కసంక్రాంతి భానువారమందైన ౧౦ న్ని సోమవారమందైన ౨౦ న్ని మంగళవారమందైన ౮ న్ని బుధవారమందైన ౧౨ ను, గురువారమందైన ౧౮ న్ని, శుక్రవారమందైన ౧౮ న్ని, శనివారమందైన ౫ ను, అబ్దవిశోపకములు.



## రవి సంక్రాంతి ఫలము.

శ్లో॥ స్యాత్తైతిలేనాగచతుష్పదేరవిస్సుప్తో నివిష్టస్తుగరాదిపంచకే। కింస్తుఘ్నఊర్ధ్వాశకునౌనాగకాలవ నేష్టాగమః శ్రేష్ఠ ఇహార్ఘవర్షణే॥

తా॥ తైతుల నాగచతుష్పద కరణములయందు సంక్రమణమాయెనా రవినిద్రించినవాడగును అర్ఘవర్షమందు యీనిద్రించిన రవి మంచివాడుగాడు, గర, వణిజ విష్టి, బాలవ, బవ, కరణములయందు సముడు, కింస్తుఘ్న, శకుని, కౌలవకరణముల యందు శ్రేష్ఠమైన వాడగును.

## సంక్రాంతి వాహనాదులు.

శ్లో॥ సింహవ్యాఘ్రవరాహరాసభగజావాహద్విషద్ఘోటకాః శ్వాజోగాశ్చరణాయుధశ్చ బవతో వాహారవేః సంక్రమేవస్త్రం శ్వేతసుపీతహారితకపాండ్వారక్తకాలాసితం చిత్రంకంబళదిగ్ఘనాభ మథశస్త్రం స్యాత్ భుశుండీగదా। ఖడ్గోదండశరాసితోమర మథోకుంతశ్చపాశోంకుశోస్త్రం బాణోస్త్వథ భక్ష్యమన్నపరమాన్నం భైక్షపక్వాన్నకం దుగ్ధందధ్యపిచిత్రితాన్న గుడమధ్వాజ్యంతథా శర్కరాథోనేపాస్య నాభికుంకుమమథో పాటీరమృదోచనమ్ । యావశ్చోత్పతుమదో... జనమథోకాలాగురుశ్చంద్రకో జాతిదైవతభూతసర్పవిహగాఃపశ్వేణ విప్రాస్తతః । క్షత్రావైశ్యకశూద్రసంకరభవాః పుష్పంచపున్నాగకం జాతీబాకులకేతకానిచతథో బిల్వార్కదూర్వాంబుజం ॥ స్యాన్మల్లికాపాటిలికాజపాచ సంక్రాంతివస్త్రాశనవాహనాద్యే। నాశశ్చలేద్వ్యత్యుపజీవినాంచ స్థితోపవిష్టస్వపతాంచనాశః॥

తా॥ బవాది కరణములయందు సంక్రాంతివచ్చినప్పుడు క్రమముగా క్రింది చక్రములో ప్రకారము వాహనాదికమును తెలుసుకునేది యేయేవాహనాదికము సంక్రాంతికి గల్గునో ఆయావాహనాదికమువల్ల జీవించువారికి ఆయావాహనజంతువులకును వినాశము గలుగును. యథా బవకరణమందు సింహము వాహనము గనుక సింహయానారూఢులకును సింహములకును నాశము ఇట్లె నూహించవలెను. ఆకాలమందు వారు కూర్చున్నను నుంచున్నను, నిద్రించినను నాశముగల్గును. యీశ్లోకార్థమును చక్రరూపముగా వ్రాయుచున్నాను గాన చక్రమునుబట్టి తాత్పర్యము నూహించేది. అర్థము సులభము.

## సంక్రాంతి చక్రము.

| సం. | కరణము. | వాహనము | వస్త్రము | శస్త్రము | భోజనము | లేపనం | జాతి | పుష్పము |
|---|---|---|---|---|---|---|---|---|
| ౧ | బవ | సింహ | శ్వేత | భుశుండీ | అన్నం | కస్తూరీ | దేవత | పున్నాగ |
| ౨ | బాలవ | శార్దూల | పీత | గదా | పరమాన్నం | కుంకుమ | భూత | జాజి |
| ౩ | కౌలవ | సూకర | హరిత | ఖడ్గ | భిక్ష | గంధ | సర్ప | అశోక |
| ౪ | తైతుల | ఖర | పాండు | దండ | పక్వాన్నం | మృత్తిక | పక్షి | కేతకీ |
| ౫ | గరజి | గజ | రక్త | శరాసన | పయః | గోరోచన | పశు | బిల్వ |
| ౬ | వణిజి | మహిష | నీల | తోమర | దధి | లత్తుక | ఏణ | అర్క |
| ౭ | శకుని | అశ్వ | కృష్ణ | కుంత | చిత్రాన్నం | పునుగు | విప్ర | దూర్వ |
| ౮ | భద్ర | శ్వాన | చిత్రం | పాశ | గుడ | పసుపు | క్షత్రియ | కమల |
| ౯ | చతుష్పాత్ | అజ | కంబళ | అంకుశ | మధు | అంజనీ | వైశ్య | మల్లి |
| ౧౦ | నాగము | గో | దిగంబర | అస్త్రం | ఆజ్యం | అగురు | శూద్ర | పాటలి |
| ౧౧ | కింస్తుఘ్నం | కుక్కుట | మేఘచ్ఛాయ | బాణ | శర్కర | చంద్రిక | సంకర | జపాకుసుమ |

## సంక్రాంతివశమున శుభాశుభములు.

శ్లో॥ సంక్రాంతిధిష్ణ్యాద్ధరధిష్ణ్యతస్త్రిభే। స్వభేనిరుక్తంగమనంతతోంగభే। సుఖంత్రిభేపీడనమంగభేఖం । త్రిభేధనాహానిరసభేదనాగమః॥

తా॥ సంక్రాంతి......నక్షత్రము మొదలు జన్మనక్షత్రము వఱకు లెక్కించగా జన్మనక్షత్రము మొదటి ౩ లోపలదైన గమనము తరువాత ౬ లోపలదైన సుఖము, తరువాత ౩ లోపలపీడ, తరువాత ౬ లోపల సుఖము, తరువాత ౩ లోపల హాని, తరువాత ౬ లోపల ధనాగమము.



## కార్యభేదముచేత గ్రహబలము.

శ్లో॥ నృపేక్షణం సర్వకృతిశ్చసంగరః శాస్త్రం వివాహోగమదీక్షణే రవేః । వీర్యేణ తారాబలతః సుఖీవిధుః । విధోర్బలేరోర్కబలే కుజాదయః॥

తా॥ రవిబలమందు రాజదర్శనమున్ను, చంద్రబలమందు సమస్తకార్యములున్ను, అంగారకబలమందు యుద్ధమును, బుధబలమందు శాస్త్రమును, గురుబలమందు వివాహమును, శుక్రబలమందు యాత్రయు, శనిబలమందు యజ్ఞదీక్షయు చేయవలెను. చంద్రుడు రాశిబలమందుకంటె తారాబలమందు శుభుడు, చంద్రబలముకంటె సూర్యబలమున్ను, సూర్యునిబలముకంటె కుజాదులబలమున్ను యెక్కువ.

## క్షయమాస అధికమాసముల నిర్ణయము.

శ్లో॥ స్పష్టార్కసంక్రాంతివిహీనఉక్తో మాసోధిమాసః క్షయమాసకస్తు। ద్విసంక్రమస్తత్రవిభాగయోః స్తస్తిథేర్హిమాసౌ ప్రథమాంత్యసంజ్ఞౌ॥ ఇతి శ్రీ దైవజ్ఞానంతసుత రామవిరచితే ముహూర్తచింతామణౌ తృతీయం సంక్రాంతి ప్రకరణం సమాప్తమ్.

..........................................................................

తా॥ సంక్రాంతి రహితమాసము అధికమాసమునిన్ని, ద్విసంక్రాంతి సహితమాసము క్షయమాసమునిన్నీ చెప్పబడును. అక్షయమాసమందు ఉభయసన్నలో పూర్వార్థము పూర్వమాసముగానున్నూ ఉత్తరార్థముత్తరమాసముగాను గణింపబడుచున్నది.

ఈ ప్రకారముగా ముహూర్తచింతామణియందు సంక్రాంతి ప్రకరణము, సమాప్తము.

---

## గోచార ఫలమ్,

శ్లో॥ సూర్యేరసాంత్యేఖయుగేగ్నినందే శివాత్మయోర్భమశనీతమశ్చ । రసాంకయోర్లాభశరేగుణాంత్యే చంద్రోంబరాబ్ధాగుణనందయోశ్చ। లాభాష్టమేచాద్యశరేరసాంత్యేనగద్వయేజ్ఞోద్విశరేబ్ధిరామే। రసాంకయోర్నాగవిధౌకనాగే లాభవ్యయేదేవగురుశ్శరాబ్ధౌ॥ ద్వ్యాంతేనవాంశే ద్రిగుణేశివాహశాశుక్రఃకునాగద్వినగేగ్నిరామే। వేదాంవరే పంచనిధౌగజైషానందేశయోర్భానురసేశివాగ్నౌ । క్రమాచ్ఛుభో

విద్ధ ఇతి గ్రహాస్స్యాత్ పితుస్స్వరస్యాత్రిస వేధమాహుః। దుష్టోపి ఖేటో విపరీతవేధా చ్ఛుభో ద్వికోణె శుభదః సితేబ్జః॥

తా॥ రవి 6।12, 10।4, 3।9, 11।5, అంగారకుడు- 6।9, శని- 11,5, రాహువు- 3-12, చంద్రుడు- 10।4, 3।9, 11।8, 1।5, 6।12, 7।2, బుధుడు- 2।5, 4।3, 6।9, 8।1, 10।8. 11।12, గురువు- 5।4, 2।12, 9,10, 7।3, 11।8, శుక్రుడు- 1।8, 2।7, 3।1, 4।10, 5।9, 8।5, 9।11, 12।6, 11।3, స్థానములయందు క్రమముగా శుభులును, విద్ధులును అగుదురు. అనగా రవి, 6 స్థానమందు శుభుడు, 12 వ స్థానమందు విద్ధుడు, ఇట్లే అన్నిగ్రహములు జన్మరాశినిబట్టి, ప్రథమసంఖ్య రాశులయందు శుభులును, ద్వితీయసంఖ్య రాశులందు విద్ధులును నగుదురు. ఉదా॥ సూర్యుడు 6 స్థానమందుండగా 12 వ స్థానమందున్న మరియొక గ్రహముచేత వేధనపొందును. ఇట్లే 4, 9, 5, స్థానములనున్న గ్రహముల వలన 10- 3- 11- స్థానములనున్న సూర్యుడు వేధను పొందును. ఇట్లే సర్వత్ర 9 భావమందున్న గ్రహమువలన 6 భావమందున్న కుజుడును, 5 భావమందున్న గ్రహమువలన 11 వ భావమందున్న శనియును, 12వ భావమందున్న గ్రహమువలన 3 వ భావమందున్న రాహువును, 4- 9- 8- 5- 12- 2- స్థానములనున్న గ్రహమువలన 10- 3- 11- 1- 6- 7- స్థానములనున్న చంద్రుడును, 5- 3- 9- 1- 8- 12 స్థానములనున్న గ్రహమువలన 2- 4- 6- 8- 10- 11 స్థానములనున్న బుధుడును, 4- 12- 10- 3- 8- స్థానములనున్న గ్రహమువలన 5- 2- 9- 7-11 స్థానములనున్న గురువును, 8- 7- 1- 10- 9- 5- 11- 6- 3- స్థానములనున్న గ్రహమువలన 1- 2- 3- 4- 5- 8- 9- 11- 12- స్థానములనున్న శుక్రుడును, వేధను పొందుదురు. ఇది క్రమవేధ— ఇకను వామవేధను జెప్పుచున్నాడు. సూర్యాదులు ద్వితీయసంఖ్య స్థానముల యందుండగా ప్రథమసంఖ్య స్థానములయందున్న గ్రహములవలన వేధను పొందుదురు. ఇది వామవేధ, ఇందులో తండ్రివలన కుమారునకు వేధలేదు దుష్టగ్రహముల కూడా వామవేధనుపొంది నప్పుడు శుభుడగును. శుక్లపక్షచంద్రుడు 2- 5- 9 స్థానములయందుండగా వేధదోషములేదు అనగా శుభుడు.

## ద్వివిధవేధె మతద్వయమ్.

శ్లో॥ స్వజన్మరాశేరిహ వేధమాహురన్యే గ్రహాధిష్ఠితరాశితస్సః।
హిమాద్రివింధ్యాంతర ఏవ వేధో న సర్వదేశేష్వితి కాశ్యపోక్తిః॥

తా॥ స్వజన్మరాశినిబట్టి కొందరును, గ్రహాధిష్ఠితరాశినిబట్టి మఱికొందరును వేధను చెప్పుచున్నారు- ఈ వేధ ఆర్యావర్త దేశమందేగాని సర్వదేశములయందు లేదని కాశ్యపుడు చెప్పెను- షష్ఠస్థరవి స్వజన్మరాశి ద్వాదశస్థగ్రహముచేత విద్ధుడు కాడు- స్వాక్రాంతరాశినిబట్టి షష్ఠస్థగ్రహ వేధ వామవేధ యనబడును, యీ రెండును శుభములు.



## జన్మరాశ్యాది గ్రహణఫలము.

శ్లో॥ జన్మర్క్షేసిధనం గ్రహం జనిభతో ఘాతఃక్షతిశ్శ్రీర్వ్యథాచింతా సౌఖ్యకళత్రదౌస్థ్య మృతయస్స్యుర్మాననాశస్సుఖం। లాభోపాయ ఇతిక్రమాత్తదశుభధ్వస్త్యై జపస్స్వర్ణగోదానం శాంతిరథో గ్రహంత్వశుభదం నో వీక్ష్యమాహుః పరే॥

తా॥ జన్మనక్షత్రమందు గ్రహణము వచ్చెనేని నాశముగలుగును, జన్మరాశి మొదలు 1- 2- 3- 4- 5- 6- 7- 8- 9- 10- 11- 12 రాశులలో గ్రహణమువచ్చెనేని క్రమముగా ఘాత- హాని- సంపత్- రోగము- చింత - సౌఖ్యము - భార్యాకష్టము- మృత్యువు- మానభంగము- సుఖము- లాభము- అపాయమును గల్గును, వీటిలో దుష్టఫలనివారణ కొఱకు జపగోదానశాంతుల జేయవలెను. అశుభ గ్రహణము జూడగూడదని కొందఱి యభిప్రాయము.

## చంద్ర బలము.

శ్లో॥ పాపాంతఃపాపయుగ్ద్యూనే పాపాచ్చంద్రశ్శుభోప్యసత్।
శుభాంశేచాధిమిత్రాంశే గురుదృష్టోఽశుభోపిసత్॥

తా॥ పాపాంతుడున్న పాపయుతుడున్ను పాపునకు సప్తమ మందున్నవాడును అయిన చంద్రుడు శుభుడైనను, అశుభమునే చేయును, శుభనవాంశమిత్రాంశలయందున్నటువంటిన్ని గురువుచేత జూడబడుచున్నటు వంటిన్ని చంద్రుడు అశుభుడైనను శుభఫలమునే యిచ్చును.

శ్లో॥ సితాసితాఖ్యౌ సద్దృష్టే చంద్రేదేవపక్షౌ శుభావుభౌ।
వ్యత్యాసేచాశుభౌప్రోక్తౌ సంకటేబ్జబలంత్విదమ్॥

తా॥ చంద్రుడు సితాసితపక్షాదులయందు క్రమముగా సద్దృష్టుడౌచునుండగా రెండుపక్షములు శుభకరములు, ఇందుకువిపరీతముగానుండెనేని రెండునుఅశుభకరములు

## గ్రహముద్రా ధారణము.

శ్లో॥ వజ్రంశుక్రేబ్జెనుముక్తాప్రవాళం। భౌమేగోర్గో మేధమార్కేతునీలం। కేతౌవైడూర్యంగురౌపుష్పకంజ్ఞే పాచీఃప్రాఙ్మాణిక్యమర్కే తుమధ్యే॥

తా॥ గ్రహబలము జాలనప్పుడు యీరీతిగా మణిఖచితమైన యుంగరమును ధరించవలెను. మధ్యను సూర్యుని మాణిక్యము తూర్పున శుక్రునివజ్రమును, ఆగ్నేయమున చంద్రుని ముత్యమును, దక్షిణమున అంగారకుని పగడమును, నైరుతిని రాహు

గోమేధికమును పశ్చిమమున శని నీలమును, వాయువ్యమున కేతు వైడూర్యమును, ఉత్త రమును బృహస్పతి పుష్యరాగమును, ఈశాన్యమున బుధుని మరకతమును స్థాపించునది.

శ్లో॥ మాణిక్యముక్తాఫలవిద్రుమాణి గారుత్మకం పుష్పకవజ్రనీలం । గోమేధవైడూర్యకమర్కతః స్యూ రత్నాన్యథోజ్ఞస్య ముదే సువర్ణమ్॥

తా॥ పూర్వోక్తరీతిగా మణిసముదాయమును ధరించ సామర్థ్యము లేనప్పుడు ఈక్రింది క్రమముగా అశుభకర గ్రహముల నొక్కొక్కదానిని ధరించవలెను—సూర్యాదిక్రమముగా మాణిక్యం- ముత్యం- పగడం- మరకతము- పుష్యరాగం- వజ్రం నీలం- గోమేధము- వైడూర్యము.

శ్లో॥ ధార్యం లాజావర్తకం రాహుకేత్వో రౌప్యం శుక్రేందోర్వోశ్చ ముక్తా గురోస్తు। లోహం మందస్యారభాన్వోః ప్రవాళం తారా రాజన్మర్క్షాత్ త్రిరావృత్తితస్స్యాత్ ।

తా॥ ద్రవ్యాభావమందీ దిగువ ప్రకారముగా గాధరించవలెను. బుధునకు బంగారమును, రాహుకేతువులకు లాజావర్తకమును, చంద్రశుక్రులకు వెండిని, గురువునకు ముత్యము, శనికి ఇనుము, కుజరవులకు పగడమును (తారాబలము)

జన్మనక్షత్రము మొదలు దిననక్షత్రము వఱకు తొమ్మిదేసి లెక్కించగా నీక్రింది ప్రకారము తారలగును.

శ్లో॥ జన్మాఖ్యసంపద్విపదః క్షేమప్రత్యరిసాధకాః । వధమైత్రాతిమైత్రాస్స్యుస్తారానామసదృక్ ఫలాః॥

తా॥ ౧ జన్మతార- ౨ సంపత్తార- ౩ విపత్తార- ౪ క్షేమతార- ౫ ప్రత్యక్తార ౬ సాధనతార- ౭ నైధనతార- ౮ మిత్రతార- ౯ పరమమైత్రతార- ఇవి వీటి నామమునకు దగిన ఫలమిచ్చును.

## తారా దోషాపవాదము.

శ్లో॥ మృత్యౌ స్వర్ణతిలాన్ విపద్యపి గుడం శాకం త్రిజన్మస్వథో దద్యాత్ప్రత్యరితారకాసు లవణం సర్వో విపత్ప్రత్యరిః। మృత్యుశ్చాదిమపర్యయే న శుభదో ఽథైషాం ద్వితీయేంశకా నాదిమాంత్య తృతీయకా అథ శుభాస్సర్వే తృతీయే స్మృతాః॥

తా॥ నైధనతారయందు స్వర్ణసహిత తిలలనున్న, విపత్తారయందు గుడమును, జన్మతారయందు శాకమును, ప్రత్యక్తారయందు లవణమును, యిచ్చిన యెడల దోషముండదు. ప్రకారాంతరము జన్మనక్షత్రము మొదలు నిత్యనక్షత్రము వఱకు తొమ్మిది తొమ్మిది చొప్పున మూడు ఆవృత్తులుగా లెక్కించగా మొదటి నవకమందు



విపత్, ప్రత్యక్, నైధన తారలు సర్వమును శుభములుగావు ద్వితీయ నవక (ఆవృత్తి) యందు విపత్తారలో మొదటి ౨౦ ఘటికలును ప్రత్యక్తారలో మధ్య ౨౦ ఘటికలును. నైధన తారలో అంతమున ౨౦ ఘటికలును మంచివిగావు, మిగిలిన ఘటికలు శుభప్రదములు, తృతీయావృత్తియందు అన్నితారలు శుభప్రదములు యీరెండు మతములు నిత్యము చూడదగినవికావు. అవశ్యకమైనప్పుడు చూడవలెను.

## చంద్రావస్థలు.

శ్లో॥ షష్టిఘ్నం గతభం భుక్తఘటీయుక్తం యుగాహతం ।
శరాబ్ధిహృల్లబ్ధతోర్క శేషేవస్థాః క్రియాదితః॥

తా॥ అశ్విన్యాదిగా అభీష్టనక్షత్రము వరకు గతించిన నక్షత్రములను 60 చే గుణించి ఇష్టనక్షత్రగత ఘటికలను కలిపి 4 చే హెచ్చించి 45 చే భాగించగా వచ్చిన లబ్ధమును 12 చేత భాగించగా చంద్రుని వర్తమానావస్థవచ్చును. అనగా ఇష్టనక్షత్రము పుబ్బ అశ్విన్యాదిగా పుబ్బవరకు గతించినవి 10 యీపదిని 60 చే గుణించగా 60=10-600 అగును పుబ్బలో గతఘటికలు 20 కలపగా 620 అగును దీనిని 4 చే హెచ్చించగా 4=620 - 2480 అగును దీనిని 45 చే భాగించగా 55 లబ్ధమగును దీనిని అవస్థాసంఖ్య 12 చే భాగించగా శేషము 7 మిగిలినవి గాన చంద్రునకు గతావస్థలు 7 ని తెలుసుకునేది భోగ్యావస్థ 8 వది సుప్తావస్థఅని తెలుసుకునేది ఇట్లె ఇష్ట కాలముకు చంద్రావస్థను తెలుసుకుని ఆయాఫలములను చెప్పునది.

శ్లో॥ ప్రవాసనాశౌ మరణం జయశ్చ హాస్యారతిక్రీడితసుప్తభుక్తాః । జ్వరాఖ్యకంపస్థిరతా అవస్థా మేషాత్క్రమాన్నామసదృక్ఫలాః స్యుః॥

తా॥ 1 ప్రవాసము, 2 నాశము, 3 మరణము, 4 జయము, 5హాస్యము,6అరతి, 7 క్రీడ, 8 సుప్త, 9 భుక్త, 10 జ్వరాఖ్య, 11 కంప, 12 స్థిర, ...యీ 12 అవస్థలు మేషాదిగా చూచేది యిదియొకమార్గము పూర్వము వ్రాసినది మరియొకమార్గము రెండు మార్గములున్నవి గాన వ్రాయబడె.

## నవగ్రహ స్నానాదులు.

శ్లో॥ లాజాకుష్ఠబలాప్రియంగుఘనసిద్ధార్థైర్నిశాదారుభిః పుంభాలోధ్రయుతైర్జలైర్నిగదితం స్నానం గ్రహోత్థాఘహృత్ । ధేనుః కంబ్వరుణౌ వృషశ్చ కనకం పీతాంబరం ఘోటకః శ్వేతో గౌరసితా మహాసిరజశ్ఛాగా ఇత్యేతార వేదక్షిణాః॥

తా॥ లాజ, చంగల్వకోష్టు, జల, ప్రేంఖణ, నల్లఆవాలు, సనుపు, దేవదారు, పుంఖలొద్దుగ, వీటితో గూడిన స్నానము క్రమముగా రవ్యాది గ్రహములవల్ల కలిగిన పీడను నివారించును రవ్యాదిగ్రహములకు క్రమముగా దానములు గోవు శంఖము ఎఱ్ఱ యెద్దు బంగారము, పీతాంబరము, తెల్ల గుఱ్ఱము, నల్ల ఆవు, ఖడ్గము, మేక.

## గంతవ్య రాశి ఫలము.

శ్లో॥ సూర్యారసౌమ్యాస్ఫుజితోఽక్షనాగ సప్తాద్రిఘస్రైర్విధు రగ్నినాడీః । తమోయమేజ్యాస్త్రిరసాశ్విమాసైర్ గంతవ్యరాశేః ఫలదాః పురస్తాత్ ॥

తా॥ సూర్యుడు 5 దినములున్నూ, చంద్రుడు 3 ఘడియలున్ను, అంగారకుడు 8 దినములున్ను, బుధుడు 7 దినములున్నూ, గురుడు 2 మాసములున్ను, శుక్రుడు 7 దినములును, శని 6 మాసములును, రాహుకేతువులు 3 మాసములును ముందు రాశి ఫలము నిత్తురు.

## దుష్టయోగ శాంతిః.

శ్లో॥ దుష్టేయోగే హేమచంద్రేచ శంఖంధాన్యం తిథ్యర్ధేతిథౌ తండులాంశ్చ । వారేరత్నంభేచగాంహేమనాడ్యాం దద్యాత్సింధూత్థంచతారాసురాజా॥

తా॥ దుష్టతిథ్యాదులకు దానములను చెప్పుచున్నాడు— వ్యతీపాతాది యోగములయందు బంగారమును, చంద్రునకు శంఖము, తిథ్యర్థమునందు ధాన్యమును, తిథికి బియ్యమును, వారమునకు రత్నమును, రాశికి గోవును, ముహూర్తమునకు బంగారమును తారలకు లవణమును దానమివ్వవలెను.

## రవ్యాదివారయుక్త జన్మనక్షత్రఫలము.

శ్లో॥ రాశ్యాదిగౌరవికుజౌ ఫలదౌ సితేజ్యౌ మధ్యే సదాశశిసుతశ్చరమేఽబ్జమందౌ । అధ్వాన్నవహ్నిభయసన్మతి వస్త్రసౌఖ్యదుఃఖానిమాసి జనిభే రవివాసరాదౌ॥

తా॥ సూర్యాంగారకులు రాశ్యాదియందును, గురుశుక్రులు రాశికి మధ్యయందును, బుధుడు రాశియంతమందును, చంద్రశనులు రాశ్యంతమందును, సంపూర్ణఫలము నిత్తురు. ప్రతిమాసమందును జన్మనక్షత్రము ఆదివారముతో గూడిన ప్రయాణమును, సోమవారముతో గూడిన అన్నమును, మంగళవారముతో గూడిన అగ్నిభయమును, బుధవారముతో గూడిన మంచిబుద్ధియును, గురువారముతో గూడిన వస్త్రప్రాప్తియును శుక్రవారముతో గూడిన సౌఖ్యమును శనివారముతో గూడిన దుఃఖమును కలుగునని తా॥



ఇతి శ్రీ దైవజ్ఞానంత సుతరామవిరచితే ముహూర్తచింతామణౌ చతుర్థం గోచార ప్రకరణం సమాప్తమ్.

---

## ప్రథమ రజోదర్శనము.

శ్లో॥ ఆద్యంరజశ్శుభంమాఘ మార్గరాధేషఫాల్గునే । జ్యేష్ఠశ్రావణయోఃశుక్లే సద్వారేసత్తనౌదివా ॥ శ్రుతిత్రయమృదుక్షిప్రధ్రువ స్వాతౌసితాంబరే।మధ్యంచమూలాఽదితిభే । పిత్రమిత్రేశివరేష్వసత్ ॥

తా॥ మాఘ మార్గశిర వైశాఖ ఆశ్వయుజ ఫాల్గుణ జ్యేష్ఠ శ్రావణమాసములయందును, శుక్లపక్షమందును, శుభవారమందును, శుభలగ్నమందును, పగటియందును తెల్లబట్ట ధరించినప్పుడును శ్రవణ, ధనిష్ఠ, శతభిష, మృదు, క్షిప్ర, ధ్రువ, స్వాతీనక్షత్రములయందును, కన్యకు ప్రథమ రజోదర్శనమైన శుభకరము. మూల, పునర్వసు, మఖ, కృత్తిక, విశాఖలయందైన మధ్యమఫలము, మిగిలిన నక్షత్రములయందు అశుభకరము.

శ్లో॥ భద్రానిద్రాసంక్రమేదర్శరిక్తాసంధ్యాషష్ఠీద్వాదశీవైధృతేషు। రోగేష్టమ్యాంచంద్రసూర్యోపరాగే।పాతేచాద్యంనోరజోదర్శనంసత్ ॥

తా॥ భద్రాయోగమందును, నిద్రాసమయమందును. సంక్రమణదర్శ రిక్తతిథులయందును, సంధ్యాకాలమందును, షష్ఠీద్వాదశులయందును, వైధృతియోగమందును జ్వరముతో గూడి నప్పుడును, అష్టమియందును, సూర్యచంద్ర గ్రహణములయందును, వ్యతీపాతయందును, ప్రథమరజోదర్శనము క్షేమంకరము గాదు.

శ్లో॥ హస్తాఽనిలాశ్విమృగమైత్ర వసుధ్రువాఖ్యైః శక్రాన్వితైః శుభతిథౌ శుభవాసరేచ । స్నాయాదథార్తవవతీమృగ పౌష్ణవాయు హస్తాశ్విధాతృభిరరంలభతేచగర్భమ్॥

తా॥ హస్త, స్వాతి, మృగశిర, అశ్విని, అనూరాధ, ధనిష్ఠ, ధ్రువ, జ్యేష్ఠ నక్షత్రములయందును, శుభతిథివాసరములయందును, ప్రథమ రజస్వలస్నానము జేయవలెను. మృగశిర, రేవతి, స్వాతి, హస్త, అశ్విని, రోహిణీ నక్షత్రములయందు స్నానముజేసిన యడల శీఘ్రముగా గర్భమును ధరించును.

## గర్భాధానము.

శ్లో॥ గండాంతంత్రివిధంత్యజేన్నిధనజన్మర్క్షేచమూలాంతకమ్।

దస్రసంపౌష్ణముఖోపరాగవదినంపాతంతథావైధృతిః। పిత్రోశ్శ్రాద్ధదినం దివాచ పరిఘాద్యర్థంస్వపత్నీంగమే। భాన్యుత్పాతహతాని మృత్యుభవనం జన్మర్క్షతఃపాపభమ్॥

తా॥ త్రివిధ గండాంతములను, నైధనజన్మతారలను, మూల, భరణి, అశ్విని, రేవతి, మఖ, నక్షత్రములను, గ్రహణదినమును, వ్యతీపాత వైధృతులను, మాతాపితరుల శ్రాద్ధదినములను, దివాభాగమును పరిఘాపూర్వార్ధమును, ఉత్పాతగ్రహణాది నక్షత్రములను, జన్మరాశికి ౮ వ రాశిని, పాపాక్రాంత నక్షత్రమును, గర్భాధానమందు విడువవలెను.

శ్లో॥ భద్రాషష్ఠీపర్వరిక్తాశ్చసంధ్యా భౌమార్కార్కీనాద్యరాత్రీశ్చతస్రః। గర్భాధానంత్ర్యుత్తరేంద్వర్క మైత్రబ్రహ్మస్వాతీవిష్ణువస్వంబుపేసత్॥

తా॥ గర్భాధానమును భద్ర, షష్ఠీ, పర్వ, రిక్తతిథులయందును, సంధ్యాకాలమందును, మంగళ, ఆది, శని వారములయందును, రజస్వలయైన నాలుగుదినములవఱకును చేయగూడదు, ఉత్తరాత్రియ, మృగశీర్ష, హస్త, అనూరాధ, రోహిణి, స్వాతి, శ్రవణ, ధనిష్ఠ, శతభిషక్, నక్షత్రములయందు గర్భాధానమును చేయవలయును.

శ్లో॥ కేంద్రత్రికోణేషుశుభైశ్చపాపైః త్ర్యాయారిగైః పుంగ్రహదృష్టలగ్నే। ఓజాంశగేందావపియుగ్మరాత్రౌ చిత్రాదితీజ్యాశ్విషు మధ్యమంస్యాత్॥

తా॥ ౧- ౪- ౫- ౭- ౯- ౧౦ స్థానములయందు శుభులుండగాను ౩-౬-౧౧ స్థానములయందు పాపులుండగాను, పురుషగ్రహములతో చూడబడుచున్న లగ్నమందును, చంద్రుడులగ్నమునకు విషమరాశ్యంశలయందుండగాను, సమరాత్రులయందును, గర్భాధానము ప్రశస్తము. చిత్ర, పునర్వసు, పుష్య, అశ్విని, నక్షత్రములు గర్భాధానమునకు మధ్యములు, పూర్వశ్లోకోక్తములు ఉత్తమములని తెలుకొనేది.

## సీమంతము.

శ్లో॥ జీవార్కారదినేమృగేజ్య నిరృతిశ్రోత్రాదితిబ్రధ్నభై రిక్తామార్కారసాష్టవర్జ్య తిథిభిర్మాసాధిపేపీవరే। సీమంతోష్టమషష్ఠమాసిశుభదైః కేంద్రత్రికోణేఖలైః। లాభారిత్రిషువాధ్రువాంత్య సదహేలగ్నేచ పుంభాంశకే॥

తా॥ గురు- మంగళ- ఆదివారములయందును, మృగశిర- పుష్య- మూల-



శ్రవణ- పునర్వసు- రేవతీ- నక్షత్రములయందును, రిక్తా- అమావాస్య- ద్వాదశి- షష్ఠి అష్టములను విడిచి మిగిలిన తిథులయందును, మాసాధిపుడు బలవంతుడైయుండగాను, శుభగ్రహములు కేంద్రత్రికోణములయందుండగాను, ౩- ౬- ౧౧ స్థానములయందు పాపులుండగాను, ధ్రువనక్షత్రములయందును, పురుషరాశియందును, ౬- ౮ మాసములయందును, సీమంతమును చేయవలెను.

## మాసాధిపతులు.

శ్లో॥ మాసేశ్వరాః సితకుజేజ్యరవీందుసౌరి। రిందాత్మజాస్తనుప చంద్రదివాకరాస్స్యుః। స్త్రీణాంవిధోర్బలముశంతి వివాహగర్భసంస్కారయోరితరకర్మసుభర్తురేవ॥

తా॥ శుక్రుడు- అంగారకుడు- బృహస్పతి- రవి- చంద్రుడు- శని- బుధుడు- లగ్నేశుడు- చంద్రుడు-సూర్యుడును క్రమముగా మాసాధిపతులు వివాహగర్భసంస్కారములయందు స్త్రీలకు చంద్రబలము ముఖ్యమని చెప్పుచున్నారు ఇతర కర్మలయందు భర్తకు చంద్రబలముండవలెను.

## పుంసవనము.

శ్లో॥ పూర్వోదితైః పుంసవనంవిధేయం। మాసేతృతీయేత్వథవిష్ణుపూజా। మాసేష్టమేవిష్ణువిధాతృజీవైర్లగ్నేశుభే మృత్యుగృహేచశుద్ధే॥

తా॥ పూర్వోక్త తిథివార నక్షత్రములయందు పుంసవనము జేయవలెను తృతీయమాసమందు విష్ణుపూజచేయవలెను, యెనిమిదవమాసమందు విష్ణు బ్రహ్మ బృహస్పతుల పూజజేయవలయును యీగర్భసంస్కారములకు అష్టమశుద్ధియుండవలెను.

## జాతకర్మ.

శ్లో॥ తజ్జాతకర్మాదిశిశోర్విధేయం పర్వాఖ్యరిక్తోనతిథౌశుభేహ్ని। ఏకాదశద్వాదశకేపిఘస్రే మృదుధ్రువక్షిప్రచరోడుషుస్యాత్॥

తా॥ పర్వరిక్తేతర తిథులయందును, మృదుధ్రువక్షిప్రచర నక్షత్రములయందును, ౧౧ వ రోజునగాని ౧౨ వ రోజునగాని జాతకర్మాదికముల నాచరించవలెను.

## సూతికాస్నానము.

శ్లో॥ పౌష్ణధ్రువేందుకరవాతహయేషుసూతీస్నానంసమిత్రభరవీజ్యకుజేషుశస్తం। నార్ద్రాత్రయశ్రుతిమఘాంతకమిశ్రమూలత్వాష్ట్రేజ్ఞసౌరివసుద్రిక్తతిథ్యామ్॥

తా॥ లాజ, చంగల్వకోష్టు, జల, ప్రేంఖణ, నల్లఆవాలు, సముపు, దేవదారు, పుంఖలోద్ధగ, వీటితో గూడిన స్నానము క్రమముగా రవ్యాది గ్రహములవల్ల కలిగిన పీడను నివారించును రవ్యాదిగ్రహములకు క్రమముగా దానములు గోవు శంఖము ఎఱ్ఱ యెద్దు బంగారము, పీతాంబరము, తెల్ల గుఱ్ఱము, నల్ల ఆవు, ఖడ్గము, మేక.

### గంతవ్య రాశి ఫలము.

శ్లో॥ సూర్యారసౌమ్యాస్ఫుజితోఽష్టనాగ సప్తాద్రిఘస్రైర్విధు రగ్నినాడీః । తమోఽయమేజ్యాస్త్రిరసాశ్వమాసై ర్గంతవ్యరాశేఃఫల దాఃపురస్తాత్ ॥

తా॥ సూర్యుడు 5 దినములున్ను, చంద్రుడు 3 ఘడియలున్ను, అంగారకుడు 8 దినములున్ను, బుధుడు 7 దినములున్ను, గురుడు 2 మాసములున్ను, శుక్రుడు 7 దినములును, శని 6 మాసములును, రాహుకేతువులు 3 మాసములును ముందు రాశి ఫలము నిత్తురు.

### దుష్టయోగ శాంతిః.

శ్లో॥ దుష్టేయోగేహేమచంద్రేచ శంఖంధాన్యం తిథ్యర్ధేతిథౌ తండులాంశ్చ । వారేరత్నంభేచగాంహేమనాడ్యాం దద్యాత్సింధూత్థంచతారాసురాజా ॥

తా॥ దుష్టతిథ్యాదులకు దానములను చెప్పుచున్నాడు— వ్యతీపాతాది యోగములయందు బంగారమును, చంద్రునకు శంఖము, తిథ్యర్ధమునందు ధాన్యమును, తిథికి బియ్యమును, వారమునకు రత్నమును, రాశికి గోవును, ముహూర్తమునకు బంగారమును తారలకు లవణమును దానమివ్వవలెను.

### రవ్యాదివారయుక్త జన్మనక్షత్రఫలము.

శ్లో॥ రాశ్యాదిగౌరవికుజౌ ఫలదౌ సితేజ్యౌ మధ్యే సదా శశిసుతశ్చరమేఽబ్జమందౌ । అధ్వాన్నవహ్నిభయసన్మతి వస్త్రసౌఖ్యదుఃఖానిమాసి జనిభే రవివాసరాదౌ ॥

తా॥ సూర్యాంగారకులు రాశ్యాదియందును, గురుశుక్రులు రాశికి మధ్యయందును, బుధుడు రాశియంతమందును, చంద్రశనులు రాశ్యంతమందును, సంపూర్ణఫలము నిత్తురు. ప్రతిమాసమందును జన్మనక్షత్రము ఆదివారముతో గూడిన ప్రయాణమును, సోమవారముతో గూడిన అన్నమును, మంగళవారముతో గూడిన అగ్నిభయమును, బుధవారముతో గూడిన మంచిబుద్ధియును, గురువారముతో గూడిన వస్త్రప్రాప్తి



యు శుక్రవారముతో గూడిన సౌఖ్యమును శనివారముతో గూడిన దుఃఖమును కలుగునని తా॥

ఇతి శ్రీ దైవజ్ఞానంత సుతరామవిరచితే ముహూర్తచింతామణౌ చతుర్థం గోచార ప్రకరణం సమాప్తమ్.

---

### ప్రథమ రజోదర్శనము.

శ్లో॥ ఆద్యంరజశ్శుభంమాఘ మార్గరాధేషఫాల్గునే । జ్యేష్ఠశ్రావణయోశ్శుక్లే సద్వారేసత్తనౌదివా ॥ శ్రుతిత్రయమృదుక్షిప్రధ్రువ స్వాతౌసితాంబరే । మధ్యంచమూలాఽదితిభే । పిత్రమిత్రేశవరేష్వసత్ ॥

తా॥ మాఘ మార్గశీర్ష వైశాఖ ఆశ్వయుజ ఫాల్గుణ జ్యేష్ఠ శ్రావణమాసములయందును, శుక్లపక్షమందును, శుభవారమందును, శుభలగ్నమందును, పగటియందును తెల్లబట్ట ధరించినప్పుడును శ్రవణ, ధనిష్ఠ, శతభిష, మృదు, క్షిప్ర, ధ్రువ, స్వాతీనక్షత్రములయందును, కన్యకు ప్రథమ రజోదర్శనమైన శుభకరము. మూల, పునర్వసు, మఖ, కృత్తిక, విశాఖలయందైన మధ్యమఫలము, మిగిలిన నక్షత్రములయందు అశుభకరము.

శ్లో॥ భద్రానిద్రాసంక్రమేదర్శరిక్తాసంధ్యాషష్ఠీద్వాదశీవైధృతేషు । రోగేఽష్టమ్యాంచంద్రసూర్యోపరాగే । పాతేచాద్యంనోరజోదర్శనంసత్ ॥

తా॥ భద్రయోగమందును, నిద్రాసమయమందును, సంక్రమణదర్శ రిక్తతిథులయందును, సంధ్యాకాలమందును, షష్ఠీద్వాదశులయందును, వైధృతియోగమందును జ్వరముతో గూడి నప్పుడును, అష్టమియందును, సూర్యచంద్ర గ్రహణములయందును, వ్యతీపాతయందును, ప్రథమరజోదర్శనము క్షేమంకరము గాదు.

శ్లో॥ హస్తానిలాశ్విమృగమైత్ర వసుధ్రువాఖ్యైశ్శక్రాన్వితైశ్శుభతిథౌశుభవాసరేచ । స్నాయాదథార్తవవతీమృగ పౌష్ణవాయు హస్తాశ్విధాతృభిరరంలభతేచగర్భమ్ ॥

తా॥ హస్త, స్వాతి, మృగశిర, అశ్విని, అనూరాధ, ధనిష్ఠ, ధ్రువ, జ్యేష్ఠ నక్షత్రములయందును, శుభతిథివాసరములయందును, ప్రథమ రజస్వలస్నానము జేయవలెను. మృగశిర, రేవతి, స్వాతి, హస్త, అశ్విని, రోహిణీ నక్షత్రములయందు స్నానముజేసిన యడల శీఘ్రముగా గర్భమును ధరించును.

### గర్భాధానము.

శ్లో॥ గండాంతంత్రివిధంత్యజేన్నిధనజన్మర్క్షేచ మూలాంతకమ్ ।

దస్రంపౌష్ణముఖోపరాగవదినంపాతంతథానైధృతిం।పిత్రోశ్శ్రాద్ధదినం దివాచ పరిఘాద్యర్థంస్వపత్నీగమే। భాన్యుత్పాతహతాని మృత్యుభవనం జన్మర్క్షతఃపాపభమ్॥

తా॥ త్రివిధ గండాంతములును, నైధనజన్మతారలను, మూల, భరణి, అశ్విని, రేవతి, మఖ, నక్షత్రములును, గ్రహణదినమును, వ్యతీపాత వైధృతులను, మాతాపితరుల శ్రాద్ధదినములను, దివాభాగమును పరిఘాపూర్వార్ధమును, ఉత్పాతగ్రహణాది నక్షత్రములను, జన్మరాశికి ౮ వ రాశిని, పాపాక్రాంత నక్షత్రమును, గర్భాధానమందు విడువ వలెను.

శ్లో॥ భద్రాషష్ఠీపర్వరిక్తాశ్చసంధ్యా భౌమార్కార్కీనాద్యరాత్రీశ్చతస్రః। గర్భాధానంత్ర్యుత్తరేంద్వర్క మైత్రబ్రహ్మస్వాతీవిష్ణువస్వంబుపేసత్॥

తా॥ గర్భాధానమును భద్ర, షష్ఠీ, పర్వ, రిక్తతిథులయందును, సంధ్యాకాలమందును, మంగళ, ఆది, శని వారములయందును, రజస్వలయైన నాలుగుదినములవఱకును చేయగూడదు, ఉత్తరాత్రియ, మృగశీర్ష, హస్త, అనూరాధ, రోహిణి, స్వాతి, శ్రవణ, ధనిష్ఠ,శతభిషక్, నక్షత్రములయందు గర్భాధానమునుచేయవలయును.

శ్లో॥ కేంద్రత్రికోణేషుశుభైశ్చపాపైః స్త్ర్యాయారిగైః పుంగ్రహదృష్టలగ్నే। ఓజాంశగేందావపియుగ్మరాత్రౌ చిత్రాదితీజ్యాశ్విషుమధ్యమంస్యాత్॥

తా॥ ౧- ౪- ౫- ౭- ౯- ౧౦ స్థానములయందు శుభులుండగాను ౩-౬-౧౧ స్థానములయందు పాపులుండగాను, పురుషగ్రహములతో చూడబడుచున్న లగ్నమందును, చంద్రుడులగ్నమునకు విషమరాశ్యంశలయందుండగాను, సమరాత్రులయందును, గర్భాధానము ప్రశస్తము. చిత్ర, పునర్వసు, పుష్య, అశ్విని, నక్షత్రములు గర్భాధానమునకు మధ్యములు, పూర్వశ్లోకోక్తములు ఉత్తమములని తెలుకొనేది.

## సీమంతము.

శ్లో॥ జీవార్కారదినేమృగేజ్య నిరుతిశ్రోత్రాదితిబ్రధ్నభై రిక్తామార్కారసాష్టవర్జ్య తిథిభిర్మాసాధిపేపీవరే। సీమంతోష్టమషష్ఠమాసిశుభదైః కేంద్రత్రికోణేఖలై। ర్లాభారిత్రిషువాధ్రువాంత్యసహేలగ్నేచ పుంభాంశకే॥

తా॥ గురు- మంగళ- ఆదివారములయందును, మృగశిర- పుష్య- మూల-



శ్రవణ- పునర్వసు- రేవతీ- నక్షత్రములయందును, రిక్తా- అమావాస్య- ద్వాదశి-షష్ఠి అష్టములను విడిచి మిగిలిన తిథులయందును, మాసాధిపుడు బలవంతుడైయుండగాను, శుభగ్రహములు కేంద్రత్రికోణములయందుండగాను, ౩- ౬- ౧౧ స్థానములయందు పాపులుండగాను, ధ్రువనక్షత్రములయందును, పురుషరాశియందును, ౬- ౮ మాసములయందును, సీమంతమును చేయవలెను.

## మాసాధి పతులు.

శ్లో॥ మాసేశ్వరాఃసితకుజేజ్యరవీన్దుసౌరి । రిందాత్మజా స్తనుపచంద్రదివాకరాస్స్యుః। స్త్రీణాంవిధోర్బలముశంతి వివాహగర్భసంస్కారయోరితరకర్మ సుభర్తురేవ॥

తా॥ శుక్రుడు- అంగారకుడు- బృహస్పతి- రవి- చంద్రుడు- శని- బుధుడు- లగ్నేశుడు- చంద్రుడు-సూర్యుడును క్రమముగా మాసాధిపతులు వివాహగర్భసంస్కారములయందు స్త్రీలకు చంద్రబలము ముఖ్యమని చెప్పుచున్నారు ఇతర కర్మలయందు భర్తకు చంద్రబలముండవలెను.

## పుంసవనము.

శ్లో॥ పూర్వోదితైఃపుంసవనంవిధేయం। మాసేతృతీయేత్వథవిష్ణుపూజా।మాసేష్టమేవిష్ణువిధాతృజీవైర్లగ్నేశుభే మృత్యుగృహేచశుద్ధే॥

తా॥ పూర్వోక్త తిథివార నక్షత్రములయందు పుంసవనము జేయవలెను తృతీయమాసమందు విష్ణుపూజచేయవలెను, యెనిమిదవమాసమందు విష్ణు బ్రహ్మ బృహస్పతుల పూజజేయవలయును యీగర్భసంస్కారములకు అష్టమశుద్ధియుండవలెను.

## జాతకర్మ.

శ్లో॥ తజ్జాతకర్మాదిశిశోర్విధేయం పర్వాఖ్యరిక్తోనతిథౌశుభేహ్ని। ఏకాదశద్వాదశకేపిఘస్రే మృదుధ్రువక్షిప్రచరోడుషుస్యాత్॥

తా॥ పర్వరిక్తేతర తిథులయందును, మృదుధ్రువక్షిప్రచర నక్షత్రములయందును, ౧౧ వ రోజునగాని ౧౨ వ రోజునగాని జాతకర్మాదికముల నాచరించవలెను.

## సూతికాస్నానము.

శ్లో॥ పౌష్ణధ్రువేందుకరవాతహయేషుసూతీస్నానంసమిత్రభరవీజ్యకుజేషుశస్తం। నార్ద్రాత్రయశ్రుతిమఘాంతకమిశ్రమూలత్వాష్ట్రేజ్ఞసౌరివసుడ్రిక్తతిథ్యామ్॥

తా॥ సూతికాస్నానము, రేవతీ, ధ్రువ, మృగశీర్ష, హస్త, స్వాతీ, అశ్వినులయందును, అనూరాధయందును, రవి, గురు, కుజవారములయందును చేయవలెను గాని, ఆరుద్ర, పునర్వసు, పుష్య, శ్రవణ, మఖ, భరణి సాధారణ మూల, చిత్త, బుధ, శని, ౮- ౬- ౧౨- ౪- ౯- ౧౪ తిథులయందు జేయగూడదు.

## దంత జననఫలమ్.

శ్లో॥ మాసేచేత్ప్రథమేభవే త్సదశనో బాలో వినశ్యేత్స్వయం । హన్యాత్స్వక్రమశోనుజాత భగినీమాత్రగ్రజాన్ ద్వ్యాదికే। షష్ఠాదౌలభతేహి భోగమఖిలంతాతాత్సుఖంపుష్టతాం లక్ష్మీంసౌఖ్యమథోజనౌ సదశనోర్ధ్వాంస్వపిత్రాదిహా॥

తా॥ శిశువుకు ౧ మాసమందు దంతములుదయించిన స్వయముగా తానె నశించును. ౨ వ మాసమందైతే కనిష్ఠునికిని, 3 వ మాసమందైతె తోబుట్టువుకును, ౪ వ మాసమందైతె తల్లికిని, ౫ వ మాసమందైతె అన్నకును, నాశముగలుగును, ౬ వ మాసమందైన గొప్పభోగమునున్ను, ౭ వ మాసమందైన తండ్రివలన సుఖమునున్ను- ౮ వ మాసమందైన పుష్టినిన్ని- ౯ వ మాసమందైన లక్ష్మినిన్ని ౧౦ వ మాసమందైనసౌఖ్యమునున్ను పొందును. దంతములతో జననముగాని ముందుగా పైపళ్లు పుట్టుటగాని సంభవించిన తన తండ్రి మొదలైన వారిని నశింపజేయును కాబట్టి అందు తగిన శాంతిని చేయవలెను.

## డోలా రోహణము.

శ్లో॥ డోలారోహార్కభాత్పంచ శరపంచేషుసప్తభైః । నైరుజ్యం మరణంకార్శ్యం వ్యాధిఃసౌఖ్యంక్రమాచ్ఛిశోః॥

తా॥ శిశువుకు డోలారోహణము సూర్యనక్షత్రము మొదలుకొని ౫ నక్షత్రములయందైన ఆరోగ్యము పిమ్మట ౫ మృతి- తరువాత ౫ కృశత్వము - తరువాత ౫ వ్యాధి- పిమ్మట ౭ సౌఖ్యము.

తా॥ పూర్వోక్త నక్షత్రములలో మృదుక్షిప్రధ్రువ నక్షత్రములయందును శుభవారమందును జన్మాదిగా 3౨- ౧౨- ౧౬- ౧౮- ౧౦ దినములయందు శిశువుకు డోలారోహణము జేయవలెను.

## నిష్క్రమణము.

శ్లో॥ దంతార్కభూపద్రుతిదిగ్మితవాసరేస్యాద్వారేశుభే మృదులఘుధ్రువభైః శిశూనాం । డోలాధిరూఢిరథనిష్క్రమణం చతుర్థమాసిగమోక్తసమయేర్కమితేహ్నివాస్యాత్ ।



౧౨ వ దినమందుగాని ౪ వ మాసమందుగాని యాత్రికు చెప్పబడిన తిథివారాదులయందు శిశువుకు నిష్క్రమణము జేయవలెను నిష్క్రమణనగా శిశువును గ్రామాంతరమునకుగాని గృహాంతరమునకుగాని తీసికొని వెళ్లుట శిశువును భూమియందు కూర్చుండబెట్టుటయని కొందఱు చెప్పిరి.

## జలపూజా.

శ్లో॥ కవీజ్యాస్తచైత్రాధిమాసే నపౌషే జలంపూజయేత్సూతికా మాసపూర్తౌ । బుధేందీజ్యవారే విరిక్తేతిథౌ హి శ్రుతీజ్యాదితీంద్వర్క నైఋత్యమైత్రే॥

తా॥ సూతికమాస పూర్తికై (నెలపురుడు) బుధ గురు సోమవారములయందును, శ్రవణ, పుష్య, పునర్వసు, మృగశీర్ష, హస్త, మూల, అనూరాధానక్షత్రములయందును, ౧-౨-3-౫-౬-౭-౮-౧౦-౧౧-౧౨-౧౩-౧౫ తిథులయందును జలపూజ చేయవలెను (అనగా నూతులోచేద అనివాడుక) గురుశుక్రాస్తమయ చైత్ర, అధిక క్షయ పుష్యమాస రిక్తతిథులయందు జేయగూడదు.

## అన్నప్రాశనము.

శ్లో॥ రిక్తానందాష్టదర్శం హరిదివసమథో సౌరి భౌమార్కవారాన్ లగ్నంజన్మర్క్షలగ్నాష్టమ గృహలవగంమీనమేషాళికంచ । హిత్వా షష్ఠాత్సమేమాస్యథచ మృగదృశాం పంచమాదోజమాసే నక్షత్రైః స్స్యాత్స్థిరాఖ్యైః సమృదులఘుచరైర్బాలకాన్నాశనంసత్॥

తా॥ పురుషునకు 6 మొదలు సమమాసములయందును స్త్రీకి ౫ మొదలు విషమ మాసములయందును, స్థిర- మృదు- క్షిప్ర- చరనక్షత్రములయందును అన్నప్రాశనము చేయవలెను. ౧-౪-౬-౮-౯-౧౧-౧౨-౧౪ తిథులును, ౧-3-౭ వారములును జన్మ లగ్నము తదష్టలగ్నము నవాంశయు ౧-౮-౧౨ రాసులును అన్నప్రాశనకు యోగ్యములుకావు చేసిన దోషము కలుగును.

శ్లో॥ కేంద్రత్రికోణసహజేషు శుభైః ఖశుద్ధే లగ్నే త్రిలాభరిపుగైశ్చ పదంతిపాపైః । లగ్నాష్టషష్ఠరహితం శశినంప్రశస్తంమైత్రాంబుపానిల జనుర్భమసచ్చ కేచిత్ ॥

తా॥ 13.4.5.7.9.10 స్థానముల శుభులుండగాను 3.6.11 స్థానముల పాపులుండగాను చంద్రుడు 1.6.8 స్థానముల లేనప్పుడును దశమమందునే గ్రహములేనప్పుడును అన్నప్రాశన ముహూర్తము శుభప్రదము అనూరాధ శతభిషక్ స్వాతి జన్మ నక్షత్రములు అన్నప్రాశనకు యోగ్యములు గావని కొందరి మతము.

శ్లో॥ క్షీణేందుపూర్ణచంద్రేజ్యజ్ఞ భౌమార్కార్కిభార్గవైః త్రి
కోణవ్యయకేంద్రాష్ట స్థితైరుక్తంగ్రహైఃఫలమ్ ॥ భిక్షాశీయజ్ఞకృత్
దీర్ఘజీవీజ్ఞానీచపిత్తరుక్ । కుష్ఠీచాన్నక్లేశవాతవ్యాధిమాన్ భోగభాగితి॥

తా॥ అన్నప్రాశన లగ్నమునకు 5-9-12-1-4-7-10-8 స్థానములయందు క్రమముగా క్షీణచంద్రుడుండిన భిక్షాశియు పూర్ణచంద్రుడుండిన యజ్ఞకర్తయు గురువుండిన చిరంజీవియు బుధుడుండిన జ్ఞానియు అంగారకుడుండిన పైత్యరోగియు రవియుండిన కుష్ఠురోగియు శనియుండిన అన్నక్లేశవంతుడును వాతరోగియును శుక్రుడుండిన భోగవంతుడును అగును.

## భూమ్యుపవేశనము.

శ్లో॥ పృథ్వీంవరాహమభిపూజ్య కుజేవిశుద్ధేరిక్తేతిథౌ వ్రజతిపంచ
మమాసిబాలం । బధ్వాశుభేహ్నికటిసూత్రమధ్రువేందు జ్యేష్ఠాశ్వి
మైత్రలఘుభైరుపవేశయేత్కౌ ॥

తా॥ 5 వ మాసమందుగాని అన్నప్రాశన సమయమందుగాని భూమిని ఆదివరాహమును పూజించి అంగారకుడు శుద్ధుడౌచునుండగా రిక్తేతరతిథులయందు చరలగ్నమందు శుభదినమందు ధ్రువ మృగశీర్ష జ్యేష్ఠ అనూరాధ క్షిప్రనక్షత్రములయందు కటిసూత్రమును కట్టి బాలుని భూమియందు విడువవలెను.

## జీవికా పరీక్షా.

శ్లో॥ తస్మిన్కాలేస్థాపయేత్తత్పురస్తాద్వస్త్రంశస్త్రం పుస్తకంలేఖ
నీంచ । స్వర్ణంరౌప్యంయచ్చగృహ్ణాతి బాలస్తైరాజీవైస్తస్యవృత్తిః
ప్రతిష్ఠా ॥

తా॥ ఆభూమ్యుపవేశన సమయమందు బాలుని ముందర వస్త్రమును ఆయుధమును పుస్తకమును కలమును బంగారమును వెండినిన్ని వుంచవలెను. వీటిలోనెద్దానిని బాలుడు పట్టుకొనునో దానివలన నాశిశువుకు జీవనమని తెలుసుకొనేది.

## తాంబూలభక్షణము.

శ్లో॥ వారేభౌమార్కహీనేధ్రువ మృదులఘుభైర్విష్ణుమూలాది
తీంద్రస్వాతీవస్వభ్యుపేతైర్మిధునమృగసుతా కుంభగోమీనలగ్నేసౌ
మ్యైః కేంద్రత్రికోణైరశుభగ గనగైశ్చతుర్లాభత్రిసంస్థైస్తాంబూలం
సార్ధమాసద్వయమితసమయే ప్రోక్తమన్నాశనేవా॥



తా॥ 1-2-4-5-6 వారములయందును ధ్రువమృదుక్షిప్ర శ్రవణ మూల పునర్వసు జ్యేష్ఠ స్వాతి ధనిష్ఠ నక్షత్రములయందును మిథున మకర కన్య కుంభ వృషభ మీన లగ్నములయందును 1-4-5-7-9-10 స్థానములయందు శుభగ్రహములును 3-6-11 స్థానములయందు పాపగ్రహములును యుండగాను రెండుమాసముల పదిహేను రోజులకుగాని అన్నప్రాశన సమయమందుగాని శిశువుకు తాంబూలభక్షణమును చేయించవలెను.

## కర్ణవేధ.

శ్లో॥ హిత్వైతాంశ్చైత్రపౌషావమహరిశయనం జన్మమాసంచ
రిక్తాం । యుగ్మాబ్దంజన్మతారామృతుమునివసుభిః సమ్మితేమాస్యథో
వా । జన్మాహాత్సూర్యభూపైఃపరిమితదివసేజ్ఞేజ్యశుక్రేందువారేథోజా
బ్దేవిష్ణుయుగ్మాదితి మృదులఘుభైః కర్ణవేధఃప్రశస్తః॥

తా॥ చైత్రపుష్యమాసములను దినత్రయమును విష్ణుశయన మాసములను జన్మమాసమును 1-4-9-14 తిథులను సమసంవత్సరములను జన్మతారనున్ను విడచి 6-7-8 మాసములయందును, జన్మదినము మొదలు 12-16 దివసములయందును విషమసంవత్సరములయందును సోమ బుధ గురు శుక్రవాసరములయందును శ్రవణ ధనిష్ఠ పునర్వసు మృదుక్షిప్ర నక్షత్రములయందును శిశువులకు కర్ణవేధ (చెవులుకుట్టుట) ప్రశస్తము.

శ్లో॥ సంశుద్ధేమృతిభవనేత్రికోణకేంద్ర త్ర్యాయస్థైఃశుభఖచరైః
కవీజ్యలగ్నే । పాపాఖ్యైరరిసహజాయగేహసంస్థైర్లగ్నస్థేత్రిదశగురౌ
శుభావహస్స్యాత్ ॥

తా॥ అష్టమశుద్ధితో గూడిన లగ్నమందును కేంద్రత్రికోణములయందు శుభులుండగాను 3-6-11 స్థానములందు పాపులుండగాను గురువు లగ్నమందుండగాను గురుశుక్రలగ్నములయందు కర్ణవేధనము క్షేమకరము.

## మౌఢ్యాదులయందు విడువదగినవి.

శ్లో॥ గీర్వాణాంబుప్రతిష్ఠా పరిణయదహనాధానగేహప్రవేశాశ్చౌ
లంరాజాభిషేకోవ్రతమపిశుభదం నైవయామ్యాయనేస్యాత్ । నోవా
బాల్యాస్తవార్ధకం సురగురుసితయోర్నైవకేతూదయేస్యాత్ పక్షం
వార్ధంచకేచిజ్జహతి తిమపరేయావదీక్షాంతదుగ్రం॥

తా॥ దక్షిణాయనమందు గురుశుక్రుల బాల్యవార్ధక అస్తమయములయందును ధూమకేతూత్పత్తియందును, దేవతటాకాది ప్రతిష్ఠలున్ను, వివాహమున్ను, అగ్న్యా

ధాన, గృహప్రవేశములును, చౌలము, రాజ్యాభిషేకములును, ఇతరములైన శుభవ్రతములును చేయఁజనదు ధూమకేతూదయమందు ౧౫ దినములుగాని ౭ దినములుగాని విడువవలయును ద్విశిఖ, త్రిశిఖాది ఉగ్రధూమకేతూదయమందు యెంతవఱకు ధూమకేతువు కనుపించుచుండునో అంతవఱకు శుభకర్మలఁ జేయగూడదని కొందఱిమతము.

శ్లో॥ పురఃపశ్చాద్భృగోర్బాల్యం త్రిదశాహంచవార్ధకమ్ । పక్షం పంచదినం తేద్వే గురోఃపక్షముదాహృతే । తేదశాహంద్వయోఃప్రోక్తైశ్చిత్సప్తదినంపరైః । త్ర్యహంత్వాత్యయికేత్యన్యే రర్ధాహంచ త్ర్యహంవిధోః॥

తా॥ శుక్రునియొక్క ప్రాగుదయమందు 3 దినములును, పశ్చిమోదయమందు 10 దినములును బాల్యము పూర్వాస్తమయమందు 15 దినములును, పశ్చిమాస్తమయమందు ౫ దినములును, గురువుకు బాల్య వార్ధక్యములు రెండును 15 దినములు ఉభయులకు గూడ బాల్యవార్ధక్యములు 10 దినములనిగూడ కొందఱి మతము 7 దినములని కొందఱి యభిప్రాయము కార్యావశ్యతనుబట్టి 3 దినములని మఱికొందఱు చెప్పుచున్నారు చంద్రునకు వృద్ధత్వము 3 దినములు బాల్యము అర్థాహస్సును గాన నీగురుశుక్ర చంద్రులయొక్క బాల్యవార్ధక్యములయందీ చెప్పబడిన దినములనున్నూ, అస్తమయమునందును శుభకార్యములయందు విడువవలయును.

చూడా కర్మ.

శ్లో॥ చూడావర్షాస్తృతీయాత్ప్రభవతివిషమేష్టార్క రిక్తాద్యషష్ఠీ। పర్వోనాహేవిచైత్రోదగయనసమయేజ్ఞేందుశుక్రేజ్యకానాం। వారేలగ్నాంశయోశ్చ స్వభనిధనతనౌ నైధనేశుద్ధియుక్తే శాక్రోపేతైర్విమైత్రైర్మృదుచర లఘుభై రాయషట్త్రిస్థపాపైః । క్షీణచంద్రకుజసౌరిభాస్కరై ర్మృత్యుశస్త్రమృతి పంగుతాజ్వరాః । స్యుఃక్రమేణబుధజీవభార్గవైః కేంద్రగైశ్చ శుభమిష్టతారయా॥

తా॥ 3 వ సంవత్సరము మొదలు బేసి సంవత్సరములయందును 1-4-6-8-9 12-14 తిథులనున్నూ పంచపర్వములను చైత్రమాసమును విడిచి మిగిలిన తిథ్యాదులయందును ఉత్తరాయణమందును సోమ బుధ గురు శుక్రవారములయందును వీరిలగ్న నవాంశలయందును జ్యేష్ఠ మృదునక్షత్రములలో అనూరాధనువిడిచి మిగిలిన నక్షత్రములును చరక్షిప్రనక్షత్రములయందును 3-6-11 స్థానములయందు పాపులుండగాను



అష్టమశుద్ధితోగూడిన లగ్నమందును చూడాకర్మనాచరించవలెను. జన్మరాశియందును జన్మరాశికష్టమరాశియందును చూడాకర్మ జేయగూడదు. 1-4-7-10 స్థానములయందు క్షీణచంద్రుడుండిన మరణమును అంగారకుడుండిన శస్త్రఘాతమును శనియుండిన పంగుత్వమును సూర్యుడుండిన జ్వరమును గలుగును మిగిలిన బుధగురుశుక్ర పూర్ణచంద్రు లుండిన శుభము గలుగును. చూడాకర్మకు తారాబలము బాగుగానుండవలెను.

శ్లో॥ పంచమాసాధికేమాతుః గర్భేచౌలంశిశోర్నహి। పంచవర్షాధికస్యేష్టం గర్భిణ్యామపిమాతరి॥

తా॥ చౌలము తల్లి, పంచమాసాధిక గర్భవతియగుచుండగా నాచరించజనదు. శిశువు ౫ సంవత్సరములకు మించిన వయస్సుగలవాడాయెనేని తల్లి గర్భిణితోనున్నను చేయవచ్చును.

దుష్టతారాపవాదము.

శ్లో॥ తారాదౌష్ట్యేబ్జేత్రికోణోచ్చగేవా క్షౌరంసత్స్యాత్సౌమ్యమిత్రస్వవర్గే । సౌమ్యేభేబ్జేశోభనేదుష్టతారాః శస్తాజ్ఞేయాక్షౌరయాత్రాదికృత్యే॥

తా॥ చంద్రుడు ౫, ౯ స్థానములయందుగాని ఉచ్చయందుగాని యుండగానున్నూ, శుభగ్రహములయొక్క షడ్వర్గమందును గోచారమునుబట్టి చంద్రబలము బాగుండగాను, క్షౌర, యాత్రాదికృత్యములయందు దుష్టతారలున్నూ మంచివిగానెంచబడును

చౌలాది నిషిద్ధకాలము.

శ్లో॥ ఋతుమత్యాస్సూతికాయాః సూనోశ్చౌలాదివాచరేత్ । జ్యేష్ఠాపత్యస్యనజ్యేష్ఠే కైశ్చిన్మార్గేపినేష్యతే॥

తా॥ తల్లి రజస్వలగాని, ప్రసవించినగాని, యగుచుండగా శిశువునకుచౌలాదికర్మ నాచరించగూడదు మొదటగా బుట్టిన కన్యాపుత్రులకు జ్యేష్ఠమాసమందుచౌలాదికములఁ జేయగూడదు మార్గశీర్షమందు చేయగూడదని కొందఱి యభిప్రాయము.

క్షౌరము.

శ్లో॥ దంతక్షౌరనఖక్రియాత్ర విహితాచౌలోదితేవారభే। మందాంగారదవీన్విహాయనవమం ఘస్రంచసంధ్యాంతథా । రిక్తాపర్వనిశాం నిరాసనరణ గ్రామప్రయాణోద్యతః। స్నాతాభ్యక్తకృతాశనైర్నహి పునఃకార్యాహితప్రేప్సుభిః॥

తా॥ ౧- 3- ౭ వారములనున్నూ, ౯ తిథిని, సంధ్యాకాలమును, రిక్తతిథులను,

పర్వములను, రాత్రినిన్ని విడచి చాలమునను జెప్పబడిన తిథివారాదులయందు దంత క్షౌర నఖకృత్యమును చేయవలెను. నిరాపన యుద్ధగామాంతర పరియాణాద్యుక్తుడు న్నూ, స్నానముజేసినవాడున్నూ, తలంటుకొనినవాడును, భోజనము జేసినవాడును, క్షౌరమును చేయించుకొనగూడదు.

శ్లో॥ క్రతుపాణిపీడమృతి బంధమోక్షణే క్షురకర్మచద్విజనృపాజ్ఞ యాచరేత్ । శవవాహతీర్థగమసింధు మజ్జనక్షురమాచరేన్నఖలు గర్భిణీపతిః॥

తా॥ యజ్ఞమందును వివాహాంగమైన గోదానవ్రతమందును, మాతాపితృమరణమందును బంధిఖానా విమోచనమందును, బ్రాహ్మణాజ్ఞయందును, రాజాజ్ఞయందును నిషిద్ధదినములయందైనను, క్షౌరము నాచరింపవచ్చును. గర్భిణీపతి శవవహనమును, తీర్థగమనమును, సముద్రస్నానమును క్షౌరమును పరిత్యజించవలెను.

శ్లో॥ నృపాణాంహితంక్షౌర భేశ్మశ్రుకర్మదినేపంచమేపంచమేస్యో దయేవా। షడగ్నిత్రిమైత్రోత్తరాష్టకం వంచపిత్రోర్యబ్దతోబ్ధర్వమాక్షౌర కృన్మృత్యుమేతి॥

తా॥ రాజాదులకు అలంకారార్థమైన శ్మశ్రుకర్మ (గడ్డమును మీసమును గొరిగించుట) క్షౌరమునను జెప్పబడిన తిథ్యాదులయందును చేయవచ్చును అథవానియమముగానైదేసిదినముల కొక్కమాఱు చేయించవచ్చును ।లేక క్షౌరనక్షత్రోదయమందైనా చేయవచ్చును వరుసగా ౬ మారులు కృత్తికయందును, ౩ మారులనూరాధయందును ౯ మారులు రోహిణియందును ౫ మారులు మఘయందును, ౪ మారులు ఉత్తరయందును, క్షౌరము చేయించుకొన్నవాడు సంవత్సరములోపలనే మృతినొందును.

## అక్షర స్వీకారము.

శ్లో॥ గణేశవిష్ణువాగ్రమాః ప్రపూజ్యపంచమాబ్దకే। తిథౌశివార్కదిగ్ద్విషట్శరత్రికేరవావుదక్ । లఘుశ్రవోనిలాంత్యభాదితీశతక్షమిత్రభేచరోనసత్తనౌ శిశోర్లిపిగ్రహఃసతాందినే॥

తా॥ 5 వ సంవత్సరమందు 11-12-10-2-6-5-3- తిథుల యందును, ఉత్తరాయణమందును, క్షిప్ర, శ్రవణ, స్వాతి, రేవతి, పునర్వసు, ఆర్ద్ర, చిత్త, అనూరాధనక్షత్రములయందును, స్థిరద్విస్వభావరాశులయందును, విఘ్నేశ్వర, విష్ణు, సరస్వతీ లక్ష్మీ దేవులను పూజించి శిశువుకు అక్షరారంభములు చేయవలెను.

## విద్యారంభము.

శ్లో॥ మృగాత్కరాచ్ఛ్రుతేస్త్రయేశ్వి మూలపూర్వికాత్రయేగురు



ద్వయేర్కజీవవిచ్ఛితేష్విషట్శరత్రికే । శివార్కదిగ్ద్వికేతిథౌధ్రువాంత్యమిత్రభేపరైః శుభైరధీతిరుత్తమా త్రికోణకేంద్రగైస్మృతా॥

తా॥ మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, హస్త, చిత్త, స్వాతి, శ్రవణ, ధనిష్ఠ, శతభిషక్, అశ్విని, మూల, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, పుష్య, ఆశ్లేష, రేవతి, అనూరాధ, రోహిణీ, ఉత్తరాత్రియ నక్షత్రములయందును రవి, బుధ గురు శుక్రవారములయందును 6- 5- 3- 11- 12 10- 2 తిథులయందును, శుభగ్రహములు కేంద్రత్రికోణముల యందుండగాను విద్యారంభము చేయవలెను.

## ఉపనయనము.

శ్లో॥ విప్రాణాంవ్రతబంధనం నిగదితం గర్భాజ్జనేర్వాష్టమే వర్షేవాప్యథపంచమేక్షితిభుజాం షష్ఠేతథైకాదశే। వైశ్యానాంపునరష్టమేప్యథపునస్యాద్ద్వాదశేవత్సరేకాలేథ ద్విగుణేగతేనిగదితేగౌణంతథాహుర్బుధాః॥

తా॥ గర్భము మొదలుకొనిగాని జన్మ మొదలుకొనిగాని 8 వ సంవత్సరమందు బ్రాహ్మణులకును 11 వ సంవత్సరమందు క్షత్రియులకును, 12 వ సంవత్సరమందు వైశ్యులకును, ఉపనయనము చేయవలెను బ్రహ్మవర్చస్సు మొదలయిన కామ్యములను కోరినప్పుడు బ్రాహ్మణులకు 5, క్షత్రియులకు 6, వైశ్యులకు 8 సంవత్సరముల యందును ఉపనయనము చేయవచ్చును ఉపనయనమునకు బ్రాహ్మణులకు 16 సంవత్సరముల వఱకును, క్షత్రియులకు 22 సంవత్సరముల వఱకును, వైశ్యులకు 24 సంవత్సరముల వఱకును గౌణకాలము అదియు దాటినట్టాయన కాలాతిక్రమణదోషము సంభవించును అనగా వ్రాత్యులగుదురు.

శ్లో॥ క్షిప్రధ్రువాహిచరమూల మృదుత్రిపూర్వారౌద్రేర్కవిద్గురుసితేన్దుదినేవ్రతంసత్ । ద్విత్రీషురుద్రరవిదిక్ప్రమితేతిథౌ హికృష్ణాదిమత్రిలవకేపినచాపరాహ్ణే॥

తా॥ క్షిప్రధ్రువ ఆశ్లేష, చర, మూల, మృదు, పూర్వాత్రియ, ఆర్ద్రానక్షత్రములయందును, రవి, సోమ, బుధ, గురు, శుక్రవారములయందును, 2- 3- 5- 11- 12- 10 తిథులయందును; కృష్ణపక్షములో మొదటిపంచకమందును, ఉపనయనము శుభకరము. అపరాహ్ణమునందుపనయనము జేయగూడదు.

శ్లో॥ కవీజ్యచంద్రలగ్నపారిపౌ మృతౌవ్రతేధమాః । వ్యయేబ్జభార్గవౌతథా తనౌమృతౌసుతేఖలాః॥

తా॥ శుక్ర గురు చంద్రలగ్నాధిపతులు 6- 8- స్థానములయందును చంద్ర

శుక్రులు 12 స్థానమందును పాపగ్రహములు 1. 5. 8. స్థానముల యందుండెనేని అధము లగుదురు.

శ్లో॥ వ్రతబంధేష్టషడ్రిఃఫవర్జితాః శోభనాః శుభాః। త్రిషడాయే ఖలాః కర్కగోస్థః పూర్ణోవిధుస్తనౌ॥

తా॥ ఉపనయనమున లగ్నమున 1.2.3.4.5.7.9. 10. 11 స్థానములయందున్న శుభగ్రహములును, 3. 6. 11 స్థానములనున్న పాపగ్రహములును లగ్నమందును కటక వృషభములయందున్న పూర్ణచంద్రుడును శుభఫలప్రదులు.

## వర్ణేశులు.

శ్లో॥ విప్రాధీశౌ భార్గవేజ్యౌ కుజార్కౌ రాజన్యానామోషధీశో విశాంచ। శూద్రాణాంజ్ఞశ్చాంత్యజానాం శనిస్స్యాచ్ఛాఖేశాస్స్యుర్జీవశుక్రారసౌమ్యాః॥

తా॥ గురు శుక్రులు బ్రాహ్మణులకును, రవి కుజులు క్షత్రియులకును, చంద్రుడు వైశ్యులకును, బుధుడు శూద్రులకును, శని చండాలులకును, అధిపతులు - ఋగ్వేదమునకు బృహస్పతియు, యజుర్వేదమునకు శుక్రుడు, సామవేదమునకు అంగారకుడు, అథర్వణవేదమునకు బుధుడును అధిపతులు.

శ్లో॥ శాఖేశవారతనువీర్యమతీవశస్తం శాఖేశసూర్యశశిజీవబలే వ్రతంసత్। జీవే భృగౌ రిపుగృహే విజితే చనీచే స్యాద్వేదశాస్త్రవిధినారహితోవ్రతేన॥

తా॥ ఉపనయనమందు శాఖేశునియొక్క వార లగ్నబలములు ప్రశస్తములు శాఖేశ, సూర్య, చంద్ర, గురుబలమందు చేయబడిన వ్రతము శ్రేష్ఠము గురు శుక్రులు శత్రుగృహముందుండగాగాని పరాజితులైయుండగాగాని నీచయందుండగాగాని ఉపనయనము చేయబడెనేని నావటువు వేదశాస్త్ర హీనుడవును.

## జన్మర్క్షాద్యపవాదము.

శ్లో॥ జన్మర్క్షమాసలగ్నాదౌ వ్రతే విద్యాధికో వ్రతీ। ఆద్యేగర్భే పివిప్రాణాం క్షత్రాదీనామనాదిమే॥

తా॥ జన్మనక్షత్రమాసలగ్నాది దోషము బ్రాహ్మణులకు ఉపనయనమందు ఆద్యగర్భమందును లేదు క్షత్రియాదులకు ద్వితీయాది గర్భమందులేదు.

## గురుబలము.

శ్లో॥ వటుకన్యాజన్మరాశేస్త్రికోణాయద్విసప్తగః। శ్రేష్ఠోగురుః ఖషట్త్ర్యాద్యే పూజయాన్యత్రనిందితః॥



తా॥ పురుషునకు వ్రతమందును కన్యకు వివాహమందును జన్మరాశికి ౨-౫-౭-౯-౧౧ స్థానములనున్న గురువు మంచివాడు ౧-౩-౬-౧౦ స్థానములనున్న గురువు పూజించిన మంచివాడవును ౪-౮-౧౨ స్థానములనున్న గురువు నెవ్విధముగాను మంచివాడుగాడు.

శ్లో॥ స్వోచ్చే స్వభే స్వమైత్రే వా స్వాంశే వర్గోత్తమే గురుః। రిఃఫాష్టతుర్యగోపీష్టో నీచారిస్థః శుభోప్యసత్॥

తా॥ దోషాపవాద ముచ్చయందును స్వభవనమందును మిత్రగృహమందును స్వాంశయందును వర్గోత్తమాంశయందును యున్న గురువు గోచారీత్యా ౪-౮-౧౨ స్థానములయందున్నను దోషమును జేయడు, చారరీత్యాశుభుడైనను నీచశత్రుస్థానములయందున్న గురువు శుభకరుడుగాడు.

## నిషిద్ధకాలములు.

శ్లో॥ కృష్ణే ప్రదోషే నధ్యాయే శనౌ నిశ్యపరాహ్ణకే। ప్రాక్సంధ్యాగర్జితే నేష్టో వ్రతబంధో గలగ్రహే॥

తా॥ చంద్రక్షైణ్యమందును ప్రదోషమందును అనధ్యాయములయందును రాత్రియందును శనివారమందును అపరాహ్ణమందును సంధ్యాకాలమందును మేఘగర్జనమందును గళగ్రహతిథులయందు ఉపనయనముకూడదు. గళగ్రహాశ్చోక్తా నిర్ణయసింధౌ నారదీయే॥ శ్లో॥ కృష్ణపక్షే చతుర్థీ చ సప్తమ్యాది దినత్రయం। త్రయోదశీ చతుష్కంచ అష్టావేతే గళగ్రహాః॥ ఇతి॥

## సూర్యాద్యంశఫలము.

శ్లో॥ క్రూరో జడో భవేత్పాపః పటుః సత్కర్మకృద్వటుః। యజ్ఞార్థభాక్ తథామూర్ఖో రవ్యాద్యంశే తనౌ క్రమాత్॥

తా॥ ఉపనయన ముహూర్తము సూర్యనవాంశయందైన వటువు క్రూరుడును చంద్రనవాంశయందైన జడుడును కుజనవాంశయందైన పాపియు బుధనవాంశయందైన సమర్థుడును గురునవాంశయందైన సత్కర్మకర్తయు శుక్రనవాంశయందైన యజ్ఞము వలన ధనవంతుడును శనినవాంశయందైన మూర్ఖుడును నగును.

## చంద్రాంశఫలము.

శ్లో॥ విద్యానిరతశ్శుభరాశిలవే పాపాంశగతే హి దరిద్రతరః। చంద్రే స్వలవే బహుదుఃఖయుతః కర్ణాదితిభే ధనవాన్ స్వలవే॥

తా॥ ఉపనయనమందు చంద్రుడు శుభరాశి నవాంశయందుండిన వటువు విద్యానిరతుడును పాపాంశయందుండిన దరిద్రుడును కర్కటాంశయందుండిన దుఃఖియు శ్రవణ పునర్వసులలో స్వాంశయందుండిన ధనవంతుడును నగును.

### కేంద్రస్థ గ్రహఫలము.

శ్లో॥ రాజసేవీ వైశ్యవృత్తిః శాస్త్రి (శస్త్రి) వృత్తిశ్చ పాఠకః॥ ప్రాజ్ఞోర్థవాన్ మ్లేచ్ఛసేవీ కేంద్రే సూర్యాదిఖేచరైః॥

తా॥ ఉపనయన లగ్నమునకు ౧. ౪. ౭. ౧౦ స్థానములయందు సూర్యుడుండిన వటువు రాజసేవకుడును చంద్రుడుండిన వైశ్యవృత్తియు, కుజుడుండిన శాస్త్రి(ఆయుధ) జీవియు బుధుడుండిన ఉపాధ్యాయుడును గురువుండిన పండితుండును శుక్రుడుండిన ధనవంతుడును, శనియుండిన తురుష్కసేవకుడును నగును.

### గ్రహయుతి ఫలము.

శ్లో॥ శుక్రేజీవే తథా చంద్రే సూర్యభౌమార్కిసంయుతే। నిర్గుణః క్రూరచేష్టః స్యాత్ నిర్ఘృణః సద్యుతే వటుః॥

తా॥ శుక్రుడుగాని గురువుగాని చంద్రుడుగాని సూర్యునితో గూడిన వటువు గుణహీనుడును అంగారకునితో గూడిన హింసకుడును శనితో గూడిన దయాహీనుడును శుభగ్రహములతో గూడినని సమర్థుడును నగును.

### చంద్ర యోగములు.

శ్లో॥ విధౌసితాంశగే సితే త్రికోణగే గురౌతనౌ సమస్తవేదవిత్ వ్రతీయమాంశగేతినిర్ఘృణః॥

తా॥ లగ్నమందు గురువుండగా చంద్రుడు శుక్రాంశయందుండగా శుక్రుడు త్రికోణములయందుండెనేని వటువు సమస్త వేదసాగర పారంగతుడవును చంద్రుడు శన్యంశయందుండెనే నిర్దయుడగును.

### అనధ్యాయములు.

శ్లో॥ శుచిశుక్రపౌషతపసాంది గశ్విరుద్రార్కసంఖ్యసితతిథయః॥ భూతాదిత్రితయాష్టమి సంక్రమణంచ వ్రతేష్వనధ్యాయాః॥

తా॥ ఆషాఢశుక్ల దశమీ జ్యేష్ఠ శుక్ల ద్వితీయ పుష్యశుక్లైకాదశీ మాఘశుక్ల ద్వాదశీ చతుర్దశీపూర్ణిమా పాడ్యములును అమావాస్యయు అష్టమియు సూర్యసంక్రమణములును ఉపనయనమునకు అనధ్యాయములు.



### ప్రదోషములు.

శ్లో॥ అర్కతర్కత్రితిథిషు ప్రదోషః స్యాత్తదగ్రిమైః। రాత్ర్యర్ధసార్ధప్రహరయామమధ్యస్థితైః క్రమాత్॥

తా॥ ద్వాదశినాడు రాత్రి రెండుయామములకులోగా త్రయోదశి వ్యాపించినను షష్ఠినాడు రాత్రి ఝామున్నరకులోగా సప్తమివ్యాపించినను తదియనాడు రాత్రి యామాదర్వాక్ చతుర్థీవ్యాపించినను యీ ౧౨. ౬. ౩ తిథులు ప్రదోషములు, ప్రదోషానధ్యాయములయందు ఉపనయనము జేయంజనదు.

### బ్రహ్మౌదన సంస్కారము.

శ్లో॥ ప్రాగ్బ్రహ్మౌదనపాలకాత్ వ్రతబంధానంతరం యదిచేత్। ఉత్పాతానధ్యయనోత్పత్తా వపిశ్శాంతిపూర్వకం తత్స్యాత్॥

తా॥ వ్రత బంధానంతరమును బ్రహ్మౌదనమునకు ముందును ఉత్పాతాదులు గలిగెనేని శాంతిజేసి వ్రతమును పూర్తిజేయవలెను, వ్రతమనగా బ్రహ్మౌదన సంస్కారము.

### వేదోపయోగి నక్షత్రములు.

శ్లో॥ వేదక్రమాచ్ఛశిశివాహి కరత్రిమూలపూర్వాసు పౌష్ణకర మైత్ర మృగాదితీజ్యే। ధ్రువేషుచాశ్వివసుపుష్యకరోత్తరేశ కర్ణే మృగాంత్య లఘుమైత్రధనాదితౌ సత్॥

తా॥ మృగశీర్ష, ఆర్ద్ర, ఆశ్లేష, హస్త, చిత్త, స్వాతి, మూల, పూర్వాత్రయ నక్షత్రములు ఋగ్వేదులకును రేవతి, హస్త, అనూరాధ, మృగశీర్ష, పునర్వసు, పుష్యమి, రోహిణి, ఉత్తరాత్రియములు. యజుర్వేదులకును అశ్వని, ధనిష్ఠ, పుష్య, హస్త, ఉత్తరాత్రయ, ఆర్ద్ర, శ్రవణ నక్షత్రములు సామవేదులకును. మృగశీర్ష, రేవతి, క్షిప్ర అనూరాధ, ధనిష్ఠ, పునర్వసులు, అధర్వణ వేదులకును ఉపనయనమునకు యోగ్యములు.



## వేదోపయోగి నక్షత్రచక్రము.

| ఋగ్వేద | యజుర్వేద | సామవేద | అథర్వవేద |
|---|---|---|---|
| మృ | రే | అశ్వి | మృ |
| ఆ | హ | ధ | రే |
| ఆశ్లే | అనూ | పుష్య | హ |
| హ | మృ | హ | పుష్య |
| చి | పున | ఉ 3 | అశ్వి |
| స్వా | పుష్య | ఆ | అనూ |
| మూ | ఉ 3 | శ్ర | ధని |
| పూ 3 | రో | ౦ | పున |

## మాతృ రజోదర్శనము.

శ్లో॥ నాందీశ్రాద్ధోత్తరంమాతుః పుష్పేలగ్నాంతరేనహి । శాంత్యాచౌలంవ్రతం పాణిగ్రహఃకార్యోన్యథానసత్ ।

తా॥ నాందీశ్రాద్ధానంతరము తల్లి రజస్వలాయైనా చౌలోపనయన వివాహాదులు నాలగ్నమంద శాంతిపూర్వకముగా చేయవలెను.



## ఛురికా బంధనము.

శ్లో॥ విచైత్రవ్రతమాసాదౌ విభౌమాస్తైవిభూమిజే । ఛురికాబంధనంశస్తం నృపాణాంప్రాగ్వివాహతః॥

తా॥ చైత్రమును విడిచి ఉపనయనోక్త మాసాదులయందు అంగారకుని అస్తమయము లేనప్పుడును అంగారకేతర వారములయందు ఉపనయనోత్తరమందు వివాహమునకు పూర్వము రాజులకు ఛురికాబంధనము చేయవలెను. ఛురికాబంధన మనగా కత్తిపట్టుట.

## సమావర్తనము.

శ్లో॥ కేశాంతంషోడశేవర్షే చౌలోక్తదివసేశుభం। వ్రతోక్తదివసాదౌహి సమావర్తనమిష్యతే ।

తా॥ ౧౬ వ సంవత్సరమందు చౌలోక్తతిథ్యాదులయందు కేశాంతకర్మ నాచరించవలెను. ఉపనయనోక్త దివసాదికమందు సమావర్తనమును జేయవలెను.

ఇతి శ్రీదైవజ్ఞసుతరామవిరచితే ముహూర్తచింతామణౌ

సంస్కారప్రకరణం పంచమం సమాప్తం.

---

## (వివాహ ప్రకరణమ్.)

### తత్రవివాహ ప్రయోజనమ్.

శ్లో॥ భార్యాత్రివర్గకరణం శుభశీలయుక్తా శీలంశుభంభవతి లగ్నవశేనతస్యాః । తస్మాద్వివాహసమయః పరిచింత్యతేహితన్నిఘ్నతాముపగతాఃసుతశీలధర్మాః॥

తా॥ శీలవతియు అనుకూలయునైన భార్య ధర్మ అర్థ కామములకు సాధనమగును. వివాహలగ్నమునుబట్టి భార్యకు మంచిశీలమువచ్చును ఆలగ్నము వివాహాధీనముగాన వివాహసమయము విచారించబడుచున్నది. వివాహసమయ లగ్నమునుబట్టి పుత్రులకు శీలమును ధర్మమును గలుగును. పుత్రాదులు భార్యాధీనములుగాన భార్యాపరిగ్రహము ఆవశ్యకము. అపరిగ్రహమునకు శుభలగ్న మావశ్యకము ఆలగ్నము కొఱకు సమయము విచారించబడుచున్నది.

## వివాహ ప్రశ్న ఫలము.

శ్లో॥ ఆదౌసంపూజ్యరత్నాది భిరథగణకం వేధయేత్స్వస్థచిత్తం కన్యోద్వాహందిగీశా నలహయవిశిఖైఃప్రశ్నలగ్నాద్యదీందుః। దృష్టోజీవే నసద్యః పరిణయనకరోగోతులా కర్కటాఖ్యంవాస్యా త్ప్రశ్నస్య లగ్నంశుభఖచరయుతాలోకితం తద్విదధ్యాత్ ॥

తా॥ ముందుగా సమాహిత మనస్కుడైన జ్యోతిష్కుని సువర్ణాదులచే బూజించి కన్యకా వివాహమునుగూర్చి ప్రశ్నించవలెను ఆప్రశ్నలగ్నమునకు ౧౦-౧౧-౩-౭-౫ స్థానముల చంద్రుడుండి గురువుచే చూడబడుచుండెనేని వివాహమును శీఘ్రముగా జరిగించును లేక ప్రశ్నలగ్నము వృషభ కటక తులలలో నొకటై శుభ యుతముగాని శుభదృష్టముగాని యుండినచో వివాహము శీఘ్రముగా జరుగును.

శ్లో॥ విషమభాంశగతౌశశిభార్గవౌతనుగృహంబలినౌ యది పశ్యతః। రచయతో వరలాభమిమౌ యదాయుగ లభాంశగతౌ యువతిప్రదౌ॥

తా॥ చంద్రశుక్రులు బలవంతులై విషమరాశి విషమనవాంశలనుపొంది ప్రశ్నలగ్నమును చూచుచుండిరేని కన్యకు వరలాభము నిత్తురు. యీచంద్రశుక్రులే సమరాశి సమనవాంశలను పొందిరేని వరునకు కన్యాలాభమును నిత్తురు.

శ్లో॥ షష్ఠాష్టస్థఃప్రశ్నలగ్నాద్యదీందుర్లగ్నేకౄరఃసప్తమే వాకుజఃస్యాత్ । మూర్తావిందుఃసప్తమేతస్య భౌమోరండాసాస్యా దష్ట సంవత్సరేణ ॥

తా॥ ప్రశ్నలగ్నమునకు ౬-౮ వ స్థానములయందు చంద్రుడుండినను లగ్నమందు పాపులును సప్తమమందు అంగారకుడును యుండినగాని ౩ వ లగ్నమందు చంద్రుడును చంద్రునకు సప్తమమందు అంగారకుడును యుండినగాని వివాహిత కన్య యెనిమిది సంవత్సరములకు విధవ యగును.

శ్లో॥ ప్రశ్నతనోర్యదిపాపనభోగః పంచమగోరిపుదృష్టశరీరః। నీచగతశ్చతదాఖలుకన్యా స్యాత్కులటాత్వథవామృతవత్సా॥

తా॥ కౄరగ్రహము నీచయందుండి శత్రుదృష్టుడై ప్రశ్నలగ్నమునకు ౫ వ స్థానమందుండెనేని కన్య రంకులాడియగును లేక మృతపుత్రియగును.

శ్లో॥ యదిభవతిసితాతిరిక్తపక్షే తనుగృహతఃసమరాశిగః శశాంకః। అశుభఖచరవీక్షితోరిరంధ్రే భవతివివాహవినాశకారకోయమ్॥



తా॥ కృష్ణపక్షమందు ప్రశ్నలగ్నమునకు సమరాశులయందుండి కౄరదృష్టుడై ౬-౮ స్థానముల చంద్రుడుండెనేని వివాహమును నశింపజేయును.

## బాలవైధవ్యయోగ పరిహారము.

శ్లో॥ జన్మోత్థంచవిలోక్య బాలవిధవాయోగం విధాయవ్రతం సావిత్ర్యా ఉతపైప్పలంహిసుత యాదద్యాదిమాంవారహః। సల్లగ్నేచ్యుత మూర్తిపిప్పలఘటైఃకృత్వా వివాహంస్ఫుటందద్యాత్తాం చిర జీవినేత్రనభవేద్దోషః పునర్భూభవః॥

తా॥ కన్యకయొక్క జాతకమునుబట్టి బాలవైధవ్య యోగముండెనేని తండ్రి నాకన్యచేత సావిత్రీవ్రతమునుగాని పిప్పల వ్రతమునుగాని చేయించి రహస్యముగా నాకన్యను మంచిలగ్నమందు విష్ణుప్రతిమ అశ్వత్థ ఘటములకునిచ్చి వివాహముచేసి తిరిగి ప్రస్ఫుటముగా చిరజీవియైన వరునకిచ్చి వివాహము చేయవలయును. ఇట్లు జరుపుట చేత రెండుమార్లు పెండిలిచేసిన దోషములేదు.

ఇందుకు ప్రమాణము మార్కండేయ పురాణమందు॥ శ్లో॥ బాలవైధవ్యయోగేతు కుంభద్రుప్రతిమాదిభిః। కృత్వాలగ్నంరహఃపశ్చాత్ కన్యోద్వాహ్యేతిచాపరే ॥ అత్రపునర్భూదోషాభావ ఉక్తోవిధాన ఖండే ॥ స్వర్ణాంబుపిప్పలానాంచ ప్రతిమావిష్ణురూపిణీ । తయాసహ వివాహేతు పునర్భూత్వంనజాయతే॥ సూర్యారుణసంవాదే॥ వివాహాత్పూర్వకాలేచ చంద్రతారాబలాన్వితే। వివాహోక్తైచతాంకన్యాం కుంభేనసహచోద్వహేత్ ॥ సూత్రేణవేష్టయేత్పశ్చాత్ దశతంతు విధానతః। కుంకుమాలంకృతం దేహం తయోరేకాంతమందిరే। తతః కుంభంచనిస్సార్య ప్రభజ్యసలిలాశయె ॥ తతోభిషేచనంకుర్యాత్పంచ పల్లవవారిభిః ॥ కుంభప్రార్థనాతత్రైవ ॥ వరుణాంగస్వరూపాయ జీవనానాంసమాశ్రయ । పతింజీవయకన్యాయాశ్చిరంపుత్రసుఖంకురు॥ దేహివిష్ణోవరం దేవ కన్యాంపాలయదుఃఖతః।తతోలంకార వస్త్రాభ్యాం వరాయప్రతిపాదయేత్ ॥ ఇతికుంభవివాహః। మూర్తిదానమపితత్రైవోక్తం ॥ బ్రాహ్మణంసాధుమామంత్ర్య సంపూజ్యవివిధార్హణైః॥ తస్మైదద్యాద్విధానేన విష్ణోర్మూర్తించతుర్భుజాం । శుద్ధవర్ణసువర్ణేన విత్తశక్త్యాథవాపునః । నిర్మితాంరుచిరాంశంఖ గదాచక్రాబ్జ

సంయుతాం। దధానాంవాససీప్రీతే కుముదోత్పలమాలినీం। సుదృష్టిణాం చతాందద్యాన్మంత్రమేతముదీరయేత్ । యన్మయాప్రాంచజనుషి ఘ్నంత్యా పతిసమాగమం । విషోపవిషశస్త్రాద్యైః హతోవాతివిరక్తయా ॥ ప్రాప్యమానంమహాఘోరం యశస్సౌఖ్యధనాపహం । వైధవ్యాద్యతిదుఃఖౌఘనాశాయసుఖలబ్ధయె । బహుసౌభాగ్యలబ్ధ్యైచ మహావిష్ణోరిమాంతనూం సౌవర్ణీంనిర్మితాంశక్త్యా తుభ్యంసంప్రదదే ద్విజ ॥ అనఘాద్యాహమస్మీతి త్రివారంప్రజపేదితి ॥ ఏవముక్త్వాతితస్యాశీర్గృహీత్వాస్వగృహం విశేత్ । తతో వైవాహికం కుర్యాద్విధిందాతా మృగీదృశః ॥ ఇత్యాదిస్పష్టార్థములుగనుక తాత్పర్యము వ్రాయలేదు.

## ప్రథమావత్య జ్ఞానము.

శ్లో॥ ప్రశ్నలగ్నక్షణెయాదృశాపత్యయుక్ స్వేచ్ఛయాకామినీ। తత్రచేదావ్రజేత్ కన్యకావాసుతో వాతదాపండితైస్తాదృశాపత్యమస్యా వినిర్దిశ్యతే॥

తా॥ ప్రశ్నకాలమందు జ్యోతిష్కుని వద్దకు కన్య యాదృశసంతానయుక్తయై వచ్చునో కన్యగాని పుత్రుడుగాని తాదృశసంతానము ముందుగాజన్మించునని చెప్పవలె.

## సామాన్య శకునములు.

శ్లో॥ శంఖభేరీవిపంచీరవైర్మంగలం జాయతెవైపరీత్యంతదాలక్షయేత్ । వాయసోవాఖరః శ్వాసృగాలోపివా ప్రశ్నలగ్నక్షణే రౌతి నాదంయది॥

తా॥ వివాహప్రశ్న సమయమందు శంకభేరీ వీణావాద్యములు మ్రోగిన వివాహము మంగళకరమగును లేక కాకి, గాడిద, కుక్క, నక్కలలో నేదియైన కూసిన యెడల నావివాహమునకు వైపరీత్యము కలుగును.

## కన్యా వరణము.

శ్లో॥ విశ్వస్వాతీవైష్ణవపూర్వాత్రయమైత్రైర్వస్వాగ్నేయైర్వా కరపీడోచితఋక్షైః । వస్త్రాలంకారాదిసమేతైః ఫలపుష్పైఃసంతోష్యాదౌ స్యాదనుకన్యావరణంసత్ ।



తా॥ ఉత్తరాషాఢ, స్వాతి, శ్రవణ, పూర్వాత్రయము, అనూరాధ, ధనిష్ఠ, కృత్తికలయందును, లేక వివాహనక్షత్రములయందును, వస్త్రాలంకార ఫలపుష్పములచేత ముందుగా సంతోషపెట్టి తరువాత కన్యావరణమును జేయవలెను.

## వరవరణము.

శ్లో॥ ధరణిదేవోథవాకన్యకాసోదరః శుభదినేగీతవాద్యాదిభిః సంయుతః । వరవృతింవస్త్రయజ్ఞోపవీతాదినా ధ్రువయుతైర్వహ్నిపూర్వాత్రయైరాచరేత్ ।

తా॥ ధ్రువకృత్తిక పూర్వాత్రయ నక్షత్రములయందు పురోహిత బ్రాహ్మణుడుగాని కన్యయొక్క సోదరుడుగాని, వస్త్రయజ్ఞోపవీతాదులతో కూడినవాడై మంగళధ్వనులతోగూడి వరవరణమును చేయవలెను.

## వివాహకాలము.

శ్లో॥ గురుశుద్ధివశేనకన్యకానాం సమవర్షేషుషడబ్దకోపరిష్టాత్ । రవిశుద్ధివశాత్సుభోవరాణాం ఉభయోశ్చంద్రవిశుద్ధితోవివాహః॥

తా॥ కన్యకు ౬ సం॥ పైన సమసంవత్సరములయందు గురుబలముండగానున్న వరునకు సూర్యబలముండగానున్న, ఉభయులకు చంద్రబలముండగానున్న, వివాహము శ్రేయస్కరము.

## వివాహ మాసములు.

శ్లో॥ మిథునకుంభవృషాలిమృగాజగే మిథునగేపిరవౌ త్రిలవే శుచేః । అలిమృగాజగతె కరపీడనమ్ భవతికార్తికపౌషమధుష్వపి॥

తా॥ మిధున, కుంభ, వృషభ, వృశ్చిక, మకర, మేషములయందు సూర్యుడుండగా వివాహము శుభము. మిధునాషాఢమందు శుక్లపాడ్యమి మొదలు దశమిపర్యంతము మాత్రమే శుభకరము. వృశ్చిక కార్తికమందు మకరమాఘమందును, మేష చైత్రమందును వివాహము శుభకరము.

## జన్మర్క్షమాస నిషేధము.

శ్లో॥ ఆద్యగర్భసుతకన్యయోర్ద్వయో ర్జన్మమాసభతిథౌకరగ్రహః । నోచితోథబుధైఃప్రశస్యతే చేద్ద్వితీయజనుషోసుతప్రదః॥

తా॥ ఆద్యగర్భజాత కన్యకా పుత్రులకు జన్మమాస జన్మనక్షత్రములయందు వివాహము జేయగూడదు ద్వితీయాది గర్భజాతులకు జేయవచ్చును.

## త్రిజ్యేష్ఠ విషయము.

శ్లో॥ జ్యేష్ఠద్వంద్వంమధ్యమంసంప్రదిష్టం త్రిజ్యేష్ఠంచేన్నైవయుక్తంకదాపి । కేచిత్సూర్యంవహ్నిగంప్రోహ్య మాహుఃనైవాన్యోన్యం జ్యేష్ఠయోస్స్యాద్వివాహః॥

తా॥ జ్యేష్ఠద్వయము అనగా జ్యేష్ఠాంగనా పుత్రులకు జ్యేష్ఠమాసమందు వివాహము మధ్యమము, జ్యేష్ఠత్రయము అనగా జ్యేష్ఠపుత్రుడుగాని, పుత్రికగాని, జ్యేష్ఠానక్షత్రము, జ్యేష్ఠమాసము, లేక జన్మమాసము జ్యేష్ఠమాసము, జ్యేష్ఠ సంతానము జ్యేష్ఠమాసమందు వివాహము మొదలగునవి యెప్పుడును చేయగూడదు. సూర్యుడు కృత్తికయందుండగా నీత్రిజ్యేష్ఠ ద్విజ్యేష్ఠలు చేయవచ్చును, జ్యేష్ఠపుత్రిజ్యేష్ఠ కన్యలకు వివాహము కూడదు.

## ఏకోదర వివాహము.

శ్లో॥ సుతపరిణయాత్షణ్మాసాంతః సుతాకరపీడనంనచనిజకులేతద్వద్వ్యాముండనాదపిముండనం। నచసహజయోర్దేయేభ్రాత్రోః సహోదరకన్యకేంచ సహజనుతోర్ద్వాహోబ్దార్ధే శుభేనపితృక్రియా॥

తా॥ కుమారుని వివాహానంతరం ౬ మాసములలోగా కుమార్తె వివాహము జేయగూడదు అట్లుగానె తన కులమందు ముండనానంతరము (వివాహానంతరము) ముండనము (చౌలోపనయనాదికము) ౬ మాసముల వరకు జేయగూడదు. వివాహానంతరము ౬ మాసముల వరకు పితృక్రియనాచరించగూడదు సహోదరులైన యిద్దరు కన్యలను సోదరులకు నివ్వగూడదు ఏకోదరులకు ౬ మాసములకు లోగా వివాహము జేయగూడదు.

## ప్రతి కూలము.

శ్లో॥ వధ్వావరస్యాపికులేత్రిపూరుషే । నాశంప్రజేత్కశ్చననిశ్చయోత్తరమ్ । మాసోత్తరంతత్రవివాహఇష్యతే । శాంత్యాథవాసూతకనిర్గమేపరైః॥

తా॥ వివాహ నిశ్చయానంతరము వధూవరుల సపిండులలో నెవ్వడైన మృతిబొందెనేని మాసానంతరము వివాహము జరిపించవలెను, లేక ఆశౌచనివృత్త్యనంతరము శాంతిపూర్వకముగా నాచరింపవచ్చునని కొందఱి యభిప్రాయము.



## వివాహానంతరము చూడాది నిషేధము.

శ్లో॥ చూడావ్రతంచాపివివాహతో వ్రతాచ్చూడాచనేష్టా పురుషత్రయాంతరే । వధూప్రవేశాచ్చసుతావినిర్గమః షణ్మాసతోవాబ్దవిభేదతఃశుభః॥

తా॥ వివాహము మొదలు ఆరుమాసములలోపల చూడాదికర్మ నాచరింపగూడదు అట్లుగానే వధూప్రవేశానంతర మారు మాసముల పర్యంతము కన్యావర్గమము కూడదు సంవత్సరభేదమున్నయెడల నారు మాసములలోగా చేయవచ్చును వీనిలో చెప్పబడిన నిషేధము సపిండులలో త్రిపురుషుల పర్యంతము మాత్రమేను తరువాత వారికి నియమములేదు.

## శ్వశురాది గండనక్షత్రములు.

శ్లో॥ శ్వశ్రూవినాశమహిజౌ సుతరాం విధత్తఃకన్యాసుతౌనిఋతిజౌశ్వశురంహతశ్చ । జ్యేష్ఠాభజాతతనయాస్వ ధవాగ్రజంచశక్రాగ్నిజా స్వవతిదేవరనాశకర్త్రీ॥

తా॥ ఆశ్లేషానక్షత్రమందు బుట్టిన కన్యాపుత్రులు అత్తగారినిన్ని, మూలానక్షత్రజాతులు మామగారినిన్ని నశింపజేయుదురు జ్యేష్ఠనక్షత్రమందు బుట్టిన స్త్రీ తన భర్తయొక్క అన్నగారినిన్ని విశాఖనక్షత్రమందు పుట్టిన కన్య మరిదినిన్ని చంపును. ఈజ్యేష్ఠా విశాఖలలో బుట్టిన పురుషుడున్ను క్రమముగా భార్యా జ్యేష్ఠ కనిష్ఠలను చంపునని కొందరి యభిప్రాయము.

## తదపవాదము.

శ్లో॥ ద్వీశాద్యపాదత్రయజా కన్యాదేవరసౌఖ్యదా । మూలాంత్యపాదసార్పాద్యపాదజౌతౌతయోశ్శుభౌ॥

తా॥ విశాఖ ౧-౨-3 పాదములలో పుట్టిన కన్యాపుత్రులును మూలాంత్యపాదసంభవులును, ఆశ్లేషాప్రథమపాద జాతులును శుభులు.

## అష్ట కూటములు.

శ్లో॥ వర్ణోవశ్యంతథాతారా యోనిశ్చగ్రహమైత్రకం । గణమైత్రంభకూటంచ నాడీచైతేగుణాధికాః॥

తా॥ వర్ణకూటము, వశ్యకూటము, తారాకూటము, యోనికూటము, గ్రహమైత్రము, గణమైత్రము, భకూటమైత్రము, నాడీకూటము, అనునవి యెనిమిది కూటములు.

## వర్ణ కూటము.

శ్లో॥ ద్విజాఝషాళికర్కటాస్తతో నృపావిశో ఘ్రిజాః । వరస్య వర్ణతోధికావ ధూర్నశస్యతేబుధైః॥

తా॥ మీన కటక వృశ్చికములు బ్రాహ్మణులు, మేష సింహ ధనుస్సులు క్షత్రియులు, వృషభకన్యామకరములు వైశ్యులు, మిథునతులాకుంభములు శూద్రులు గాన కన్యావరులిరువురును యేకవర్ణ రాశిజాతులైన ఉత్తమము కన్యకంటె వరుడెక్కువ వర్ణస్థుడైన మధ్యమము, వరునికంటె కన్యయెక్కువ వర్ణజాతయైన యీ వివాహము కూడదు.

## వశ్య వర్గము.

శ్లో॥ హిత్వామృగేంద్రంనరరాశి వశ్యాఃసర్వేతథైషాంజలజాశ్చభక్ష్యాః।సర్వేపిసింహస్యవశేవినాలింజ్ఞేయంనరాణాంవ్యవహారతోన్యత్॥

తా॥ సింహమును విడిచి మిగిలిన సర్వరాశులు నరరాశుల వశవర్తులు జలచరరాశులును మనుష్యులకు భక్ష్యములవుటవలన వీటికి వశ్యములు వృశ్చికమువినాగా సర్వరాశులు సింహమునకు వశ్యములు ఇతరవశ్యావశ్యములు మనుష్య వ్యవహారమును బట్టి తెలుసుకొనవలెను.

## తారా కూటము.

శ్లో॥ కన్యర్క్షాద్వరభంయావత్ కన్యాభంవరభాదపి । గణయేన్నవభిః శేషే త్రిష్వద్రిభమసత్స్మృతం॥

తా॥ కన్యానక్షత్రమునుంచి వరనక్షత్రము వరకును వరనక్షత్రమునుంచి కన్యానక్షత్రము వరకును లెక్కించగా శేషము ౯ మిగిలినేని శుభము, 3- ౭ అశుభములు.

## యోని కూటము.

శ్లో॥ అశ్విన్యంబుపయోర్హయోనిగదితః స్వాత్యర్కయోఃకాసరః। సింహోవస్వజపాద్భయోః సముదితోయామాంత్యయోఃకుంజరః॥ మేషోదేవపురోహితానలభయోః కర్ణాంబునోర్వానరఃస్యాద్వైశ్వాభిజితోస్తథైవ నకులశ్చాంద్రాబ్జయోన్యోరహిః ॥ జ్యేష్ఠామైత్రభయోః కురంగఉదితో మూలార్ద్రయోఃశ్వాతథా। మార్జారోదితిసార్పయోః రథమఘాయోన్యోస్తథైవోందురుః। వ్యాఘ్రోద్విశభ



చిత్రయోరపిచ గౌరర్యమబుధ్న్యర్క్షయో ర్యోనిఃపాదగయోః వరస్వరమహా వైరంభయోన్యోస్త్యజేత్॥

తా॥ అశ్విని శతభిషములకు అశ్వయోని, స్వాతిహస్తలకు యెనుబోతు, ధనిష్ఠ పూర్వాభాద్రలకు సింహము, భరణి రేవతులకు కుంజరము, కృత్తికా పుష్యలకు మేకలు, పూర్వాషాఢా శ్రవణములకు వానరము, ఉత్తరాషాఢా అభిజిత్తులకు నకుల, (ముంగిస) రోహిణీ మృగశీర్షలకు సర్ప, జ్యేష్టానురాధలకు లేడి, మూలఆర్ద్రలకు కుక్క, ఆశ్లేషా పునర్వసులకు పిల్లి, మఖ పుబ్బలకు ఎలుక, చిత్రావిశాఖలకు పెద్దపులి, ఉత్తరా ఉత్తరాభాద్రలకు గోవు, గాన వధూవరులకు ఏకయోని ఉత్తమము మిత్రయోని మధ్యమము, సమయోని సమము, వైరయోని అశుభకరము, వైరయోనులు గోవ్యాఘ్ర, గజసింహ, కురంగ శునక, నకుల సర్ప, మేషవానర అశ్వమహిష ఆఖుమార్జారములు ఇట్లె మిత్రత్వాదులు చూడవలెను.

## గ్రహ మైత్రములు.

శ్లో॥ మిత్రాణిద్యుమణేఃకుజేజ్య శశినఃశుక్రార్కజౌవైరిణౌ సౌమ్యశ్చాస్యసమో విధోర్బుధరవీమిత్రేనచాస్యద్విషత్। శేషాశ్చాస్యసమాః కుజస్యసుహృదశ్చంద్రేజ్య సూర్యాబుధః శత్రుఃశుక్రశనీసమౌచ శశభృత్సూనోః సితాహస్కరౌ ॥ మిత్రేచాస్యరిపుఃశశీగురుశనిక్ష్మాజాస్సమాగీష్పతేర్మిత్రాణ్యర్కకుజేందవోబుధసితౌ శత్రూసమః సూర్యజః । మిత్రేసౌమ్యశనీకవేః శశిరవీశత్రూకుజేజ్యౌసమౌ మిత్రేశుక్రబుధౌశనేః శశిరవిక్ష్మాజాః ద్విషోన్యఃసమః॥

తా॥ యీగ్రహమైత్ర శత్రుసమత్వములు సులభముగా దెలియుటకై నీక్రింద చక్రమును వ్రాయుచున్నాను గాన యీశ్లోకములకు తాత్పర్యము వ్రాయుట యనవసరమని విరమించినాను.

## గ్రహమైత్ర చక్రము.

| గ్రహములు | రవికి | చంద్రునకు | కుజునకు | బుధునకు | గురునకు | శుక్రునకు | శనికి |
|---|---|---|---|---|---|---|---|
| మిత్రులు | చం మం గు | ర-బు | గు-చం-ర | ర-శు | ర-చం మం | బు-శ | బు-శు |
| శత్రులు | శ-శు | ౦ | బు | చం | బు-శ | ర-చం | ర-చం మం |
| సములు | బు | మం-గు శు-శ | శు-శ | మం-గు శ | శ | మం-గు | గు |

వధూవరులకు జన్మరాశ్యధిపతులు మిత్రులుగాని లేక ఒక్కరేగానిరైన శుభము లేక సములైన సమఫలము, శత్రువులైనచో దంపతులకు విరోధము నెడతెగక యుండు.

### గణమైత్రము.

శ్లో॥ రక్షోనరామరగణాః క్రమతో మఘాహివస్వింద్ర మూలవరుణానలతక్షరాధాః॥ పూర్వోత్తరాత్రయవిధాత్ర యమేశభాని మైత్రాదితీందు హరిపౌష్ణమరుల్లఘూని॥

తా॥ మఘ, ఆశ్లేష, ధనిష్ఠ, జ్యేష్ఠ, మూల, శతభిషక్, కృత్తిక, చిత్త, విశాఖ యీ ౯ నక్షత్రములు రాక్షసగణము, పూర్వాత్రయ, ఉత్తరాత్రయ, రోహిణి, భరణి, ఆరుద్ర యీ ౯ నక్షత్రములు మనుష్యగణము, అనూరాధ, పునర్వసు, మృగశీర్ష, శ్రవణ, రేవతి, స్వాతి, అశ్విని, హస్త, పుష్యమి, యీ ౯ నక్షత్రములు దేవగణము.

శ్లో॥ నిజనిజగణమధ్యే ప్రీతిరత్యుత్తమాస్యాద మరమనుజయోస్సామధ్యమాసంప్రదిష్టా। అసురమనుజయోశ్చే న్మృత్యు రేవప్రదిష్టో దనుజవిబుధయోస్స్యా ద్వైరమేకాంతతోత్ర॥

తా॥ వధూవరనక్షత్రములు ఏకగణములో చేరిన దంపతులకు మిక్కిలి ప్రీతి యుండును దేవమనుష్యగణములైన మధ్యమము, మనుష్యరాక్షస గణములైన మృత్యుప్రదము, దేవరాక్షస గణములైన నియతముగా వైరముండును.



### రాశిమైత్రము.

శ్లో॥ విషమాత్కన్యకారాశేః షష్ఠంషష్ఠాష్టకంససత్ । సమాత్ షష్ఠంశుభంజ్ఞేయం విపరీతంతదష్టమమ్ ॥ మృత్యుః షట్కాష్టకేజ్ఞేయో ఽపత్యహానిర్నవాత్మజే । ద్విర్ద్వాదశేనిర్ధనత్వం ద్వయోరన్యత్ర సౌఖ్యకృత్ ॥

తా॥ బేసిసంఖ్యగల కన్యకారాశి మొదలు వరునిరాశి ఆరవదియైన సమరాశియైన నావరునిరాశికి కన్యారాశి యెనిమిదవదగును. అనగా కన్యారాశి 3 మిధునము దీనికి ౬ వది వృశ్చికము వరరాశి ౮ వృశ్చికమునకు కన్యారాశియైన మిధునము యెనిమిదవదగును యీవిషమ షష్ఠాష్టకము శత్రుషష్ఠాకమనబడును సమరాశియైన స్త్రీరాశికి వరునిరాశి ఆరవదియైన విషమమైన వరునిరాశికి స్త్రీరాశి యెనిమిదవదగును. అనగా స్త్రీరాశి ౨ వృషభము పురుషరాశి దీనికి ౬ తుల ౭ విషమరాశియైన తులకు స్త్రీరాశి యెనిమిదవదగును యిది సమషష్ఠాష్టకమనబడును యిదిమిత్రషష్ఠాష్టకము యిందులో మిత్రషష్ఠాష్టకము శుభప్రదము శత్రుషష్ఠాష్టకము మృత్యుప్రదము స్త్రీపురుషుల రాశులు ఒకదానికొకటి ౯-౫ అయిన పుత్రనాశము, ౨-౧౨ అయిన దరిద్రము మిగిలిన రాశియోగములు శుభప్రదములు.

### తదపవాదము.

శ్లో॥ ప్రోక్తేదుష్టభకూటకే పరిణయస్త్వేకాధిపత్యే శుభోఽథో రాశీశ్వరసౌహృదేపిగదితో నాడ్యృక్షశుద్ధిర్యది । అన్యర్క్షేంశపయోర్బలిత్వసఖితేనాడ్యృక్షశుద్ధౌతథా తారాశుద్ధివశేనరాశివశతాభావే నిరుక్తోబుధైః॥

తా॥ పైన చెప్పబడిన దుష్టరాశికూటముకు పరిహారమును చెప్పుచున్నాడు వధూవరులరాశ్యధిపతి ఒక్కడేయైనను స్త్రీపురుషరాశీశులు పరస్పరము మిత్రులైనను నాడీశుద్ధియుండగాను నక్షత్రశుద్ధియుండగాను తారాశుద్ధిరాశివశ్యతలు యుండగానున్న, వధూవరరాశ్యంశపతులకు పరస్పరము మైత్రియుండగానున్న పైనచెప్పిన దుష్టయోగములు అశుభకరంబులుగావు.

శ్లో॥ మైత్ర్యాంరాశిస్వామినో రంశనాథద్వంద్వస్యాపిస్యాద్గణానాంనదోషః । ఖేటారిత్వంనాశయే త్సద్భకూటంఖేటప్రీతిశ్చాపిదుష్టంభకూటం ।

తా॥ వధూవరుల రాశ్యధిపతులకుగాని అంశాధిపతులకుగాని పరస్పరము మైత్రి యున్నయెడల పైనచెప్పిన దుష్టకూట దుష్టగణములవలన గలిగెబాధలను నివారించును గాన కూటదుష్టత్వమును స్వామిమైత్రి నశింపజేయును స్వామివైరముండిన శుభకూటములు ఫలమివ్వజాలవు గాన కూటవిచారముకంటె రాశిస్వామివిచారము అవశ్యకము.

## నాడీకూటము.

శ్లో॥ జ్యేష్ఠారౌద్రార్యమాంభఃపతిభయుగయుగంధాస్రిభం త్వేక నాడీపుష్యేందుత్వాష్ట్రమిత్రాంతక వసుజలభంయోనిబుధ్న్యేచమ ధ్యా। వాయ్వగ్నివ్యాళవిశ్వోడు యుగమథో పౌష్ణంభం చాపరాస్యా ద్దంపత్యోరేకనాడ్యాం పరిణయనమ సన్మధ్యనాడ్యాంహిమృత్యుః॥

తా॥ జ్యేష్ఠమూలలు, ఆర్ద్రపునర్వసులు, ఉత్తర హస్తలు, శతభిషక్ పూర్వాభాద్రలు, అశ్విని ఇవి ఆద్యనాడియనబడును. పుష్య, మృగశీర్ష, చిత్త, అనూరాధ, భరణి, ధనిష్ఠ, పూర్వాషాఢ, పుబ్బ, ఉత్తరాభాద్ర, ఇవి మధ్యనాడులు. స్వాతి, విశాఖ, కృత్తికా, రోహిణి, ఆశ్లేష, మఖ, ఉత్తరాషాఢ శ్రవణ, రేవతి ఇవి అంత్యనాడులు, దంపతులకు ఆద్యనాడియందు వివాహము అశుభకరము మధ్యనాడియందు మరణము నిశ్చయముగా గలుగును.

## వర్గకూటము.

శ్లో॥ అకచటతపయశవర్గాః ఖగేశమార్జారసింహశునామ్।
సర్పాఖుమృగావీనాం నిజపంచవైరిణామష్టౌ॥

తా॥ అ, క, చ, ట, త, ప, య, శ, అనునివి యెనిమిది వర్గలు వీటికి క్రమముగా గరుడ, మార్జాల, సింహ, శునక, సర్ప, మూషక, కురంగ, మేషములు అధిపతులు యిందులో ప్రతిదానికి అయిదవది శత్రువుగాన దంపతుల నక్షత్రము యే వర్గములో చేరునో దానికి రెండవనక్షత్రము యేన్నోవగలోదో విచారించి శత్రుత్వములేని నక్షత్రములుగల వారికి వివాహము శుభముగాన యోచించి చేయవలెను దంపతుల నామాద్యక్షరమును బట్టిన్ని వర్గవివేచన జేయవలెను.

## రాశ్యైక్యమందు విశేషము.

శ్లో॥ రాశ్యైక్యేచేద్భిన్నమృక్షం ద్వయోస్స్యా న్నక్షత్రైక్యే రాశియుగ్మంతథైవ। నాడీదోషో నో గణానాంచ దోషో నక్షత్రైక్యే పాదభేదే శుభంస్యాత్॥



తా॥ దంపతులకు రాశ్యైక్యముండి నక్షత్రభేదముండినగాని, నక్షత్రైక్యముండి రాశిభేదముండినగాని నక్షత్రైక్యముండి పాదభేదముండినగాని ఆదంపతులకు నాడీదోషము గణదోషములు లేవు. శుభమే గలుగును.

## రాశ్యధిపతులు.

శ్లో॥ కుజశుక్రసౌమ్యశశిసూర్య చంద్రజాఃకవిభౌమజీవశని సౌర యోగురుః। ఇహరాశిపాః క్రియమృగాస్యతౌ లికేందుభతో నవాంశ విధిరుచ్యతేబుధైః॥

తా॥ మేషవృశ్చికములకు అంగారకుడు, తులావృషభములకు శుక్రుడు, కన్యామిథునములకు బుధుడు, కటకమునకు చంద్రుడు, సింహమునకు సూర్యుడు, ధనుర్మీనములకు గురువు, మకరకుంభములకు శనియును, అధిపతులు. నవాంశలు రాశిని 30 చే హెచ్చించి ౯ చే భాగించిన నవాంశలగును. అందు మేష, సింహ, ధనుస్సులకు మేషాంశ మొదలు, కటక, వృశ్చిక, మీనములకు కటకాంశ మొదలు, తులా, కుంభ, మిథునములకు తులాంశ మొదలు, మకర, వృషభ, కన్యలకు మకరాంశ మొదలు, రాశ్యధిపతులే ఇచ్చట నవాంశాధిపతులని తా॥

## హోరా.

శ్లో॥ సమగృహమధ్యే శశిరవిహోరా విషమభమధ్యే రవిశశినోస్స॥

తా॥ వృషభాది సమరాశులయందు క్రమముగా చంద్రసూర్యులయొక్కయు మేషాదివిషమ రాశులయందు రవిచంద్రులయొక్కయు, హోరలగును. లగ్నమును రెండుగా భాగించవలెను.

## త్రింశాంశలు.

శ్లో॥ శుక్రజ్ఞజీవశనిభూతనయస్య బాణశైలాష్టపంచవిశిఖాః సమరాశిమధ్యే। త్రింశాంశకో విషమభే విపరీతమస్మాద్ద్రేక్కాణకాః ప్రథమపంచనవాధిపానామ్॥

తా॥ లగ్నమును 30 భాగములు చేసిన త్రింశాంశలగును. అందు సమరాశులయందు క్రమముగా శుక్రుడు ౫ భాగములకును బుధుడు ౭ భాగములకును గురువు ౮ భాగములకును, శని ౫ భాగములకును, అంగారకుడు ౫ భాగములకును, అధిపతులు. విషమ రాశులయందు అంగారకుడు ౫ భాగములకును, శని ౫ భాగములకును, గురువు ౮ భాగములకును, బుధుడు ౭ భాగములకును శుక్రుడు ౫ భాగములకును అధిపతులు.

కించ॥ లగ్నమును 3 భాగములు చేసిన ద్రేక్కాణములగును. అందు ౧ వ

ద్రేక్కాణము లగ్నాధిపతియు ౨ వ ద్రేక్కాణము పంచమాధిపతియు, ౩ వ ద్రేక్కాణము నవమాధిపతియు స్వాములు.

## ద్వాదశాంశలు.

శ్లో॥ స్యాద్ద్వాదశాంశ ఇహ రాశిత ఏవ గేహం హోరాథ ద్రుక్కాణనవమాంశకసూర్యభాగాః । త్రింశాంశకశ్చ షడిమే కథితాస్తు వర్గాః సౌమ్యైః శుభం భవతి వా శుభమేవ పాపైః॥

తా॥ లగ్నమును ౧౨ భాగములు చేసిన ద్వాదశాంశలగును. అందు లగ్నాది ద్వాదశాంశలు చూచేడ రాశ్యధిపతులే అంశాధిపతులు, ౧ లగ్నము, ౨ హోర, ౩ ద్రేక్కాణము, ౪ నవాంశ, ౫ ద్వాదశాంశ, ౬ త్రింశాంశ యీ ౬ షడ్వర్గములు శుభాధిపతులైతే శుభములు పాపాధిపతులైతే అశుభకరములు.

## గండాంతములు.

శ్లో॥ జ్యేష్ఠాపౌష్ణభసార్పభాంత్యఘటికాయుగ్మం చ మూలాశ్వినీపిత్ర్యాదౌ ఘటికాద్వయం నిగదితం తద్భస్య గండాంతకమ్ ॥ కర్కాల్యండజభాంతతోర్ధఘటికా సింహాశ్వమేషాదిగా । పూర్ణాంతే ఘటికాత్మకం త్వశుభదం నందాతిథేశ్చాదిమమ్॥

తా॥ ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతులకు చివర ౨ ఘడియలును, మఖ, మూల, అశ్వినీ నక్షత్రములకాదిని ౨ ఘడియలును, నక్షత్రగండాంత సంజ్ఞలు, కర్కాట, మీన, వృశ్చిక రాశులయొక్క చివరను అరఘడియయును, సింహ ధనుర్మేషములయొక్క ఆదిని అరఘడియయును లగ్నగండాంతరములు ౫, ౧౦, ౧౫ తిథులయొక్క చివరను ఒక ఘడియయును, ౧, ౬, ౧౧ తిథులయొక్క ఆదిని ఒకగడియయున్ను, తిథిగండాంతములు ఇవన్నియు శుభకర్మలయందు విసర్జనీయములు.

## కర్తరీదోషము.

శ్లో॥ లగ్నాత్పాపావృజ్వనృజూ వ్యయార్థస్థౌ యదా తదా । కర్తరీ నామ సా జ్ఞేయా మృత్యుదారిద్ర్యశోకదా॥

తా॥ లగ్నమునకు ద్వాదశమందు పాపగ్రహము ఋజుగతితో నుండగా ద్వితీయమందున్న పాపగ్రహము వక్రించెనేని యది కర్తరీదోషమనబడును. ఈ కర్తరి దారిద్ర్యమరణ శోకముల నిచ్చును.

## చంద్రసగ్రహము.

శ్లో॥ చంద్రే సూర్యాదిసంయుక్తే దారిద్ర్యం మరణం శుభం । సౌఖ్యం సాపత్న్యవైరాగ్యే పాపద్వయయుతే మృతిః॥



తా॥ చంద్రుడు సూర్యునితోగూడి నట్లాయెన దారిద్ర్యమును, అంగారకునితో గూడినయడల మరణమును, బుధునితోగూడిన శుభమును, గురునితోగూడిన సౌఖ్యమును, శుక్రునితోగూడిన సపత్నిని, శనితోగూడిన వైరాగ్యమును, రాహుకేతువులతోగూడిన మరణమును చేయును.

## అష్టమలగ్నదోషము.

శ్లో॥ జన్మభయోర్మృత్యురాశౌ నేష్టః కరగ్రహః । ఏకాధిపత్యే రాశీశే మైత్రే వా నైవ దోషకృత్॥

తా॥ జన్మలగ్నమునకుగాని జన్మరాశికిగాని ఎనిమిదింట వివాహము చేయగూడదు ఆజన్మలగ్నాష్టమ లగ్నాధిపతులకు మైత్రియున్నయడల జేయవచ్చును.

శ్లో॥ మీనోక్షకర్కాలిమృగస్త్రియోష్టమం లగ్నం యదా నాష్టమగేహదోషకృత్ । అన్యోన్యమిత్రత్వవశేన సా వధూర్భవేత్సుతాయుర్గృహసౌఖ్యభాగినీ॥

తా॥ మీన, వృషభ, కర్కాటక, వృశ్చిక, మకర, కన్యారాశులలో నొకటి యష్టమలగ్నమైన యెడల నాదోషములేదు. మరిన్ని ఆజన్మాష్టమరాశికులకు మైత్రియున్నయెడల వధువు సుతాయుర్గృహసౌఖ్యమును పొందునదియగును.

శ్లో॥ మృతిభవనాంశో యదిచ విలగ్నే తదధిపతిర్వా న శుభకరస్స్యాత్ । వ్యయభవనం వా భవతి తదంశః తదధిపతిర్వా కలహకరస్స్యాత్॥

తా॥ లగ్నమందు అష్టమరాశి నవాంశగాని, అష్టమాధిపతిగాని యున్నయడల అశుభకరము ఆలగ్నము ద్వాదశరాశిగాని తదంశగాని, లేక ద్వాదశాధిపతి లగ్నమందుండగాగాని కలహప్రదము.

## నక్షత్రవిషనాడులు.

శ్లో॥ ఖరామతోంత్యాదితివహ్నిపిత్ర్యభే ఖవేదతః కేరదతశ్చ సార్పభే । ఖబాణతో శ్వేధృతితోర్యమాంబుపే కృతేర్ధగత్వాష్ట్రభవిశ్వజీవభే । మనోర్ద్వయే వాసవసౌమ్యశాక్రభే కువక్షతః శైవకరోష్టజభే । యుగాశ్వితో బుధ్న్యభతో యయామ్యభే ఖచంద్రతో మిత్రభవాసవఖ్రైతే । మూలేంగబాణాద్విషనాడికాః కృతావర్జ్యాః శుభే ధ్రువాః । నిఘ్నా భభోగేన ఖతర్కభాజితాః స్పష్టా భవేయుర్విషనాడికాస్తథా॥

తా॥ రేవతి, పునర్వసు, కృత్తిక, మఖలయందు 30 ఘటికలకును, రోహిణి యందు 40 కి ఆశ్లేషకు 32 కి అశ్వినికి 50 కి ఉత్తర శతభిషక్కులకు 18 కి పుబ్బ, చిత్త ఉత్తరాషాఢ పుష్యలకు 20 కి, విశాఖ, స్వాతి, మృగశీర్ష, జ్యేష్ఠలకు 14 కి, ఆర్ద్ర హస్తలకు 21 కి, పూర్వాభాద్రకు 16 కి, ఉత్తరాభాద్ర పూర్వాషాఢ భరణీ నక్షత్రములకు 24 కి, అనూరాధ ధనిష్ఠ శ్రవణలకు 10 కి, మూలకు 56 కిని, విషఘటికలు వచ్చును. యీవిషనాడికలు శుభములయందు విడువదగినవి యీవిష ఘటికలు యెప్పుడు వచ్చునో తెలుసుకొనుట యెట్లంటె ఆయాదినమందున్న నక్షత్రాద్యంత ఘటికా విఘటికలచేత పైన చెప్పిన ఘటికలను హెచ్చించి 60 చే భాగించిన విషఘటికా గమనము తెలుసును. (యథా) రేవతీ ఆద్యంతము 56 దానిధ్రువకము 30 = 56-1680 అగును దీనిని 60 చే భాగించిన 60) 1680(28 ఘటికలు వచ్చును గాన రేవతియందు 28 ఘటికలకు విషఘటికలు వచ్చును లేక రేవతి ఆద్యంతము 60 ధ్రువకము 30= 60- 1800 దీనిని 60 చే భాగించగా 30 వచ్చును అప్పుడు 30 ఘటికలచే వచ్చును ఇట్లె అన్నిటికిని ఊహించవలెను.

## విషఘటీచక్రము.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| అ | భ | కృ | రో | మృ | ఆర్ | పున | పు | ఆ |
| 50 | 24 | 30 | 40 | 14 | 21 | 30 | 20 | 32 |
| మ | పు | ఉ | హ | చి | స్వా | వి | అ | జ్యే |
| 30 | 20 | 18 | 21 | 20 | 14 | 14 | 10 | 14 |
| మూ | పూ | ఉ | శ్ర | ధ | శ | పూ | ఉ | రే |
| 56 | 24 | 20 | 10 | 10 | 18 | 16 | 24 | 30 |

## పగటి ముహూర్తములు.

శ్లో॥ గిరిశభుజగమిత్రాః పిత్ర్యవస్వంబువిశ్వేభి జిదథచవిధాతాం పీంద్ర ఇంద్రాగ్నిసలౌచ । నిఋృతిరుదకనాథోప్య ర్యమాథోభగస్స్యుః క్రమశఇహముహూర్తా వాసరేబాణచంద్రాః॥



తా॥ పగలు ౧౫ ముహూర్తములు అందుక్రమముగా ౧ కి శివుడు, ౨ కి సర్పము ౩ కి రవి, ౪ కి పితరులు, ౫ కు వసువులు, ౬ కు జలము, ౭ కి విశ్వేదేవులు, ౮ కి అభిజిత్, ౯ కి బ్రహ్మ, ౧౦ కి ఇంద్రుడు, ౧౧ కి ఇంద్రాగ్నులు, ౧౨ కి నిఋృతి, ౧౩ కి వరుణుడు, ౧౪ కి అర్యముడు, ౧౫ కి భగుడును, అధిపతులు. అనగా ఈముహూర్తములకు యీనామములు గలవు.

## రాత్రి ముహూర్తములు.

శ్లో॥ శివోజపాదాదష్టౌ స్యుర్భేశాఅదితిజీవకౌ । విష్ణ్వర్కత్వాష్ట్రమరుతో ముహూర్తానిశికీర్తితాః॥

తా॥ రాత్రి ముహూర్తములు ౧ శివుడు, ౨ అజపాత్, ౩ అహిర్బుధ్న్య, ౪ పూష, ౫ విశ్వ, ౬ యమ, ౭ అగ్ని, ౮ బ్రహ్మ, ౯ చంద్ర, ౧౦ అదితి, ౧౧ బృహస్పతి, ౧౨ విష్ణు, ౧౩ సూర్య, ౧౪ త్వాష్ట్రి, ౧౫ వాయువులు అని రాత్రి ముహూర్తములకు పేర్లు.

## వార దుర్ముహూర్తములు.

శ్లో॥ రవావర్యమాబ్రహ్మ రక్షశ్చసోమేకుజేవహ్నిపిత్ర్యేబుధేచాభిజిత్స్యాత్ । గురౌతోయరక్షోభృగౌ బ్రాహ్మపిత్ర్యేశనావీశసార్పౌ ముహూర్తానిషిద్ధాః॥

తా॥ ఆదివారమందు అర్యమ ముహూర్తము సోమవారమందు బ్రహ్మ, రక్షోముహూర్తములు, మంగళవారమందు అగ్ని పితృముహూర్తములు, బుధవారమందు అభిజిత్ ముహూర్తము, గురువారమందు జలరక్షో ముహూర్తములు, శుక్రవారమందు బ్రహ్మ పితృముహూర్తములు, శనివారమందు శివ సర్పముహూర్తములు నింద్యములు.

## వివాహ నక్షత్రములు.

శ్లో॥ నిర్వేధైః శశికరమూల మైత్రపిత్ర్యబ్రాహ్మాంత్యోత్తరపవనైః శుభోవివాహః। రిక్తామారహితతిథౌ శుభేహ్నివైశ్యప్రాంత్యాంఘ్రి శ్రుతితిథిభాగతోభిజిత్స్యాత్॥

తా॥ పాపగ్రహవేధలేని మృగశీర్ష, హస్త, మూల, అనూరాధ, మఖ, రోహిణీ, రేవతి, ఉత్తరాత్రయ, స్వాతీనక్షత్రములయందును ౪-౯-౧౪-30 గాన మిగిలిన తిథులయందును శుభవారమందు వివాహము చేయవలెను ఉత్తరాషాఢ ౪ వ పాదమును శ్రవణంలో మొదట ౪ ఘటికలును అభిజిన్నామకము.

## పంచశలాకవేధ.

శ్లో॥ వేధోऽన్యోన్యమసౌ విరించ్యభిజితోర్యామ్యానురాధర్క్షయోర్విశ్వేంద్వోర్హరిపిత్ర్యయోర్గ్రహకృతో హస్తోత్తరాభాద్రయోః। స్వాతీవారుణయోర్భవేన్నిఋతిభాదిత్యోస్తథోపాంత్యయోః ఖేటే తత్రగతే తురీయచరణాద్యోర్వా తృతీయద్వయోః॥

తా॥ రోహిణి అభిజిత్తులకును, భరణి అనూరాధలకును, ఉత్తరాషాఢ మృగశీర్షలకును, శ్రవణ మఖలకును, హస్త ఉత్తరాభాద్రలకును, స్వాతీశతభిషక్కులకును మూల పునర్వసులకును ఉత్తరా రేవతులకును పరస్పరము వేధయున్నది గాన శ్రద్ధతో చూచిన స్పష్టమౌను అనగా భరణిలో పాపగ్రహముండెనేని అనూరాధకు పాపవేధ ఇట్లె యూహించునది విశేషము యీవేధలో ప్రథమపాదచతుర్థ పాదములకును ద్వితీయపాద తృతీయపాదములకు పాదవేధలగును యిది పాదవేధయనంబడును సప్తశలాకకును యిట్లె యూహించునది విద్ధేతర నక్షత్రభావమందు అవిద్ధపాదమందు శుభము జేయవచ్చును.

## సప్తశలాకవేధ.

శ్లో॥ శాక్రేజ్యే శతభానిలౌ జలశివే పౌష్ణార్యమర్క్షే వసుద్వీశే వైశ్వసుధాంశుభే హయభగే సార్పానురాధే మిథః। హస్తోపాంతిమభే విధాతృవిధిభే మూలాదితీ త్వాష్ట్రభే జాంఘ్రీయామ్యమఘే కృశానుహరిభే విద్ధకుభృద్రేఖకే ॥

తా॥ జ్యేష్ఠపుష్యములకును స్వాతీశతభిషక్కులకును ఆర్ద్రపూర్వాషాఢలకును, రేవతి ఉత్తరలకును ధనిష్ఠవిశాఖలకును ఉత్తరాషాఢ మృగశీర్షలకును పుబ్బ అశ్వినులకును ఆశ్లేష, అనూరాధలకును హస్త ఉత్తరాభాద్రలకును రోహిణీ అభిజిత్తులకును మూలపునర్వసులకును, చిత్రపూర్వాభాద్రలకును, భరణిమఖలకును, కృత్తికాశ్రవణములకును పరస్పరము సప్తశలాకవేధ యీవేధ వివాహమందు యెంతమాత్రము పనికిరాదు గాన యీవేధలను వివాహమందు ముఖ్యముగా విడువవలెను.

అశ్వినిలోనుండు పాపగ్రహమువలన పూర్వఫల్గుణి అనగా పుబ్బానక్షత్రమునకు వేధకలిగి యుండుననుట.

## వేధాపవాదము.

శ్లో॥ ఋక్షాణి క్రూరవిద్ధాని క్రూరభుక్తాదికానిచ। భుక్త్వాచంద్రేణ ముక్తాని శుభార్హాణి ప్రచక్షతే॥



తా॥ పైన చెప్పిన క్రూరగ్రహవిద్ధనక్షత్రములును క్రూరగ్రహాక్రాంత నక్షత్రములును. చంద్రునిచే భోగించి విడువబడినవైన యెడల శుభములకు యోగ్యములగునని పెద్దలు చెప్పెదరు.

## లత్తాదోషము.

శ్లో॥ జ్ఞరాహుపూర్ణేందుసితాః స్వపృష్ఠే భం సప్తగోజాతిశరైర్మితం హి। సంలత్తయంతేర్కశనీజ్యభౌమాః సూర్యాష్టతర్కాగ్నిమితం పురస్తాత్ ॥

తా॥ లత్తాదోషమును చెప్పువాడై తద్యోగమును చెప్పుచున్నాడు. బుధ రాహు పూర్ణ చంద్ర శుక్రులకు వెనుక క్రమముగా ౭-౯-౨-౫ సంఖ్య నక్షత్రములు లత్తలనబడును. సూర్య, శని, గురు, మంగళులకు ముందు క్రమముగా ౧౨,౮,౬,౩, సంఖ్య నక్షత్రములును లత్తనంబడును గ్రహములు వక్రించెనేని యీచెప్పబడిన క్రమము విపరీతముగా చూడదగినది.

## పాతదోషము.

శ్లో॥ హర్షణవైధృతిసాధ్య వ్యతిపాతకగండశూలయోగానాం అంతేయన్నక్షత్రం పాతేన నిపాతితంతత్స్యాత్॥

తా॥ హర్షణ, వైధృతి, సాధ్య, వ్యతీపాత, గండ, శూలయోగముల చివరనున్న నక్షత్రము పాతితమనంబడును.

## క్రాంతిసామ్యము.

శ్లో॥ పంచాస్యాజౌ గోమృగౌ తౌలికుంభౌ కన్యామీనౌ కర్క్యలీ చాపయుగ్మౌ। తత్రాన్యోన్యం చంద్రభాన్వోర్నిరుక్తం క్రాంతేస్సామ్యం నోశుభం మంగళేతత్॥

తా॥ మేష సింహములయందును వృషభమకరములయందును, తులాకుంభములయందును, కన్యామీనములయందును, కటకవృశ్చికములయందును, ధనుర్మిథునములయందును, సూర్యచంద్రులు ఏక రేఖాగతులైరేని నదిక్రాంతి సామ్యమనంబడును. ఇది శుభావహము.

## దుష్టయోగాపవాదము.

శ్లో॥ వ్యాఘాతగండవ్యతీపాత పూర్వశూలాంత్యవజ్రే పరిఘాతిగండే। యోగేవిరుద్ధే త్వభిజిత్సమేతో దోషః శశీచేద్విషమర్క్షగోర్కాత్॥

తా॥ పూర్వోక్తములైన వ్యాఘాత, గండ, వ్యతీపాత, శూలవైధృతి, వజ్ర, పరిఘ, అతిగండ మొదలైన దుష్టయోగములును అభిజిద్దోషమును, చంద్రుడు సూర్యుడు, విషమసంఖ్య నక్షత్రమందున్నప్పుడె సంభవించునుగాని సమనక్షత్రమందున్న సమయమందు సంభవించవు.

## ఉపగ్రహ దోషము.

శ్లో॥ శరాష్టదిక్ఛక్రనగాతిధృత్య స్తిథిధృతిశ్చ ప్రకృతేశ్చ పంచ।
ఉపగ్రహాః సూర్యభతోఽబ్జతారాః శుభా న దేశే కురుబాహ్లికానామ్॥

తా॥ సూర్యుడున్న నక్షత్రమునకు చంద్రుడున్న నక్షత్రములు 5. 8. 10. 14. 7. 19. 15. 18. 21. 22. 23. 24. 25. సంఖ్యలుగలవైన యెడల ఉపగ్రహములనబడును. కురుదేశమందును, బాహ్లీకదేశమందు యీ ఉపగ్రహములు శుభకార్యములకు అర్హములు కావు.

## పాతోపగ్రహ లత్తాదోషాపవాదము.

శ్లో॥ పాతోపగ్రహలత్తాసు నేష్టోంఘ్రిః ఖేటవత్సమః । వారస్త్రిఘ్నోష్టభి స్తష్టః సైకః స్యాదర్ధయామకః॥

తా॥ పైనచెప్పిన పాత ఉపగ్రహ లత్తలయందు ప్రతియోగి గ్రహపాదమునకు సమానమైన పాదమును విడిచి మిగిలిన పాదములయందు శుభము చేయవచ్చును.

వర్తమాన వారమును 3 చే గుణించి ౮ చే భాగించగా శేషము ౧ అయ్యెనేని అర్ధయామకమనంబడును ఇది శుభావర్హము.

## కులికా యోగము.

శ్లో॥ శక్రార్కదిగ్వసురసాబ్ధ్యశ్వినః కులికా రవేః । రాత్రౌ నిశేశా స్తిథ్యంశాః శనౌ చాంత్యోఽపినిందితాః॥

తా॥ ఆదివారమందు 14 వ దిన్ని సోమవారమందు 12 వ దిన్ని మంగళవారమందు 10 వ దిన్ని బుధవారమందు ౮ వ దిన్ని గురువారమందు 6 వ దిన్ని శుక్రవారమందు 4 వ దిన్ని శనివారమందు 2 వ దిన్ని ముహూర్తములు కులికలనబడును.

దివాక్రమము ఇక రాత్రిక్రమమును జెప్పుచున్నాడు. రాత్రి ఆదివారమందు 13 వ దిన్ని సోమవారమందు 11 వ దిన్ని మంగళవారమందు 9 వ దిన్ని బుధవారమందు 7 వ దిన్ని గురువారమందు 5 వ దిన్ని శుక్రవారమందు 3 వ దిన్ని శనివారమందు 1 వ దిన్ని ముహూర్తములు కులికలు ఇవిశుభకార్యములయందు మిక్కిలి నింద్యములు వివాహమందు స్త్రీకి వైధవ్యకరములుగాన తప్పక విడువవలెను.



## మాస దగ్ధతిథులు.

శ్లో॥ చాపాంత్యగే గోఘటగే పతంగే కర్క్యాజగే స్త్రీమిథునే స్థితే చ।
సింహాలిగే నక్రధటే సమాః స్యుస్తిథ్యో ద్వితీయాప్రముఖాశ్చ దగ్ధాః॥

తా॥ సూర్యుడు 9. 12 రాశులనున్నప్పుడు 2 వ తిథియును, 2. 11 యందున్నప్పుడు 4 వ తిథియును, 4. 1 యందున్నప్పుడు 6 వ తిథియును, 6. 3, యందున్నప్పుడు 8 వ తిథియును, 5, 8 యందున్నప్పుడు 10 వ తిథియును, 10. 7 యందున్నప్పుడు 12 వ తిథియును దగ్ధతిథులనంబడును.

## జామిత్ర దోషము.

శ్లో॥ లగ్నాచ్చంద్రాన్మదనభవనగే ఖేటే న స్యాదిహ పరిణయనం ।
కింవా బాణాశుగమితలవగే జామిత్రం స్యాదశుభకరమిదమ్॥

తా॥ లగ్నమునకుగాని చంద్రునకుగాని ౭ వ స్థానమందు గ్రహమున్నయెడల వివాహము కూడదు. యింతేగాదు ౫౫ అంశను పొందియుండగానున్ను జామిత్రము అశుభకరము ఇది సూక్ష్మజామిత్రదోషము.

## దేశభేదేన పరిహారము.

శ్లో॥ ఉపగ్రహర్క్షం కురుబాహ్లికేషు కలింగవంగేషు చ పాతితం భం
సౌరాష్ట్రశాల్వేషు చ లత్తితం భం త్యజేత్తు విద్ధం కిల సర్వదేశే॥

తా॥ కురుదేశ బాహ్లికదేశములయందు ఉపగ్రహనక్షత్రమును కళింగ వంగదేశములయందు పాతితనక్షత్రమును సౌరాష్ట్ర శాల్యదేశములయందు లత్తితనక్షత్రమును సర్వదేశములయందు విద్ధనక్షత్రమునున్ను విడువవలెను.

## లగ్నబలముచేత పరిహారము.

శ్లో॥ ఏకార్గలోపగ్రహపాతలత్తా జామిత్రకర్తర్యుదయాస్తదోషాః।
నశ్యంతి చంద్రార్కబలోపపన్నే లగ్నే యథార్కాభ్యుదయే తు దోషాః॥

తా॥ సూర్యోదయమందు అంధకారమువలె లగ్నము, రవి, చంద్రబలయుతమైనచో ఏకార్గళ, ఉపగ్రహ, పాత, లత్త, జామిత్ర, కర్తరీ, ఉదయాస్త దోషములు నశించును.

## దశ యోగాః.

శ్లో॥ శశాంకసూర్యర్క్షయుతేర్భశేషే ఖంభూయుగాంగానిదశే

శతిధ్యః। నాగేందవోంకేందుమితానఖాశ్చ భవంతిచైతెదశయోగ సంజ్ఞాః॥

తా॥ చంద్రసూర్యులున్న నక్షత్రసంఖ్యను కలిసి ౨౭ చేత భాగించగా శేషము ౦-౧-౪-౬-౧౦-౧౧-౧౫-౧౮-౧౯-౨౦ అయిన యడల నివిదశయోగములు - అశ్వన్యాది చంద్రస్థిత నక్షత్రసంఖ్యయున్ను, అశ్వన్యాది సూర్యస్థిత నక్షత్రసంఖ్యనున్ను కలిపి ౨౭ చేత భాగహరణము.

శ్లో॥ వాతాభ్రాగ్నిమహీపచోరమరణం రుగ్వజ్రవాదాఃక్షతిఃయోగాంకె డళితెసమెమనుయుతెథాజేతుస్సైకెర్థితె। భందాస్రిదధసంమితాస్తుమనుభీరేఖాఃక్రమాత్సంలిఖేద్వేధోస్మిన్ గ్రహచంద్రయోః నశుభదఃస్యాదేక రేఖాస్థయోః॥

తా॥ పూర్వోక్త దశయోగములకు దోషమును చెప్పుచున్నాడు. 0 కి వాయుదోషము 1 కి మేఘదోషము, 4 కి అగ్నిభయము, 6 కి రాజభీతి, 10 కి చోరభయము, 11 కి మృత్యుభయము, 15 కి రోగము, 18 కి వజ్రపాతము, 19 కి కలహము, 20 కి ధననాశము గలుగును క్రమంగా 1-2-3-4-5-6-7-8-9-10 కిని తెలుసుకొనవలెను. ఈయోగములయందు సమాంకములను 2 చేత భాగించి 14 ను కలిపి అశ్విన్యాది నక్షత్రములు వచ్చును, విషమాంకములకు 1 ని కలిపి ఆమొత్తమును 2 చేత భాగించగా వచ్చిన లబ్ధమువలన అశ్విన్యాది నక్షత్రములు వచ్చును, 14 గీతలుగీసి పూర్వోక్త క్రమమువలన ఏనక్షత్రమువచ్చునో ఆనక్షత్రము మొదలు 28 నక్షత్రములు రేఖాగ్రములయందు వ్రాయవలెను, ఇట్లువ్రాయగా చంద్రుడున్న రేఖయొక్క అపరభాగమందున్న గ్రహముచేత చూడబడుచున్న నక్షత్రమును (నిత్యనక్షత్రమును) వేధకలుగును.

| | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మృ | ఆ | పున | పు | ఆ | మ | పు | ఉ | హ | చి | స్వా | వి | అ | జ్యే |
| రో | కృ | భ | అ | రే | ఉ | పూ | శ | ధ | శ్ర | అ | ఉ | పూ | మూ |



ఉదాహరణం విషమాంకం ౧౧/౧=౧౨, ౨)౧౨(౬ నక్షత్ర ఆర్ద్ర

సమాంకం ౧౦ సగము- ౫

౧౪

—

౧౯ మూల॥

## పంచక రహితము.

శ్లో॥ లగ్నేనాఢ్యాయాతతిథ్యోంకతష్టాః శేషేనాగద్వ్యబ్ధితర్కేందుసంఖ్యే। రోగోవహ్నిరాజచౌరాచమృత్యుర్బాణశ్చాయందాక్షిణాత్యప్రసిద్ధః॥

తా॥ శుక్లప్రతిపదాదిగత తిథిసంఖ్యను లగ్నసంఖ్యను కలిపి ౯ చే భాగించగా శేషము ౧ అయ్యేనేని రోగపంచకము, ౨ అయ్యేనేని వహ్నిపంచకము, ౪ అయ్యేనేని రాజపంచకము, ౬ అయ్యేనేని చోరపంచకము, ౮ అయ్యేనేని మృత్యుపంచకము, యీపంచకము దక్షిణదేశప్రసిద్ధము.

## మతాంతరముచేత పంచకము.

శ్లో॥ రసగుణశశినాగాబ్ధ్యాఢ్య సంక్రాంతియాతాం శకమితిరథతష్టాంకై ర్యదాపంచశేషాః। రుగనలనృపచౌరామృత్యు సంజ్ఞశ్చబాణోనవహృతశరశేషె శేషకైక్యేసశల్యః॥

తా॥ సూర్యసంక్రాంతిలో గతాంశసంఖ్యలో వేరువేరుగా 6, 3, 1, 8, 4, కలిపి 9 చే భాగించిన 5 మిగిలెనేని క్రమముగా రోగపంచకము, అగ్నిపంచకము, రాజపంచకము, చోరపంచకము, మృత్యుపంచకమును, యీగత సంక్రాంత్యంశవిభాగములో అయిదు మిగిలెనేని సశల్యపంచకము, అనగా లోహశల్యయుక్తమని తెలుసుకునేది. మిగిలిన అంకెలు మిగిలితె శల్యరతపంచకములు, ఇందు సశల్యము శుభములయందు నింద్యము శల్యరహితము ప్రశస్తము.

## కాలభేదముచేత పరిహారము.

శ్లో॥ రాత్రౌచోరరుజౌదివానరపతిర్వహ్నిఃసదాసంధ్యయోర్మృత్యుశ్చాథశనౌనృపో విదిమృతిర్భౌమెగ్నిచౌరారవౌ। రోగోధవ్రతగేహగోపనృపసేవా యానపాణిగ్రహె వర్జ్యాశ్చక్రమతోబుధైరుగనలత్మాపాలచౌరామృతిః॥

తా॥ రాత్రియందు చోరరోగపంచకములును దివమందు రాజపంచకమును యెల్లప్పుడు వహ్నిపంచకమును, సంధ్యలయందు మృత్యుపంచకమును, శనివారమందు రాజపంచకమును, బుధవారమందు మృత్యుపంచకమును, మంగళవారమందు అగ్నిపంచకమును, చోరపంచకమును, ఆదివారమందు రోగపంచకమును, ఉపనయనమందు రోగపంచకమును, గృహనిర్మాణాదులయందు అగ్నిపంచకమును, రాజసేవయందు రాజపంచకమును, ప్రయాణమందు చోరపంచకమును, వివాహమందు మృత్యుపంచకమును విడువవలెను ఈ క్షౌరకార్యములయందును ఈ క్షౌరపంచకములును ప్రశస్తములని భావము

## గ్రహదృష్టి నిర్ణయము.

శ్లో॥ త్ర్యాంశంత్రికోణంచతురస్రమస్తం పశ్యంతిఖేటాశ్చరణాభివృద్ధ్యా। మందోగురుర్భూమిసుతఃపరేచక్రమేణసంపూర్ణదృశోభవంతి॥

తా॥ గ్రహములకు తామున్నరాశికి 3-10 స్థానములయందు పాదదృష్టియు 5-9 స్థానములయందు అర్థదృష్టియును 4-8 స్థానములయందు త్రిపాద దృష్టియును, 7 స్థానమందు సంపూర్ణదృష్టియును గలుగును, యిందు శని 3-10 పాదదృష్టియందును బృహస్పతి 5-9 అర్థదృష్టియందును అంగారకుడు 4-8 త్రిపాద దృష్టియందును తక్కిన రవి- సోమ- బుధ- శుక్ర రాహుకేతువులు 7 సంపూర్ణదృష్టియందును సంపూర్ణబలవంతులు, సప్తమస్థానమందు అందరికి సంపూర్ణదృష్టి యున్నదని గ్రంథాంతరాభిప్రాయము.

## ఉదయాస్తశుద్ధి.

శ్లో॥ యదాలగ్నాంశేశోలవ మథతనుంపశ్యతి యుతోభవేద్వా యుంవోఢుః శుభఫలమనల్పంరచయతి। లవద్యూనస్వామీలవమదనభం లగ్నమదనంప్రపశ్యేద్వావధ్వాః శుభమితరథాజ్ఞేయమశుభమ్॥

తా॥ లగ్ననవాంశేశులు లగ్నమునుగాని అంశనుగాని చూచుచున్నను లగ్ననవాంశలయందున్నను వరునకు అధికశుభఫలము నిత్తురు, సప్తమ నవాంశపతి నవాంశకు 7 వ స్థానమునుగాని లగ్నమును 7 వ స్థానమునుగాని చూచుచున్నను తత్రస్థితుడుగాని నైన వధువుకు అధికశుభఫలము నిచ్చును యిందును వ్యతిరేకముగానున్న అశుభకరము అని తెలుసుకొనదగినది అనగా లగ్ననవాంశేశులు లగ్నమునుగాని అంశనుగాని చూచుచున్నవారు కాని వారైన వరునకు అశుభము, సప్తమాంశాధిపతి అంశాత్సప్తమమునుగాని లగ్నాత్సప్తమమునుగాని చూడనియెడల కన్యకు అనిష్టముగలుగును.

శ్లో॥ లవేశోలవంలగ్నపో లగ్నగేహంప్రపశ్యేన్మిథోవా శుభం



స్యాద్వరస్య। లవద్యూనపోంశం ద్యూనంలగ్నపోస్తంమిథో వీక్షతేస్యాచ్ఛుభంకన్యకాయాః॥

తా॥ అంశాధిపతి అంశనున్న లగ్నాధిపతి లగ్నమునున్న చూచుచుండినగాని పరస్పరము చూచుచుండినగాని వరునకు లాభకరము సప్తమాంశాధిపతి సప్తమాంశనున్న, లగ్నాధిపతి సప్తమలగ్నమునున్న, చూచుచుండినగాని కన్యకు శుభము గలుగును, పరస్పర వీక్షణమును శుభకరము ఈప్రకారముగా లగ్నేశుడుగాని అంశేశుడుగాని అగ్నమునుగాని సప్తమమునుగాని చూచుచుండిన శుభకరులు.

శ్లో॥ లవపతిశుభమిత్రంవీక్షతేంశం తనుంవాపరిణయనకరస్య స్యాచ్ఛుభంశాస్త్రదృష్టం। మదనలవపమిత్రంసౌమ్యమంశంద్యూనంవాతనుమదనగృహంచే ద్వీక్షతెశర్మవధ్వాః॥

తా॥ అంశాధిపతియొక్క సౌమ్యమిత్రగ్రహము అంశనుగాని లగ్నమునుగాని చూచుచున్నయెడల వివాహముచేసుకొన్న వరునకు శాస్త్రదృష్టమైన పుత్రపౌత్రాద్యభివృద్ధిఫలంబు గలుగును సప్తమాంశాధిపతియొక్క సౌమ్యమిత్రగ్రహము సప్తమాంశనుగాని (లగ్నాంశను సప్తమాంశనుగాని) లగ్నమును సప్తమస్థానమునుగాని చూచుచున్న యడల వధువుకు సుఖముగలుగును పైన చెప్పిన గ్రహములకు వీక్షణముగాని స్థితిగాని శుభకరంబులు అట్లుగాదేని అశుభకరంబు.

## సంక్రాంతి వర్జ్యకాలము.

శ్లో॥ విషువాయనేషు పరపూర్వ మధ్యమాన్ దివసాంస్త్యజేదితరసంక్రమణేషుచ। ఘటికాస్తుషోడశశుభక్రియావిధౌ పరతోఽపిపూర్వమపిసంత్యజేద్బుధః॥

తా॥ మేష, కర్కాటక, తుల, మకర, సంక్రమణములయందు, అనగా సూర్యుడు ఈరాసులకు వచ్చినప్పుడు సంక్రాంతికి పూర్వదినమును సంక్రాంతిదినమును సంక్రాంతికి ముందు దినము అనగా సంక్రాంతి దినమునకు తరువాత దినమును మూడురోజులు వివాహమునకు యోగ్యములు కావు గాన విడువవలెను మిగిలిన వృషభ మిథున, సింహ, కన్య, వృశ్చిక, ధనుః, కుంభ, మీన, సంక్రాంతులయందు అనగా సూర్యుడు ఈరాసులలో ప్రవేశించినప్పుడు ప్రవేశకాలమునకు పూర్వము 16 ఘటికలును పరము 16 ఘటికలును శుభకార్యములయందు విడువవలెను.

శ్లో॥ దేవద్వ్యంకర్తువోష్టాష్టౌ నాడ్యోంకాఃఖనృపాఃక్రమాత్। వర్జ్యాంసంక్రమణేఽర్కాదేః ప్రాయోర్కస్యాతినిందితాః॥

తా॥ సూర్యసంక్రమణమందు పూర్వాపరములయందు మొత్తము 33 ఘటికలును, చంద్రసంక్రమణమందు 2 ఘటికలును, కుజసంక్రమణమందు 9 ని. బుధ సం॥ 6 ను, గురు సం॥ 88 ని, శుక్ర సం॥ 9 ని. శని సం॥ 160 న్ని ఘటికలను శుభకార్యములయందు విడువవలెను ముఖ్యముగా సూర్యసంక్రాంతి ఘటికలను విడువవలెను.

## అంధాది లగ్నములు.

శ్లో॥ ఘస్రేతులాలీబధిరామృగాశ్వౌ రాత్రౌచసింహాజవృషాది నాంధాః । కన్యానృయుక్కర్కటకానిశాంధా దినేఘటోంత్యోనిశి పంగుసంజ్ఞః॥

తా॥ తుల, వృశ్చికములు దినమందు బధిరములు, మకర ధనుస్సులు రాత్రి బధిరములు, మేష, వృష, సింహములు దివాంధములు, కన్యా, మిధున, కటకములు నిశాంధములు, కుంభము దినమందును, మీనము రాత్రియందును పంగులు.

శ్లో॥ బధిరాధన్వితులాలయోపరాహ్ణే మిధునంకర్కటకోంగనా నిశాంధాః । దివసాంధాహరిగోక్రియాస్తు కుబ్జామృగకుంభాన్విత భాని సంధ్యయోహి॥

తా॥ తులా, వృశ్చిక, ధనుస్సులు అపరాహ్ణమందు బధిరములు, కటక,మిధున కన్యలు రాత్రి అంధములు, మేష, వృషభ, సింహములు పగలు అంధములు, మకర కుంభ మీనములు సంధ్యలయందు కుబ్జములు (మరుగుజ్జులు) యీ అంధాదులకు ఫలము ఈ దిగువను వ్రాయబడుచున్నది.

## అంధాది ఫలములు.

శ్లో॥ దారిద్ర్యంబధిరతనౌ దివాంధలగ్నే వైధవ్యం శిశుమరణం నిశాంధలగ్నే । పఙ్గ్వంగేనిఖిలధనానినాశమీయుః సర్వత్రాధిపగురు దృష్టిభిర్నదోషః॥

తా॥ వివాహము బధిరలగ్నమందైన దారిద్ర్యముగలుగును, దివాంధలగ్నమందు వైధవ్యమును, నిశాంధలగ్నమందు సంతతినాశమును, పంగులగ్నమందు సమస్త ధన నాశమును గలుగును, ఈసమస్తదోషములు లగ్నాధిప గురువులదృష్టిచే నాశమును పొందును యింతేకాదు పఙ్గ్వంధకాణలగ్నాని మాసశూన్యాశ్చరాశయః। గౌడమాలవయోస్త్యాజ్యా అన్యదేశేనగర్హితాః॥ అని చెప్పుటచేత దేశభేదముచేతనున్న ఈ దోషములకు పరిహారమున్నది.



## విహిత నవాంశలు.

శ్లో॥ కార్ముకతౌలికకన్యా యుగ్మలవేఝషగేవా । యర్హిభవే దుపయామస్తర్హి సతీఖలుకన్యా॥

తా॥ ధనుస్సు, తులా, కన్యా, మిధున, మీన, నవాంశలయందు వివాహము జరిగినచో ఆవధువు పతివ్రతయగును గాన ఏలగ్నమందైనను ఈధనుస్తులా, కన్యా, మిధున, మీనములలో నొకయంశమందు వివాహ ముహూర్తము నిశ్చయించవలెను.

## క్వచిన్నిషేధః.

శ్లో॥ అంత్యనవాంశే చపరిణే యాకాచనవర్గోత్తమ మిహహిత్వా । నోచరలగ్నే చరలవయోగ తౌలిమృగస్థేశశభృతికుర్యాత్॥

తా॥ వర్గోత్తమాంశలను (అనగా) చరలగ్నమందు ప్రథమాంశనున్ను, స్థిర లగ్నమందు పంచమాంశనున్ను (ద్విస్వభావమందు నవమాంశనున్ను) విడిచి మిగిలిన అంత్యనవాంశలయందు కన్యకావివాహము కూడదు చంద్రుడు తులామకరములయందుండగా చరలగ్నమందు చరనవాంశమంచిదిగాదు.

## త్యాజ్య యోగములు.

శ్లో॥ వ్యయేశనిఃఖేఽవనిజ స్తృతీయే భృగుస్తనౌ చంద్రఖలా నశస్తాః । లగ్నేట్కవిగ్లౌశ్చరిపౌమృతౌ గ్లౌర్లగ్నేట్ శుభారాశ్చ మదేచసర్వే॥

తా॥ వివాహలగ్నమునకు 12 వ స్థానమందు శనియు, 10 వ స్థానమందు అంగారకుడును, 3 వ స్థానమందు శుక్రుడును లగ్నమందు చంద్ర, కుజ, శని, రవి, రాహు కేతువులును, 6, 8 స్థానములయందు లగ్నేశ, శుక్ర, చంద్రులును, 7 వ స్థానమందు చంద్రుడు లగ్నాధిపతి బుధ, గురు, శుక్రులును, అంగారకుడును మిగిలిన గ్రహములును నుండగా వివాహము శుభకరముగాదు.

## లగ్న సంపత్తి.

శ్లో॥ త్ర్యాయాష్టషట్సురవి కేతుతమోర్కపుత్రాస్త్ర్యాయారిగః క్షితిసుతోద్విగుణాయగోబ్జః । సప్తవ్యయాష్టరహితౌజ్ఞ గురూ సితోష్టత్రిద్యూనషడ్వ్యయగృహాన్ పరిహృత్యశస్తాః॥

తా॥ వివాహలగ్నమునకు 3.11.8.6 స్థానములయందున్న రవి, కేతు, రాహు శనులును, 3. 11. 6 స్థానములయందున్న అంగారకుడును, 2. 3. 11 స్థానములయందున్న చంద్రుడును, 1. 2. 3. 4. 5. 6. 9. 10. 11 స్థానములయందున్న

అనగా 7-8-12 స్థానముల లేకుండిన బుధ గురువులును 8-3-7-6-12 స్థానముల లేకుండిన అనగా 1-2-4-5-9-11 స్థానములయందున్న శుక్రుడును శుభకరులు యిది విపరీతస్థాః విపరీతఫలందదతీతిభావః॥

## కర్తర్యాది దోషాపవాదము.

శ్లో॥ పాపౌకర్తరికారకౌరిపు గృహేనీచాస్తగౌకర్తరీ దోషో నైవసితేరినీచగృహగేతత్ షష్ఠదోషోపినీభౌమేస్తె రిపునీచగేనహిభవే ద్భౌమాష్టమోదోషకృత్ నీచేనీచనవాంశకేశశినిరిఃఫాష్టారిదోషోపిన॥

తా॥ కర్తరీకారకులైన పాపగ్రహములు శత్రుగృహ గతులుగాని నీచస్థులుగాని అస్తంగతులుగాని అయిన యెడల కర్తరీదోషములేదు శుక్రుడు శత్రుగృహ గతుడుగాని నీచగతుడుగాని నైన భృగుషట్కదోషములేదు అంగారకుడు అస్తంగతుడుగాని శత్రుగృహమును పొందినవాడుగాని నీచగతుడుగాని నైన యెడల కుజాష్టమదోషములేదు, చంద్రుడు నీచగతుడుగాని నీచనవాంశగతుడుగానినైన రిఃఫాష్టారి దోషములనగా చంద్రుడు 12-8-6 గృహములనున్న దోషమున్నలేదు.

శ్లో॥ అబ్దాయనర్తుతిథిమాసభపక్షదగ్ధతిథ్యంధకాణ బధిరపంగుముఖాశ్చదోషాః। నశ్యంతివిద్గురుసితేష్విహకేంద్రకోణె తద్వచ్చపాపవిధుయుక్తనవాంశదోషాః॥

తా॥ బుధగురుశుక్రులు 1-4-5-7-9-10 గృహములయందుండిరేని అబ్ద అయన, ఋతు, తిథి, మాస, నక్షత్ర, పక్ష, దగ్ధ, తిథి, అంధ, కాణ, బధిర, పంగు ప్రముఖ దోషములును, చంద్ర పాపగ్రహ యుక్త నవాంశదోషములును సూర్యసన్నిధిని చీకట్లు నశించినట్లు నశించును అనగా నీదోషములు స్వల్పములు లగ్నబలముండెనేని యీదోష విచారము అనావశ్యకమని తెలియదగినది.

శ్లో॥ కేంద్రేకోణెజీవఆయెరవౌవా లగ్నేచంద్రేవాపి వర్గోత్తమేవా। సర్వేదోషానాశమాయాంతి చంద్రేలాభె తద్వద్దుర్ముహూర్తాంశదోషాః॥

తా॥ గురువు 1-4-5-7-9-10గృహములనుండగానున్న రవి 11గృహమందుండగాను చంద్రుడు లగ్నమందుగాని 3-6-10-11 అను ఉపచయగృహముల యందుగాని, వర్గోత్తమ నవాంశలయందుగాని యుండగానున్న సర్వదోషములు నశించును, అట్లె చంద్రుడు ఏకాదశమందుండగా వారదుర్ముహూర్తాది దోషములు నశించును.

శ్లో॥ త్రికోణే కేంద్రేవామదనరహితె దోషశతకం హరేత్సౌమ్య



శుక్రోద్విగుణమపిలక్షంసురగురుః। భవేదాయెకేంద్రెంగపఉతలవేశ్లో యదితిదాసమూహం దోషాణాం దహనఇవతూలంశమయతి॥

తా॥ వివాహలగ్నమునకు ౧-౪-౫-౭-౯-౧౦ గృహములలో ౭వ గృహముగాక మిగత గృహములలో బుధుడుండిన ౧౦౦ దోషములను నశింపజేయును శుక్రుడుండెనేని ౨౦౦ దోషములనున్న గురువుండెనేని ౧౦౦౦౦౦ దోషములనున్న నశింపజేయును, లగ్నాధిపతిగాని నవాంశాధిపతిగాని ౧-౪-౭-౧౧-౧౦ గృహములలో నుండిరేని దోషజాలమును జ్వాలనుడు తూలజాలమును (పత్తి) వలెనశింపజేయును.

## లగ్న విశోపకములు.

శ్లో॥ ద్వాద్వ్యాజ్ఞభృగ్వోః పంచేందౌరవౌసార్ధత్రయోగురౌ। రామామందాగుకేత్వారె సార్ధైకైకంవిశోపకాః॥

తా॥ బుధునకు ౨, శుక్రునకు ౨, చంద్రునకు ౫, సూర్యునకు ౩½ గురువునకు ౩, శనికి ౧½ రాహువునకు ౧½ కేతువునకు ౧½ అంగారకునకు ౧½ యును విశోపకములు.

## గ్రహవశముచేత శ్వశురాది జ్ఞానము.

శ్లో॥ శ్వశ్రూఃసితోర్కః శ్వశురస్తనుస్తనుర్జామిత్రపః స్యాద్దయితోమనఃశశీ। ఏతద్బలంసంప్రతిభావ్య తాంత్రికస్తేషాంసుఖంసంప్రవదేద్వివాహతః॥

తా॥ కన్యకకు అత్తగారు శుక్రుడు, మామగారు సూర్యుడు, లగ్నము శరీరము సప్తమాధిపతి భర్త, చంద్రుడు మనస్సు, జ్యోతిష్కుడు ఈశుక్ర, రవి, లగ్నసప్తమాధిపతి చంద్రులయొక్క బలమును విచారించి వివాహలగ్నబలమును బట్టి ఆ అత్తమామ శరీర భర్త మనస్సులకు శుభాశుభమును చెప్పవలెను అనగా ఈగ్రహములు అస్తంగత శత్రుగత నీచగతులైన పైవారికి అశుభము ఉచ్చంగత స్వగృహమిత్ర గృహతులైన వారికి శుభము కలుగును.

## సంకీర్ణ జాతులకు గ్రహసంపత్తి.

శ్లో॥ కృష్ణేపక్షేసౌరికుజార్కేపిచ వారెవర్జ్యేసత్క్షత్రే యదివాస్యాత్కరపీడా। సంకీర్ణానాంతర్హిసుతాయుర్ధనలాభప్రీతిప్రాప్త్యైసా భవతీహస్థితిరేషా॥

తా॥ కృష్ణపక్షమందును రవి కుజ శనివారములయందును నిషిద్ధనక్షత్రముల యందును సంకీర్ణజాతులకు వివాహము జరిగిన యెడల సుతఆయుః ధనలాభ సుఖ ప్రాప్తి గలుగును. ఇట్లు మర్యాద, సంకీర్ణులు=సంకరజాతులును చండాలాదులును,

## మఱియొక విశేషము.

శ్లో॥ గాంధర్వాదివివాహే ర్కాద్వేదనేత్రగుణేందవః। శుయుగాంగాగ్ని భూరామాస్త్రి పద్యాపశుభాశుభాః॥

తా॥ గాంధర్వాది వివాహములయందు సూర్యుడున్న నక్షత్రము మొదలు నిత్యనక్షత్రములయందు లెక్కించగా ౪ అశుభము, ౨ శుభము, ౩ అశుభ, ౧ శుభ, ౧ అశుభ, ౪ శుభ, ౬ అశుభ, ౩ శుభ, ౧ అశుభ, ౩ శుభము త్రిపదమందు శుభములైనవి శుభములు.

## వివాహసంభార రచనకాల నిర్ణయము.

శ్లో॥ విధోర్బలము వేక్ష్యవా దలనకండనంవారకంగృహాంగణవిభూషణాన్యథ చ వేదికామండపాన్ । వివాహవిహితోడుభిర్విరచయేత్తథోద్వాహతోన పూర్వమిదమాచరేత్త్రిసవషణ్మితేవాసరె॥

తా॥ వివాహమునకు కావలసిన దళన, కండన, వారక, గృహాంగణాలంకరణ వేదీనిర్మాణ మండపరచనాదులు చంద్రబలమును విచారించి వివాహోక్త నక్షత్రములయందు ఆరంభించవలెను ఈవస్తుసంపాదన వివాహమునకు పూర్వము ౩. ౬. ౯ దినములయందు జేయగూడదు.

## వేదీ లక్షణాదికము.

శ్లో॥ హస్తోచ్ఛ్రియా వేదహస్తైః సమంతాత్తుల్యా వేదీ సద్మనోవామభాగె । యుగ్మేఘస్రేషష్ఠహీనేచ వంచసప్తాహేస్యాన్మండపోద్వాసనంతత్ ॥

తా॥ వివాహవేదికా లక్షణమును జెప్పుచున్నాడు గృహమునకు నెడమభాగమందు వివాహవేదిక యుండవలెను ఆవేదిక మూర (4 గజము) యెత్తును నాలుగు మూరల వెడలుపును నాలుగుమూరల పొడవును యుండవలెను, నాలుగుదిక్కుల సమానముగా నుండవలెను ఇకమండపోద్వాసన కాలమును జెప్పుచున్నాడు వివాహానంతరము ౬ గాక విగతా ౧౬ లోగానైన సమసంఖ్యయందును అనగా ౧౬-౧౪-౧౨-౧౦ రోజులయందును ౫-౭ రోజులయందును మండపోద్వాసన జేయవలెను.

## స్తంభ నివేశనము.

శ్లో॥ సూర్యేంగనాసింహ ధటేషు శైవె స్తంభోలి కోదండమృగేషు వాయౌ । మీనాజకుంభెనిరృతౌ వివాహే స్థాప్యోగ్నికోణె వృషయుగ్మకర్కే॥



తా॥ సూర్యుడు కన్యాసింహతులల నుండగా ఈశాన్యమందును వృశ్చిక, ధను, మకరములయందుండంగా వాయువ్యమందును మీన, మేష, కుంభములనుండగానిరృతి దిక్కునందును వృషభ, కర్కాటక, మిథునముల యందుండగా ఆగ్నేయమందును వివాహమండపాదులకు ప్రథమ స్తంభమును ఉంచవలెను.

## గోధూళి ప్రశంస.

శ్లో॥ నాస్మిన్భంనతిథికరణం నైవలగ్నస్యచింతానోవా వారోనచలవవిధిర్నో ముహూర్తస్యచర్చా । నోవాయోగోనమృతిభవనం నైవజామిత్రదోషోగోధూళిఃసామునిభిరుదితాసర్వకార్యేషుశస్తా॥

తా॥ గోధూలికాలమందు నక్షత్రతిథి యోగలగ్న వార, అంశ, ముహూర్త కరణ, అష్టమదోష, జామిత్రదోషములయొక్క విచారణతో నెంతమాత్రము పనిలేదు మునులు గోధూలికాలము సర్వకార్యములకు యోగ్యమైనదని చెప్పుచున్నారు అనగా గోధూలికాలమందు వివాహాదుల నాచరించువారు తిథివార, నక్షత్రలగ్న, నవాంశ యోగ కరణ, అష్టమదోష, జామిత్రదోషము మొదలైన దోషములను విచారించ నవసరము లేదని భావము.

శ్లో॥ పిండీభూతెదినకృతిహేమంతర్తౌస్యాదర్ధాస్తె తపసమయె గోధూళిః । సంపూర్ణాస్తైజలధరమాలా కాలెత్రేధాయోజ్యా సకల శుభెకార్యాదౌ॥

తా॥ గోధూలికాలమును జెప్పుచున్నాడు హేమంత ఋతువులో అనగా మార్గశీర్షాది ౪ మాసములయందు సూర్యుడుకిరణశూన్యుడై పిండాకారుడైనప్పుడును చైత్రాది ౪ మాసములయందు అర్ధాస్తమయకాలమందును, వర్షాకాలమందు ౪ మాసములు సంపూర్ణముగా అస్తమించి నప్పుడును, గోధూళికాలము ఈగోధూళి కాలము సమస్త శుభకార్యములకు శుభకరము.

శ్లో॥ అస్తంయాతెగురుదివసె సౌరెసార్కెలగ్నాన్మృత్యౌ రిపుభవనెలగ్నెవేందౌ । కన్యానాశస్తనుమదన మృత్యుస్థెభౌమెగోధూలౌభేధనసహజెచంద్రె సౌఖ్యమ్॥

తా॥ ఈగోధూళియందు మరియొక విశేషమును జెప్పుచున్నాడు గురువారమునాడు అస్తమయానంతరమును శనివారమునాడు సూర్యుడుండగానున్న చంద్రుడు గోధూళి లగ్నమునకు ౧- ౬-, ౮- స్థానములనుండగానున్న వివాహము జరిగిన కన్యా

నాశము గలుగును. ౧. ౬. ౮ స్థానములయందు అంగారకుడుండెనేని పరనాశము గలుగును చంద్రుడు ౨. 3. ౧౧ స్థానములయందుండగా సౌఖ్యముగలుగును ఇది యొక విశేషము యున్నది.

### సూర్యభుక్తి.

శ్లో॥ మేషాదిగేర్కేష్టశరానగాశ్వాస్స్తేమవసస్తశరాగజాశ్వాః॥ గోశ్వాఃఖతర్కాఃశరసాః శతర్కాఃక్యంగాని షష్టిర్నవపంచభుక్తిః॥

తా॥ మేషాది రాసులయందు క్రమముగా సూర్యభుక్తిని జెప్పుచున్నాడు మేషమందు ౫౮, వృష ౫౭, మిథు ౫౭, కటక ౫౭, సింహ ౫౮, కన్య, ౫౯, తుల ౬౦ వృశ్చి ౬౧, ధను ౬౧, మకర ౬౧, కుంభ ౬౦, మీన ౫౯ న్ని సూర్యభుక్తిసంఖ్యలు.

### రవేః తాత్కాలికీ కరణమ్.

శ్లో॥ సంక్రాంతియాతఘస్రైర్ద్యుగతిర్నిఘ్నిఖషడ్భృతా। లబ్ధేనాంశాదినాయోజ్యం యాతర్క్షంస్పష్టభాస్కరః॥

తా॥ ఏదినమందు ఎన్నిఘటికలయందు ఎన్నిపలములయందు సంక్రాంతి యగునో అది మొదలు స్వాభీష్టదినపర్యంతము ఎన్నిదినఘటికా పలములగునో అన్నిటిచేత (ఆమొత్తముచేత) సూర్యస్థూలగతిని గుణించి ౬౦ చేత భాగించగా వచ్చిన లబ్ధము అంశాదికమగును ఆయంశాదికముతో యాతరాశి (అనగా సూర్యభుక్త మేషాదిరాశి) కూడిన స్పష్టసూర్యుడగును.

### ఇష్టకాలిక లగ్నానయమ్.

శ్లో॥ తనోర్నరిష్టాంశకాత్పూర్వం నవాంశాదశసంగుణాః । రామాప్తాలబ్ధమంశాద్యంతనోర్వర్గాదిసాధనే॥

తా॥ లగ్నముయొక్క ఇష్టనవాంశకు పూర్వమందైన నవాంశసంఖ్యను ౧౦చేత గుణించి 3 చేత విభాగించగా వచ్చిన లబ్ధము అంశకలావికలాత్మకము అగును అది లగ్నముయొక్క షడ్వర్గసాధన మగును.

### రవిలగ్నాభ్యామిష్ట ఘటికానయనమ్.

శ్లో॥ అర్కాల్లగ్నాత్సాయనాద్భోగ్యభుక్తైర్భాగైర్నిఘ్నాత్స్వదర్క్షాత్ఖాగ్నిభక్తాత్ । భోగ్యంభుక్తంచాంతరాలోదయాఢ్యంషష్ట్యాభక్తంస్యేష్టనాడ్యోభవేయుః॥



తా॥ అయన సహిత సూర్యలగ్నములయొక్క భోగ్యాంశలచేత స్వదేశీయ లగ్న పలాత్మక ప్రమాణమును హెచ్చించి 30 చేతభాగించగా వచ్చినలబ్ధము భోగ్యపలములు లగ్నరవులయొక్క భుక్తాంశలచే హెచ్చించి 30 చేత భాగించగా వచ్చిన లబ్ధము భుక్తపలములు ఈరెండు మొత్తములను సాయన రవి లగ్నఅంతరాలోదయ పలములతో కూడి ౬౦ చేత భాగించిన సూర్యోదయాది ఇష్టకాల ఘటికలువచ్చును.

శ్లో॥ చేల్లగ్నార్కౌసాయనావేకరాశౌతద్విశ్లేషఘ్నోదయఃఖాగ్నిభక్తః । స్వేష్టఃకాలోలగ్నమూనం యదార్కాద్రాత్రేః శేషోర్కాత్స షడ్భాన్నిశాయామ్॥

తా॥ సాయనములైన రవి లగ్నములు ఏకరాశియందున్న యడల స్వదేశీయ లగ్నపరిమాణమును ఆరవి లగ్నాంతరగతాంశలచే హెచ్చించి 30 చేత భాగించగా వచ్చిన లబ్ధము ఇష్టకాలము యెప్పుడైతే సాయన రవికంటె లగ్నము తక్కువగునో అప్పుడు ఇష్టకాలము రాత్రిశేషమగును రాత్రియందు సూర్యరాశియందు ౬ కలిపిన పైక్రమముగావచ్చినది సూర్యాస్థానంతరమగును.

### శుభవర్జ్య దోషములు.

శ్లో॥ ఉత్పాతాన్సహపాతదగ్ధతిథిభిర్దుష్టాంశ్చయోగాంస్తథా। చంద్రేజ్యోశనసాంమధాస్తమయనంతిధ్యాఃక్షయర్ధీతథా । గండాంతంచశవిష్టిసంక్రమదినం తన్నాంశపాస్తంతథాతన్వంశేశవిధూనథాష్టరిపుగాన్ పాపస్యవర్గాంస్తథా॥ శ్లో॥ సేందుక్రూరఖగోదయాంశముదయాస్తౌశుద్ధిచండాయుధాన్ ఖార్జూరందశయోగసహితంజామిత్రలత్తావ్యధం । బాణోపగ్రహపాపకర్తరి తథాతిధ్యృక్షవారోత్థితం దుష్టంయోగమధార్ధయామకులికాద్యాన్ వారదోషానపి ॥ క్రూరాక్రాంతవిముక్తభం గ్రహణభం యత్క్రూరగంతవ్యభం త్రేధోత్పాతహతంచ కేతుహతభం సంధ్యోదితంభంతథా ॥ తద్వచ్చగ్రహభిన్నయుద్ధగతభం సర్వానిమాన్ సంత్యజేదుద్వాహేశుభకర్మసుగ్రహకృతాన్ లగ్నస్యదోషానపి॥

తా॥ వివాహాది సకల శుభకర్మలయందు ఉత్పాత, మహాపాత, దగ్ధతిథి, దుష్టయోగ చంద్రగురుశుక్రాస్తమయ, తిధిక్షయవృద్ధి గండాంత, విష్టి, సంక్రాంతి, లగ్న, నవాంశ స్వామ్యస్త, అష్టమలగ్న రిపుస్థలగ్న నవాంశేశ చంద్ర, పాపషడ్వర్గ, పాపయుక్త చంద్ర, పాపయుక్తలగ్ననవాంశ, ఉదయాస్తదోష, పాత, ఖార్జూర, దశ,

దుష్టయోగ, జామిత్ర, లత్తా, పంచక, ఉపగ్రహ, పాపకర్తరి, తిథినక్షత్రయోగో త్థిత యోగదోష, అర్ధయామ, కులిక, వారదోష, క్రూరాక్రాంత క్రూరభుక్త క్రూరగంతవ్య నక్షత్ర, గ్రహణనక్షత్ర, త్రివిధోత్పాత నక్షత్ర, కేతునక్షత్ర, సంధ్యా నక్షత్ర, గ్రహభిన్న నక్షత్ర, యుద్ధనక్షత్ర, గ్రహాక్రాంతలగ్న దోషములను విడువ వలెనని తాత్పర్యము.

ఇతి శ్రీదైవజ్ఞానంత సుతరామవిరచితే ముహూర్తచింతా

మణి వివాహ ప్రకరణం (షష్ఠం) సమాప్తమ్.

---

## 7 వధూప్రవేశ ప్రకరణము.

శ్లో॥ సమాద్రిపంచాంకదినే వివాహాద్వధూప్రవేశోష్టి దినాంతరాలే। శుభఃపరస్తాద్విషమాబ్దమాస దినేష్వపాక్పరతోయథేష్టమ్॥

తా॥ వివాహమైన ౧౬ దినములకు లోపల ౬. ౮. ౧౦. ౧౨. ౧౪. ౧౬. ౭. ౯. దినములయందును ౧౬ దినములకు పిమ్మట విషమవత్సర, విషమమాస, విషదిన ములయందును, నూతన వధూప్రవేశము శుభకరము వివాహమైన అయిదు సంవత్స రములకు పిమ్మట విషమసంఖ్యా నియమములేదు అనఁగా శుభముహూర్తమందు జరుపఁదగునని తా॥

శ్లో॥ ధ్రువక్షిప్రమృదుశ్రోత్ర వసుమూలమఘానిలే। వధూప్రవేశస్సన్నేష్టో రిక్తారార్కేబుధేవరైః॥

తా॥ ధ్రువ, మృదు, క్షిప్ర, శ్రవణ, ధనిష్ఠ, మూల, మఘ, స్వాతీనక్షత్ర ములయందును, ౨- ౫- ౬- ౭ వారములయందును, ౪- ౯- ౧౪ తిథులుగాక మిగి లిన తిథులయందును నూతన వధూప్రవేశము శుభకరమని తా॥

### నూతన వధూ వాసదోషము.

శ్లో॥ జ్యేష్ఠేపతిజ్యేష్ఠ మథాధికేపతింహంత్యాదిమే భర్తృగృహే వధూశ్శుచౌ। శ్వశ్రూంసహస్యేశ్వశురంక్షయేతనుం తాతంమధౌ తాత గృహేవివాహతః॥



తా॥ వివాహితయైన స్త్రీ ప్రథమ జ్యేష్ఠమాసమందు భర్తృగృహమందుండె నేని భర్త అన్నగారినిన్ని అధికమాసమందుండెనేని తనభర్తగారినిన్ని ఆషాఢమాస మందుండెనేని అత్తగారినిన్ని పుష్యమాసమందుండెనేని మామగారినిన్ని క్షయమాస మందుండెనేని తనశరీరమునున్ను నశింపజేయును ఇట్లే ప్రథమచైత్రమాసమందు తన తండ్రియింట్లో నుండెనేని తనతండ్రిని నశింపజేయును "తేషామభావేభయం నాస్తీతి మంతవ్యం"

ఇతి ముహూర్త చింతామణౌ వధూప్రవేశ ప్రకరణం

సప్తమం సమాప్తమ్.

---

## 8 ద్విరాగమన ముహూర్తము.

శ్లో॥ చరేదథౌజహాయనే ఘటాలిమేషగేరవౌరవీజ్య శుద్ధియోగతః శుభగ్రహస్యవాసరే। నృయుగ్మమీనకన్యకాతులా వృషేవిలగ్నకేద్విరాగమంలఘుధ్రువే చరేస్రపేమృదూడుని॥

తా॥ విషమ సంవత్సరములయందును సూర్యుడు ౧- ౮- ౧౧ రాసులయందుం డగాను రవి, గురు, శుక్రబలముండగాను శుభవాసరములయందును ౨-౩-౬-౭-౧౨ లగ్నములయందును క్షిప్ర, ధ్రువ, చర, మృదు, మూలానక్షత్రములయందును ద్విరా గమనము జేయవలెను ద్విరాగమనమనగా పితృగృహమునుంచి భర్తృగృహమునకు వెళ్ళి తిరిగి పితృగృహమునకువచ్చి కియత్కాలముండి తిరిగి భర్తృగృహమునకు వెళ్ళుట.

### సమ్ముఖ శుక్రదోషము.

శ్లో॥ దైత్యేజ్యోహ్యభిముఖదక్షిణే యదిస్యాద్గచ్ఛేయుర్నహి శిశుగర్భిణీనవోఢాః। బాలశ్చేద్వ్రజతివిపద్యతే నవోఢాచేద్వంధ్యాభవతిచగర్భిణీత్వగర్భా॥

తా॥ శుక్రుడు సమ్ముఖ దక్షిణస్థుడౌచునుండగా బాల, గర్భిణీ, నవవధువులు గమనము చేయఁజనదు గమనముజేసిరేని బాలుడు మృతినొందును నవవధువు గొడ్రా లగును గర్భిణి గర్భరహితయగును.

### ప్రతిశుక్ర దోషాపవాదము.

శ్లో॥ నగరప్రవేశవిషయాద్యుపద్రవే కరపీడనేవి బుధతీర్థయాత్ర

యోః । నృపపీడనేనవవధూప్రవేశనే ప్రతిభాగవో భపతిదోష కృన్నహి ॥

తా॥ స్వనగరప్రదేశమందును దేశోపద్రవమందును వివాహార్థగమనమందును దేవయాత్రయందును తీర్థయాత్రయందును రాజపీడయందును నవవధూప్రవేశమందును ప్రతిశుక్రదోషము లేదు.

శ్లో॥ పిత్ర్యేగృహేచేత్కుచ పుష్పసంభవ స్తథానదోషః ప్రతిశుక్రసంభవః । భృగ్వంగిరోవత్సవసిష్ఠ కశ్యపాత్రీణాం భరద్వాజమునేః కులేతథా॥

తా॥ పితృగృహమందె కుచోత్పత్తి గలిగి రజోదర్శనవతియైన కన్యకకును భృగు ఆంగీరస, వత్స, వసిష్ఠ, కాశ్యప, ఆత్రేయ, భరద్వాజ, సగోత్రులకును ప్రతి శుక్ర దోషములేదు.

ఇతిముహూర్త చింతామణౌ అష్టమం ద్విరాగమన ప్రకరణం

సంపూర్ణమ్.

---

## అగ్న్యాధాన ముహూర్తము.

శ్లో॥ స్యాదగ్నిహోత్రవిధిరుత్తరగ దినేశేమిశ్రధ్రువాంత్య శశిశక్ర సురేజ్యధిష్ణ్యే। రిక్తాసునోశశికుజేజ్య భృగౌనవీచేనాస్తంగ తేనవిజితేనచశత్రుగేహే ॥

తా॥ ఉత్తరాయణమందును మిశ్ర, స్థిర, రేవతీ, మృగశీర్ష, జ్యేష్ఠ, పుష్యమీ నక్షత్రములయందును అగ్న్యాధానము జేయదగినది ౪- ౯- ౧౪ తిథులయందును చంద్ర, గురు, శుక్ర, అంగారకులు నీచంగతులైనప్పుడును అస్తంగతులైనప్పుడునుపరాజితులైనప్పుడును శత్రుగృహంగతులైనప్పుడు అగ్న్యాధానము జేయగూడదు.

శ్లో॥ నోకర్కనక్రఝషకుంభ నవాంశలగ్నే నోజ్జైతనౌ రవిశశీజ్యకుజైస్త్రికోణే । కేంద్రద్యూన షట్త్రిభవగేషు పరైస్త్రిలాభషట్ఖస్థితైర్నిధనశుద్ధియుతేవిలగ్నే॥

తా॥ కర్కాటక, మకర, కుంభ, మీనలగ్నములయందును వీటినవాంశలయందును లగ్నమందు చంద్రుడుండగానున్ను అగ్న్యాధానము జేయగూడదు రవి, చంద్ర,



గురు, కుజులు ౫- ౯- ౧- ౪- ౭. 10. 6. 3. 11 గృహములయందుండగానున్ను అన్యులైన బుధ, శుక్ర, శని, రాహు, కేతువులు 3. 11. 6. 10 గృహములయందుండగానున్ను అష్టమశుద్ధిగల లగ్నమందును అగ్న్యాధానము జేయవచ్చును.

శ్లో॥ చాపేజీవేతనుస్థేవామేషే భౌమేంబరేద్యూనే । షష్ఠేత్రాయేజైరవౌవాస్యాజ్జాతోగ్నిర్జయతిధ్రువమ్॥

తా॥ గురువు ధనుస్సునందుగాని లగ్నమందుగాని యుండగాను అంగారకుడు మేషమందుగాని దశమందుగాని సప్తమందుగాని యుండగాను చంద్రుడుగానిసూర్యుడుగాని 3- 6- 11 గృహముల యందుండగానున్ను అగ్నిప్రతిష్ఠాపన జేసిన వాడు జయమును పొందును అనగా ఉత్తరోత్తర కృతుసమృద్ధిని పొందును.

ఇతి ముహూర్త చింతామణౌ నవమం అగ్న్యాధానప్రకరణం

సమాప్తమ్.

---

## రాజ్యాభిషేక ముహూర్తము.

శ్లో॥ రాజ్యాభిషేకశ్శుభఉత్తరాయణే గుర్వేందుశుక్రైరుదితైర్బలాన్వితైః । భౌమార్కలగ్నేశదశేశ జన్మపైర్నో చైత్రరిక్తారనిశామలిమ్లుచే॥

తా॥ ఉత్తరాయణమందును గురు, శుక్ర, చంద్రులు, ఉదయించియుండగానున్ను బలవంతులై యుండగానున్ను కుజ, రవి, లగ్నేశ, దశమేశ, జన్మలగ్నాధిపతులు బలవంతులై యుండగాను రాజ్యాభిషేకము శుభప్రదము 4- 9- 14 తిథులయందును రాత్రియందును చైత్రమాసమందును మలమాసమందును రాజ్యాభిషేకము నాచరించగూడదు.

శ్లో॥ శాక్రశ్రవఃక్షిప్రమృదుధ్రువోడుభిః శీర్షోదయోపచయేశుభేతనౌ । పాపైస్త్రిషష్ఠాయగతైఃశుభగ్రహైః కేంద్రత్రికోణాయధనత్రిసంస్థైః॥

తా॥ జ్యేష్ఠ- శ్రవణ- క్షిప్ర- మృదు- స్థిర, నక్షత్రములయందును, శీర్షోదయ రాసులయందును అనగా 3- 5- 6- 7- 8- 11 రాసులయందును అథవా ఉపచయ లగ్నమందును అనగా 3- 6- 10- 11 లగ్నములయందును శుభలగ్నమందును

పాపగ్రహములు 3. 6. 11 గృహములయందును శుభగ్రహములు 1.2.3.౪.5.7.9 10.11 గృహములయందును ఉండగానున్న రాజ్యాభిషేకము ప్రశస్తము.

శ్లో॥ పాపైస్తనౌరుక్నిధనేమృతిః సుతేపుత్రార్తిరర్థవ్యయగైర్దరిద్రతా । స్యాత్ఖేలసోభ్రష్టవధోద్యునాంబుగైః సర్వంశుభం కేంద్రగతైః శుభగ్రహైః ॥

తా॥ రాజ్యాభిషేకమందు, పాపగ్రహములు, లగ్నమందుండెనేని రోగమును అష్టమందుండెనేని మరణమును, పంచమందుండెనేని పుత్రక్లేశమును ద్వితీయద్వాదశములయందుండిరేని దారిద్ర్యమును, దశమమందుండిరేని మాంద్యమును చతుర్థసప్తమములయందుండిరేని ఐశ్వర్యభ్రంశమునున్ను జేయును, ౧. ౪. ౭. ౧౦ స్థానములయందు శుభగ్రహములుండిరేని సర్వము శుభమౌను.

## తత్రవిశేషః.

శ్లో॥ గురుర్లగ్నకోణేకుజోరాసితఃఖె సరాజాసదామోదతె రాజలక్ష్మ్యా । తృతీయాయగౌసౌరి సూర్యౌఖబంధ్వోర్గురుశ్చేద్ధరిత్రీస్థిరాస్యాన్నృపస్య॥

తా॥ రాజ్యాభిషేక లగ్నముకు గ్రహబలమునుబట్టి ఫలమును చెప్పుచున్నాడు ౯. ౫ స్థానముల గురువును, ౬ వ స్థానమందు కుజుడును, ౧౦ వ స్థానమందు శుక్రుడును ఉండిరేని ఆరాజు నిరంతరము రాజలక్ష్మితో సంతోషించుచుండును రవి ౧౧ స్థానమందును శని 3 వ స్థానమందును, ౪.౧౦ స్థానములయందు గురువును ఉండిరేని ఈరాజునకు భూములు స్థిరముగానుండును.

ఇతి ముహూర్తచింతామణౌ దశమం రాజ్యాభిషేకప్రకరణం సమాప్తమ్.

---

## యాత్రాధికారులు.

శ్లో॥ యాత్రాయాంప్రవిదితజన్మనాం నృపాణాందాతవ్యందివసముద్ధజన్మనాంచ । ప్రశ్నాద్యైర్వ్యుదయనిమిత్తమూలైః భూతైర్విజ్ఞాతేహ్యశుభశుభైబుధః ప్రదద్యాత్ ॥



యాత్రాప్రకరణమును చెప్పుచున్నాడు, జ్యోతిష్కుడు యాత్రచేయబోవు రాజాదులయొక్క జన్మపత్రికను చూచిగాని, జన్మపత్రికలేనియెడల నష్టజాతకమును గుణించి దానిని చూచిగాని, లేక ప్రశ్నాదులచేత శుభాశుభములను విచారించిగాని, యీయాయువు పూర్ణాయుష్మంతుడై తత్కాలమందు గండాందులు లేకుండిన గమనము జేయవచ్చునని చెప్పవలయును, లేక ప్రశ్న, ఉపశ్రుతి, శకునాదుల వలన యియానుకు అరిష్ట ఫలమున్నట్లు తెలియబడెనేని నప్పుడు గమనము మానవలయునని చెప్పవలయును. అనగా దీర్ఘాయుష్మంతులు శుభోత్తరులు, గమనము చేయవచ్చును, అల్పాయుష్మంతులు, అరిష్టోత్తరులు గమనము చేయరాదనియభిప్రాయము.

## యాత్రాప్రశ్నఫలము.

శ్లో॥ జననరాశితనూయదిలగ్నగె తదధిపౌయదివాతతఏవవా। త్రిరిపుఖాయగృహం యదివోదయో విజయఏవభవేద్వసుధాపతేః॥

తా॥ యియానుచే చేయబడిన ప్రశ్ననుబట్టి ఫలమునుచెప్పుచున్నాడు, ప్రశ్నలగ్నము జన్మరాశి జన్మలగ్నములలో నొకటైనగాని తదధిపతులు ప్రశ్నలగ్నమందుండినగాని, ప్రశ్నలగ్నము, జన్మరాశి, జన్మలగ్నములకు 3.౬.౧౦.౧౧ స్థానములలో నొకటైనగాని గమనముచేయు రాజునకు జయము గలుగును, యుద్ధార్థమై వెళ్ళు రాజునకు ఈరీతిగా చెప్పవలయును.

శ్లో॥ రిపుజన్మలగ్నభమథాధిపౌతయోఽస్తత ఏవవోపచయసద్మచేద్భవేత్ । హిబుకేద్యునేథశుభవర్గకస్తనౌ యదిమస్తకోదయగృహం తదాజయః ॥

తా॥ ప్రశ్నలగ్నము శత్రువుయొక్క జన్మరాశి, జన్మలగ్నములకు ౪.౭ లలో నొకటైనగాని, తత్స్వాములు తత్రత్యులైనగాని, ప్రశ్నలగ్నముకు ౪. ౭ స్థానములు శత్రుజన్మరాశి, జన్మలగ్నములకు 3. ౫. ౧౦. ౧౧ స్థానములలో నొకటైనగాని, లగ్నము శీర్షోదయరాశియైనగాని, లగ్నముకు శుభషడ్వర్గముండినగాని యాత్రకువిజయము గలుగును, షడ్వర్గవిభాగక్రమము పూర్వమందు చెప్పబడినదిగాన నిచ్చట వ్రాయబడలేదు.

శ్లో॥ యదిపృచ్ఛతనౌవసుధారుచిరా శుభవస్తు యదిశ్రుతిదర్శనగం। యదిపృచ్ఛతిచాదరతశ్చ శుభగ్రహదృష్టయుతం చరలగ్నమపి॥

తా॥ ప్రశ్నలగ్నసమయమందు భూమి, సుందరముగానున్నగాని, మంగలవస్తువులు దృష్టిగోచరములుగాని, శ్రవణగోచరములునైనగాని, ప్రశ్నించు సమయాన

పృచ్ఛకుని నమూర్తి ఆసనముతో యుండినగాని, లగ్నము చరమై శుభయుతముగాని శుభదృష్టముగాని యైనచో యాత్రకు (ప్రయాణీకునకు) విజయముగలుగును.

శ్లో॥ విధుకుజయుతలగ్నే సౌరిదృష్టేథచంద్రే మృతిభమదనసంస్థె లగ్నగేభాస్కరేపి । హిబుకనిధనహోరాద్యూనగేవాపి పాపె భవతిభంగః ప్రశ్నకర్తుస్తదానీమ్॥

తా॥ ప్రశ్నలగ్నము చంద్రాంగారకయుతమైనగాని, శనిదృష్టముగాని, చంద్రుడు లగ్నమునకు ౬. ౮ స్థానములనుండినగాని, సూర్యుడు లగ్నమందుండినగాని, పాపగ్రహములు లగ్న, చతుర్థ, సప్తమ, అష్టమ, స్థానములయందుండినగాని, అప్పుడె ప్రయాణ కర్తకు భంగము గలుగునని చెప్పవలయును.

## ఏదిక్కునకు పోగలడను ప్రశ్న.

శ్లో॥ త్రికోణకేంద్రేకుజ తేస్వరిశుక్రజ్ఞ జీవా యదైకోపివానోగమోర్కాచ్ఛశీవా । బలీయాంస్తుమధ్యేతయోర్యోగ్రహస్స్యాత్ స్వకీయాం దిశం ప్రత్యతాసానయెచ్చ॥

తా॥ ప్రశ్నసమయమందు అంగారకునకు ౫. ౯ స్థానములలో శని, శుక్ర, బుధ గురువులు సమష్టిగాగాని, వ్యష్టిగాగాని, నుండినచో గమనము సాగదు, రవికి ౫. ౯ స్థానముల చంద్రుడున్ననూ, ఇదె ఫలము, ఉక్తగ్రహములమధ్య నేగ్రహము బలవంతమై యుండునో ఆగ్రహదిక్కునకు తీసుకొనిపోవును, అనగా తనకిష్టమైన దిక్కునకు పోనివ్వదని భావము.

శ్లో॥ ప్రశ్నేగమ్యదిగీశాత్ఖేటః పంచమగోయః । బోభూయోద్బలయుక్తస్స్యాన్మాశాంనయతేసౌ॥

తా॥ ప్రశ్నకాలమందు తాను పోవదలచిన దిక్పతికి ౫ వ గృహమందే గ్రహము బలయుక్తమై యుండునో ఆగ్రహముయొక్క దిక్కునకు తీసుకొనిపోవును, క్రమముగా దిగీశులు, తూర్పు మొదలు రవి, శుక్ర, కుజ, రాహు, శని, చంద్ర, బుధ, బృహస్పతులు.

## యాత్రా కాలము.

శ్లో॥ ధనుర్మేషసింహేషు యాత్రాప్రశస్తాశనిజ్ఞోశనో రాశిగచ్ఛెవసుధ్యా । రవౌకర్కమీనాళిసంస్థేతి దీర్ఘాజనుస్సప్త పంచత్రితారాశ్చనేష్టాః॥



తా॥ సూర్యుడు, ౧. ౫. ౯ రాసులయందుండగా ప్రయాణముమంచిది ౨. ౩. ౬. ౭. ౧౦. ౧౧ రాసులయందుండగా మధ్యమము. ౪. ౮. ౧౨ రాసులయందుండగా అతి దీర్ఘము, అనగా ప్రశస్తముగాదు, యాత్రయందు ౧. ౩. ౫. ౭ తారలు మంచివిగావు.

## తి థ్యా ది శు ద్ధి.

శ్లో॥ నషష్ఠీనచద్వాదశీ నాష్టమీనోసితాద్యాతిథిః పూర్ణిమామా నరిక్తా । హయాదిత్యమిత్రేందుజీవాంత్య హస్తశ్రవోవాసవై రేవ యాత్రాప్రశస్తా॥

తా॥ ౧. ౪. ౬. ౮. ౯. ౧౨. ౧౪. ౧౫. 30 తిథులు యాత్రకుపనికిరావు అశ్విని, పునర్వసు, అనూరాధ, మృగశీర్ష, పుష్య, రేవతి, హస్త, శ్రవణ, ధనిష్ట నక్షత్రములు ప్రశస్తములు.

## వారశూల నక్షత్ర శూలలు.

శ్లో॥ నపూర్వదిశిశాక్రభేన విధుసౌరివారేతథానచాజపదభెగురౌ యమదిశినదైత్యేజ్యయోః । నపాశిదిశిధాతృభెకుజబుధేర్య మర్క్షేతథానసౌమ్యకకుభిప్రజేత్స్వజయజీవితార్థీబుధః॥

తా॥ జ్యేష్ఠానక్షత్రమందును, సోమశనివారములయందును, తూర్పునకును, పూర్వాభాద్రనక్షత్రమందును, గురువారమందును, దక్షిణమునకును, రోహిణీనక్షత్రమందును, రవి శుక్రవారములయందును, పశ్చిమమునకును, ఉత్తరానక్షత్రమునందును మంగళ బుధవారములయందును, ఉత్తరమునకును, జీవితార్థియైనవాడు పోగూడదు, అనగా ఆయాదిక్కులకు నాయానక్షత్రాదులు శూలలని భావము.

## కా ల శూ ల లు.

శ్లో॥ పూర్వాహ్ణేధ్రువమిశ్రభైర్నృపతేర్యాత్రానమధ్యాహ్నకే। తీక్ష్ణాఖ్యైరపరాహ్ణకే నలఘుభైర్నోపూర్వరాత్రేతథా । మిత్రాఖ్యైర్నచమధ్యరాత్రిసమయె చోగ్రైస్తథానోచరై రాత్ర్యంతేహరిహస్తపుష్య రశిభిస్స్యాత్సర్వకాలెశుభా॥

తా॥ స్థిరమిశ్రనక్షత్రములయందు పూర్వాహ్ణమందును, తీక్ష్ణనక్షత్రములయందు మధ్యాహ్నమందును, లఘునక్షత్రములయందు అపరాహ్ణమందును, మిత్రనక్షత్రము

లయందు పూర్వగాత్రిమందును. ఉగ్రనక్షత్రములయందు మధ్యగాత్రిమందును, చర నక్షత్రములయందు రాత్ర్యంతమందును, గమనము జేయగూడదు, శ్రవణ, హస్త, పుష్య, మృగశీర్ష, నక్షత్రములయందు సర్వకాలమందును యాత్ర శుభంకరమగును.

## నక్షత్ర వర్జ్య ఘటికలు.

శ్లో॥ పూర్వాగ్నిపిత్ర్యంతక తారకాణాంభూపత్రికృత్యగ్రితు రంగ్రమాన్స్యుః। స్వాతీవిశాఖేంద్ర భుజంగమానాం నాడ్యోనిషిద్ధా మనుసంమితాశ్చ।

తా॥ పూర్వాత్రయమందు 16 ను, కృత్తికయందు 21 ని, మఖయందు 11 ను, భరణియందు 7 ను, స్వాతియందు 14 ను, విశాఖయందు 14 ను, జ్యేష్ఠయందు 14ను, ఆశ్లేషయందు 14 ను, ప్రథమఘటికలు గమనమునకు నిషిద్ధములుగాన వర్జింపదగినవి.

## మతాంతరము.

శ్లో॥ పూర్వార్థమాగ్నేయ మఘానిలానాం త్యజేద్ధిచిత్రాహియ మోత్తరార్థం। నృపస్సమస్తాంగమనేజయార్థీ స్వాతీమఖాంచోశన సోమతేన।

తా॥ కృత్తికా మఖ స్వాతుల పూర్వార్థమున్ను, చిత్తా ఆశ్లేషా భరణి నక్షత్రముల ఉత్తరార్థమున్ను, జయార్థియైన రాజు గమనమందు విడువవలెనని కొందరి మతము స్వాతీ మఖలను సర్వమును విడువవలెనని శుక్రాచార్యుని మతము.

## నక్షత్రములకు జీవపక్షాది సంజ్ఞలు.

శ్లో॥ తమోభుక్తతారాస్స్మృతాః విశ్వసంఖ్యా శ్చభోజీవపక్షో మృతశ్చాపిభోగ్యాః। తదాక్రాంతభంకర్తరీ సంజ్ఞముక్తంతతోక్షం దుసంఖ్యం భవేద్గ్రస్తనామ।

తా॥ రాహుభుక్త నక్షత్రములు 13 జీవపక్ష సంజ్ఞలు, రాహుభోగ్యనక్షత్రములు, 13 మృతపక్షసంజ్ఞ, ఇందులో జీవపక్షము శుభకరము, రాహుక్రాంత నక్షత్రము కర్తరీ సంజ్ఞకము, దానికి 15 వ నక్షత్రము గ్రస్తసంజ్ఞకము.

## తత్ఫలములు.

శ్లో॥ మార్తాండమృతపక్షగేహిమకరశ్చేజ్జీవపక్షేశుభాయాత్రా



స్యాద్విపరీతగ తక్షయకరీద్వాజీవపక్షేశుభా। గ్రస్తర్క్షంమృతపక్షత శ్శుభకరంగ్రస్తాత్తథా కర్తరీయాయిస్థాయిందుస్స్నతిమార్క రవిజర్కాయు కరౌ త్వోద్వౌతయోర్జీవగౌ॥

తా॥ సూర్యుడు, మృతపక్షమందును, చంద్రుడు జీవపక్షమందును, యుండగా యాత్ర, శుభప్రదమగును, అట్లుగాక చంద్రుడు మృతపక్షమందును, సూర్యుడు జీవపక్షమందును యుండిన అశుభకరము, సూర్యచంద్రులిద్దరు జీవపక్షగతులైరేని శుభము, వారిద్దరు మృతపక్షగతులైరేని అశుభము, మృతపక్షనక్షత్రముకంటె గ్రస్తనక్షత్రము మంచిది, గ్రస్తనక్షత్రముకంటె కర్తరీనక్షత్రము మంచిది, అనగా దోషగణనయందు మృతముకంటె గ్రస్తము స్వల్పదోషప్రదము, గ్రస్తదోషముకంటె కర్తరీదోషము స్వల్పమని భావము, యాయి అయిన చంద్రుడును, స్థాయి అయిన సూర్యుడును, విజయప్రదులు. రవి చంద్రులిద్దరు జీవపక్షనక్షత్రగతులైరేని ఆయిద్దరికి జయప్రదులు, అనగా సూర్యుడు జీవపక్షగతుడైన స్థాయి యనబడును, చంద్రుడు జీవపక్షగతుడైన యాయి యనబడును, యుద్ధసన్నద్ధులైన ఇద్దరు రాజులలోను యుద్ధార్థమై వెళ్ళిన రాజు యాయి యనబడును, తన స్థలమందెయుండువాడు, స్థాయియనబడును యుద్ధ సమయమందు సూర్యుడు స్థాయి అయినచో స్థాయికి జయము, చంద్రుడు యాయి అయినచో యాయికి జయము, సూర్యచంద్రులిద్దరు జీవపక్షగతులైనయెడల ఇద్దరకిని జయముగలుగును, సూర్యచంద్రు లిద్దరు మృతిపక్షగతులైరేని ఇద్దరికిని పరాజయము గలుగునని తోచుచున్నది, చంద్రుడు మృతిపక్షమందు సూర్యుడును జీవపక్షమందును యుండిరేని, స్థాయికిని సూర్యుడు మృతిపక్షమందును చంద్రుడు జీవపక్షమందును యుండిరేని యాయికిని జయము గలుగును, యాయి స్థాయులకు ఇద్దరికి జయమనగా సంధి, ఇద్దరికి పరాజయమనగా హాని, యని తెలుసుకొనేది, ఇట్టి రవి చంద్రులు గ్రస్తమందున్న ఇద్దరికివిజయమును(సంధి)ఇద్దరు కర్తరియందున్న ఇద్దరికి పరాజయము(హాని)

## అశుభ శుభ శుభాశుభ యోగములు.

శ్లో॥ స్వాత్యంతకాహివసుపౌష్ణకరానురాధా దిత్యధ్రువాణి విష మాస్తిథయో౽శుభాస్స్యుః। సూర్యేందుమందగురవశ్చశుభాశుభజ్ఞో మూలాంబుపేశ విధిభండశపట్ద్వితిథ్యః॥ పూర్వాశ్విజ్యామఖేందు కర్ణాదహనా ద్వీశేంద్రచిత్రాస్తథా శుక్రారాశుభసంజ్ఞకాశ్చ తిథ యోరాష్టేంద్రవేదైర్మితాః। యాయీస్వాదకులేజయీచ సమరే

స్థాయీచ తద్వ్యత్యయతే । సంధిస్స్యాదుభయోశ్శుభాశుభగణౌ భూమీశయోర్యుద్ధ్యతోః॥

తా॥ స్వాతి- భరణి- ఆశ్లేషా- ధనిష్ఠ- రేవతి- హస్త- అనూరాధ-పునర్వసు ఉత్తరాత్రయ- రోహిణీ- నక్షత్రములును, రవి - చంద్ర - శని - గురువారములును 1- 3- 5- 7- 9- 11- 13- 15 తిథులును అశుభ సంజ్ఞలు, మూల- శతభిషక్-ఆర్ద్ర అభిజిత్ నక్షత్రములును 2- 6- 10 తిథులు శుభాశుభసంజ్ఞలు, పూర్వాత్రయ అశ్వినీ- మఖ- పుష్య- మృగశీర్ష- శ్రవణ- కృత్తికా- విశాఖ- జ్యేష్ఠ చిత్రనక్షత్రములును, శుక్ర మంగళవారములు 12- 8- 14- 4 తిథులును శుభసంజ్ఞలు, ఇందుకు ఫలములు అశుభములయందు యుద్ధయాత్రజేసిన యాయికి జయము శుభాశుభములయందు యుద్ధముజేయుచున్న రాజు లిద్దరికిని జయము (సంధి) గలుగును.

## పంథా రాహుచక్రము.

శ్లో॥ స్వర్ధర్మేశవసుపుష్యోరగ వసుజలపద్వీశ మైత్రాణ్యథార్థే
యామ్యాజాం ఘ్రీంద్రకర్ణాదితి పితృపవనోడూన్యథో భానికామే।
వహ్న్యర్ద్రాబుధ్న్యచిత్రా నిఋతివిధిభగాఖ్యాని మోక్షేధరో
హిణ్యర్యమ్ణా ప్యేందువిశ్వాంతి మభదినకరత్ర్యాణి పథ్యాదిరాహౌ॥

తా॥ అశ్వినీ- పుష్య- ఆశ్లేష- ధనిష్ఠ- శతభిషక్- విశాఖ- అనూరాధ, యీ ౭ నక్షత్రములు ధర్మములు, భరణి- పూర్వాభాద్ర- జ్యేష్ఠ- శ్రవణ- పునర్వసు,మఖ, స్వాతి, యీ ౭ నక్షత్రములు అర్థములు, కృత్తిక- ఆర్ద్ర- ఉత్తరాభాద్ర- చిత్త- మూల- అభిజిత్- పుబ్బ- యీ ౭ నక్షత్రములు కామములు, రోహిణి- ఉత్తరా- పూర్వాషాఢ- మృగశీర్ష- ఉత్తరాషాఢ- రేవతి- హస్త యీ ౭ నక్షత్రములు మోక్షములు, అనగా ధర్మార్థకామమోక్షములయందు క్రమముగా నాలుగు సప్తకములను వ్రాయవలెను, ఇది పంథా రాహుచక్రము ఇదియె ధర్మచక్రమనబడును.

## చక్రమ్.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| అశ్వి | పుష్య | ఆశ్లే | ధని | శత | విశా | అనూ | ధర్మము |
| భర | పూభా | జ్యేష్ఠ | శ్రవ | పున | మఖ | స్వాతీ | అర్థము |
| కృత్తి | ఆర్ద్ర | ఉభా | చిత్త | మూల | అభి | పుబ్బ | కామము |
| రోహి | ఉత్తరా | పూషా | మృగ | ఉషా | రేవ | హస్త | మోక్షము |



ఇందుకు ఫలములు ఈక్రిందవ్రాయబడుచున్నవి అచ్చట చూడవలెను.

శ్లో॥ ధర్మగేభాస్కరేవిత్తమోక్షే శశీవిత్తగేధర్మమోక్షస్థితశ్శస్యతే।
కామగేధర్మమోక్షార్థగశ్శోభనో మోక్షగే కేవలంధర్మగః ప్రోచ్యతే॥

తా॥ ధర్మమార్గమందు సూర్యుడుగాని, మోక్షమార్గమందు చంద్రుడుగాని అర్థమార్గమందు సూర్యుడుగాని, ధర్మమోక్షములయందు చంద్రుడుగాని, యున్నయెడల శుభము, కామమందున్న రవియు, ధర్మమందున్న చంద్రుడును శుభులు, మోక్షమందున్న సూర్యుడును, అర్థమందున్న చంద్రుడును శుభులు, మోక్షమందున్న సూర్యుడు ధర్మమందున్న చంద్రుడును శుభులు, కాలామృతరీత్యైతచ్ఛ్లోకాభిప్రాయోలిఖ్యతే॥ సూర్యుడు ధర్మగతుడైనప్పుడు చంద్రుడు ధర్మగతుడైన యాయికిభంగము, చంద్రుడు అర్థగతుడైన విజయము, చంద్రుడు కామగతుడైన పరాజయము, చంద్రుడు మోక్షగతుడైన స్థాయికి యుద్ధము గలుగును, సూర్యుడు అర్థగతుడైనప్పుడు చంద్రుడు అర్థమును పొందెనేని యాయికి బంధుద్వేషమును, కామగతుడైన శత్రురాజ్యప్రాప్తియు ను, మోక్షగతుడైన సర్వత్ర అశుభమున్ను గలుగును, ఈరీతిగా స్థాయిక్రమముగా లక్ష్మీభంగమును అశుభమును విజయమును పొందును ఇతోపివిశేషః కాలామృతే ద్రష్టవ్యః విస్తరభియా నాత్రలిఖితః

## తిథిచక్ర ఫలము.

శ్లో॥ పౌషేపక్షత్యాదికా ద్వాదశైవంతిథ్యోమాఘాదౌ ద్వితీయాదికాస్తాః । కామాత్త్రిస్రస్స్యుస్తృతీయాదివచ్చ యానేప్రాచ్యాద్యాఫలంతత్రవక్ష్యే॥ సౌఖ్యం క్లేశోభీతిరర్థాగమశ్చ శూన్యంనైస్స్వ్యం నిస్స్వతామిశ్రితాచ । ద్రవ్యక్లేశోదుఃఖమిష్టాప్తిరర్థోలాభస్సౌఖ్యం మంగలంవిత్తలాభః॥ లాభోద్రవ్యాప్తిర్ధనంసౌఖ్యముక్తంభీతిలాభో మృత్యురర్థాగమశ్చ । లాభంకష్టంద్రవ్యలాభం సుఖంచకష్టం సౌఖ్యం క్లేశలాభస్సుఖంచ ॥ సౌఖ్యంలాభఃకార్యసిద్ధిశ్చకష్టం క్లేశః కష్టాత్సిద్ధిరర్థోధనంచ । మృత్యుర్లాభోద్రవ్యలాభశ్చ శూన్యంశూన్యంసౌఖ్యం మృత్యురత్యంతకష్టమ్॥

తా॥ ప్రయాణమందు పుష్యశుక్లపాడ్యమి మొదలు మార్గశీర్ష శుక్ల ద్వాదశి వరకు క్రమముగా ౧౨ తిథులను వ్రాసి ముందువ్రాయబోవు చక్రము ప్రకారము పూర్వాది చతుర్దిక్కులఫలమును తెలుసుకొనేది శుక్లపక్షమందువలెనె కృష్ణపక్షమందును తెలుసుకొనేది అనగా చక్రములో నిషిద్ధతిథులను విడిచి మంచితిథులయందు నాయాదిక్కులకు గమనము జేయవలెను ౧౩- ౧౪- ౧౫ తిథులకు క్రమముగా ౩-౪- ౫ తిథుల ఫలమును చూచుకొనేది ఇది ౨౦ వ శ్లోకాభిప్రాయము ౨౧- ౨౨- ౨౩ శ్లోకాభిప్రాయము చక్రములో చూచునది.

## యాత్రాయాం తిథిచక్రం.

| తూర్పు | దక్షిణ | పశ్చిమ | ఉత్తర | పౌ | మా | ఫా | చై | వై | జ్యే | ఆ | శ్రా | భా | ఆ | కా | మా |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| సౌఖ్య | క్లేశ | భీతి | అర్థలాభః | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
| శూన్య | దరిద్ర | దరిద్ర | మిశ్రిత | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 1 |
| ద్రవ్యనాశ | దుఃఖ | ఇష్టలాభః | అర్థము | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 1 | 2 |
| లాభ | సౌఖ్య | మంగళ | విత్తలా॥ | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 1 | 2 | 3 |
| లాభ | ద్రవ్య | ధన | సౌఖ్య | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 1 | 2 | 3 | 4 |
| భీతి | లాభ | మృత్యు | అర్థ | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 1 | 2 | 3 | 4 | 5 |
| లాభ | కష్ట | ద్రవ్య | సుఖ | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| కష్ట | సౌఖ్య | క్లేశ | లాభ | 8 | 9 | 10 | 11 | 12 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| సౌఖ్య | లాభ | కార్యసిద్ధి | కష్ట | 9 | 10 | 11 | 12 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| క్లేశ | కష్టాత్సిద్ధి | అర్థసిద్ధి | ధన | 10 | 11 | 12 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| మృత్యు | లాభ | ద్రవ్య | శూన్య | 11 | 12 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| శూన్య | సౌఖ్య | మృత్యు | కష్ట | 12 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 |

యీ చక్రమందు యేదిక్కునకు యేతిథులు మంచివో యాదిక్కునకు ఆయాతిథులయందు పోవలయును.



## త్ర్యంశ స్వరోదయమాహ.

శ్లో॥ తిథ్యృక్షవారయుతిరద్రిగజాగ్ని తష్టా స్థానత్రయేऽత్ర వియతి ప్రథమేऽతిదుఃఖీ। మధ్యే ధనక్షతిరధోऽచరమే మృతిః స్యాత్ స్థానత్రయేంకయుజి సౌఖ్యజయా నిరుక్తా॥

తా॥ శుక్ల ప్రతిపదాది తిథివారనక్షత్రములను కలిపి ఆమొత్తమును మూడుభాగములు చేసి అందు మొదటిభాగమును ౭ చేతనున్ను, రెండవభాగమును ౮ చేతనున్ను, మూడవ భాగమును 3 చేతనున్ను భాగించగా మొదటి భాగమందు శేషము లేకుండిన ప్రయాణికుడు దుఃఖమునున్ను, రెండవభాగమందు శేషము లేకుండిన ధననాశమును, మూడవభాగమందు శేషము లేకుండిన మరణమునున్ను పొందును, మూడుభాగములయందు శేషమున్నయెడల సౌఖ్యమును, జయమునున్ను పొందును, తిథివారనక్షత్ర సంఖ్యాయుతి త్రిభాగములను క్రమముగా ౧. 3. ౭. చే హెచ్చించి తరువాత క్రమముగా ౭. ౮. 3 చేత భాగించవలయునని గ్రంథాంతరమతము.

## అడల భ్రమణ దోషములు.

శ్లో॥ రవేర్భతోऽబ్జభోన్మితిర్నగావశేషితాద్వ్యగా। మహాడలో నశస్యతే త్రిషణ్మితా భ్రమోऽభవేత్॥

తా॥ సూర్యుడున్న నక్షత్రము మొదలు చంద్రుడున్న నక్షత్రమువరకు అనగా ప్రయాణనక్షత్రము వరకు లెక్కించి ఆమొత్తమును ౭ చేత భాగించగా శేషము ౧.౭ అయినచో ఇది అడలదోషము, 3. ౬. అయినచో భ్రమణదోషము, యీరెండుదోషములు యాత్రకు అశుభకరములు అనగా ౧ కి తాడనం, 3 కి ఆర్తి, ౬ కి దేశభ్రమణం, ౭ కి తాడనమున్ను ఫలములు యిందులో అడలము సమస్తశుభకార్యములయందు విడువదగినదని గ్రంథాంతరాభిప్రాయము.

## హివర యోగము.

శ్లో॥ శశాంకభం సూర్యభతో గణ్యం పక్షాది తిథ్యాదినవారరేణ। యుతం నవాప్తం నగశేషకం చేత్ స్యాద్ధైవరం తద్గమనేऽతిశస్తం॥

తా॥ సూర్యుడున్న నక్షత్రము మొదలు చంద్రుడున్న నక్షత్రపర్యంతము లెక్కించి ఆసంఖ్యలో పక్షాదితిథి సంఖ్యనున్ను రవ్యాదివారసంఖ్యనున్ను కలిపి ౯ చేత భాగించగా ౭ శేషముండెనేని హివరయోగము ఇది ప్రయాణమందు మిక్కిలి ప్రశస్తం.

## ఘాత చంద్రదోషము.

శ్లో॥ భూపంచాంకద్వ్యంగదిగ్వహ్ని సప్తవేదాష్టేశార్కాంత్య ఘాతాఖ్యచంద్రః । మేషాదీనాంరాజసేవావివాదె యాత్రాయుద్ధాద్యే చనాన్యత్రవర్జ్యః॥

తా॥ మేషాదులకు క్రమముగా ౧. ౫. ౯. ౨. ౬. ౧౦. ౩. ౭. ౪. ౮. ౧౧. ౧౨ స్థానములనున్న చంద్రుడు ఘాతచంద్రుడనబడును ఈఘాతచంద్రుడు, రాజసేవా, వివాద, యాత్ర, యుద్ధములయందు విడువదగినవాడు, ఇతరకార్యములయందు ఘాత చంద్రదోషములేదు.

## ఘాత తిథులు.

శ్లో॥ గోస్త్రీఝషె ఘాతతిథిస్తు పూర్ణాభద్రానృయుక్కర్కటకె ధనందా । కౌర్పాజ్యయోర్నక్రథెచ రిక్తాజయాధనుఃకుంభహరా నశస్తాః ॥

తా॥ వృషభ కన్యా మీనములయందు ౫. ౧౦. ౧౫ తిథులును మిథునకర్కాటకములయందు ౨. ౭. ౧౨ తిథులును, మేష. వృశ్చికములయందు ౧. ౬. ౧౧తిథులును, తులా మకరములయందు ౪. ౯. ౧౪ తిథులును, సింహ ధనుఃకుంభములయందు ౩. ౮. ౧౩ తిథులును ఘాతతిథులును ఇవి యాత్రాయుద్ధములయందు నింద్యములు.

## ఘాత వారలు.

శ్లో॥ నక్రెభౌమోగోహరిస్త్రీషు మందశ్చంద్రోద్వంద్వేర్కోజభెజ్ఞః కర్కె । శుక్రఃకోదండాలిమీనేషుకుంభజూకేజీవోఘాతవారానశస్తాః॥

తా॥ మకరమందు అంగారకుడును, వృష కన్యా సింహములయందు శనియు, మిథునమందు చంద్రుడు, మేషమందు రవియు, కటకమందు బుధుడును, ధనుర్వృశ్చిక మీనములయందు శుక్రుడును, తులాకుంభములయందు గురువును, ఘాతవారములు ఇవి యాత్రాయుద్ధములకు వర్జ్యములు.

## ఘాత నక్షత్రములు.

శ్లో॥ మఘాకరస్వాతిమైత్రమూలశ్రుత్యంబుపాంత్యభం । యామ్యబ్రాహ్మేశసార్పంచ మేషాదెఘాతభంనసత్ ॥

తా॥ మేషాది రాసులయందు క్రమముగా ౧ మఘ, ౨ హస్త, ౩ స్వాతి, ౪ అనూరాధ, ౫ మూల, ౬ శ్రవణ, ౭ శతభిషక్, ౮ రేవతి, ౯ భరణి, ౧౦ రోహిణి ౧౧ ఆర్ద్ర, ౧౨ ఆశ్లేష నక్షత్రములు ఘాతనక్షత్రములు ఇవి యాత్రాయుద్ధములకు



అప్రశస్తములు.

## ఘాతచక్రము.

| మే | వృ | మి | క | సిం | క | తు | వృ | ధ | మ | కుం | మీ | రాసులు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 5 | 9 | 2 | 6 | 10 | 3 | 7 | 4 | 8 | 11 | 12 | చంద్రుడు |
| 1 | 7 | 2 | 4 | 7 | 7 | 5 | 6 | 6 | 3 | 5 | 6 | వారములు |
| 10 | 13 | 15 | 17 | 19 | 22 | 23 | 27 | 2 | 4 | 6 | 9 | నక్షత్రములు |
| 1 | 5 | 2 | 2 | 3 | 5 | 4 | 1 | 3 | 4 | 3 | 5 | |
| 6 | 10 | 7 | 7 | 8 | 10 | 9 | 6 | 8 | 9 | 8 | 10 | తిథులు |
| 11 | 15 | 12 | 12 | 13 | 15 | 14 | 11 | 13 | 14 | 13 | 15 | |

## యోగినీ దోషము.

శ్లో॥ నవభూమ్యశ్శివవహ్నయోఽక్షవిశ్వేర్కకృతాశ్శక్రరసాస్తురంగతిథ్యః । ద్విదశోమావసవశ్చపూర్వా తశ్చతిథయస్సంముఖవామగానశస్తాః॥

తా॥ తూర్పుదిక్కునకు 1. 9 ని ఆగ్నేయమునకు 3. 11 ను దక్షిణమునకు 5. 13 నైఋతికి 4. 12 ను పశ్చిమమునకు 6. 14 ను వాయువ్యమునకు 7. 15 ను ఉత్తరమునకు 2. 10 ని ఈశాన్యమునకు 8. 30 న్ని తిథులు ప్రయాణమునకు ప్రశస్తములుగావు ఇవి సంముఖమందును వామభాగమందును ఉన్న మంచివిగావు పృష్ఠమందును దక్షిణమందును మంచివి, ఇదియే యోగినీదోషము.

## కాలపాశ యోగములు.

శ్లో॥ కౌబేరీతోవైపరీత్యేన కాలోవారేర్కాద్యేసంముఖె తస్యపాశః। రాత్రౌవేతౌవైపరీత్యేనగణ్యౌ యాత్రాయుద్ధెసంముఖేవర్జనీయౌ॥

తా॥ ఆదివారమందు ఉత్తరదిక్కును, సోమవారమందు వాయువ్యమును, మంగళవారమందు పశ్చిమమును, బుధవారమందు నైరృతియును, గురువారమందు దక్షిణమును, శుక్రవారమును, ఆగ్నేయము, శనివారము తూర్పును, కాలపాశయోగములు ఈయోగములకు ఎదురుగా పాశయోగములు అనగా రవికి ఉత్తరము, కాలయోగము దక్షిణము పాశము శనికి తూర్పు కాలయోగము, పశ్చిమము పాశయోగము, శుక్రునకు

ఆగ్నేయము కాలము వాయువ్యము పాశము ఇట్లే యూహించునది, రాత్రుల యందు యిందుకు విపరీతముగా చూచుకునేది. అనగా పగలు కాలము, రాత్రి పాశము, పగలు పాశము రాత్రి కాలము ఇట్లూహించునది యాత్రాయుద్ధములయందు సంముఖమందున్న కాలపాశయోగములు నింద్యములు.

---

## కాలపాశ యోగ చక్రము.

| ర | చం | కు | బు | గు | శు | శ | వారములు |
|---|---|---|---|---|---|---|---|
| ఉత్తర | వాయు | పశ్చి | నైరృతి | దక్షి | ఆగ్నే | తూర్పు | కాలములు |
| దక్షి | ఆగ్నే | తూర్పు | ఈశా | ఉత్త | వాయు | పశ్చి | పాశములు |

## పరిఘా దండము.

శ్లో॥ భానిస్థాప్యాన్యబ్ధిదిక్షుసప్త సప్తానలర్క్షాతః। వాయవ్యాగ్నేయదిక్సంస్థం పారిఘంనవిలంఘయేత్ ॥

తా॥ ఈచక్రములో ప్రకారము నాలుగుదిక్కుల కృత్తికాది నక్షత్రములు వ్రాని వ్రాయవలెను. వాయవ్యము మొదలు ఆగ్నేయమువరకు ఐక రేఖను గీయవలెను ఇదియె పరిఘాదండము ఈపరిఘాదండమును దాటగూడదు. ఈవిషయమై కాలామృతమందింతకంటె విశేషము చెప్పబడియున్నది. ఎట్లంటె నైరృతినుంచి ఈశాన్యమువరకును మూలగీతగీయవలెను. కృత్తికాదులందు తూర్పునకును మఘాదులందు దక్షిణమునకును అనూరాధాదులందు పశ్చిమమునకును ధనిష్ఠాదులందు ఉత్తరమునకును బోగూడదు.

---



## పరిఘాదండ చక్రము.




## విదిశా నక్షత్రములు పరిఘాదండాపవాదము.

శ్లో॥ అగ్నేర్దిశంనృపఇయాత్స్వరు హూతదిగ్భైరేవం ప్రదక్షిణగతావిదిశోభకృత్యే। ఆవశ్యకేపిపరిఘంప్రవిలంఘ్యగచ్ఛేచ్ఛూలం విహాయయదిదిక్తనుశుద్ధిరస్తి॥

తా॥ తూర్పుకు చెప్పబడిన నక్షత్రములందు ఆగ్నేయమునకును, దక్షిణ నక్షత్రములందు నైరృతికిని, పశ్చిమనక్షత్రములందు వాయువ్యమునకును, ఉత్తరనక్షత్రములందు ఈశాన్యమునకును బోవలెను, అవసరమైనప్పుడు దిగాత్రశుద్ధినిమాత్రము జూచి దిగ్వారశూలలను పరిఘాదండమును విడిచియయినను బోవచ్చును.

## అన్యో విశేషః.

శ్లో॥ మైత్రార్కపుష్యాశ్వినభైర్నిరుక్తా యాత్రాశుభాసర్వదిశాసుతజ్జ్ఞైః। వక్రీగ్రహాఃకేంద్రగతోస్యవర్గోలగ్నేదినంచాస్యగమెనిషిద్ధమ్॥

తా॥ అనూరాధ, హస్త, పుష్య, అశ్వినీనక్షత్రములయందు సర్వదిక్కులకును గ్రమనము జేయవచ్చునని జ్యోతిషులు వచించినారు యాత్రాలగ్నమును ౧. ౪. ౭.

౧౦ స్థానములయందు వక్రించిన గ్రహమున్నను వక్రిగ్రహముయొక్క లగ్ననవాంశలయందును, తద్వర్గమందును, తద్వారమందును, గమనము నిషిద్ధము.

### అయన శూల.

శ్లో॥ సౌమ్యాయనే సూర్యవిధూ తదోత్తరాం ప్రాచీం వ్రజేత్తౌ యది దక్షిణాయనే। ప్రత్యగ్యమాశాం చ తయోర్దివానిశం భిన్నాయనత్వే ధవధోన్యథాభవేత్ ॥

తా॥ సూర్యాచంద్రమసులు ఉత్తరాయణగతులైరేని తూర్పు ఉత్తరదిక్కులకును, దక్షిణాయనగతులైరేని దక్షిణపశ్చిమములకును పోవలయును, ఆసూర్యాచంద్రమసులు భిన్నాయనగతులైరేని సూర్యునకు చెప్పబడిన అయనదిక్కునకు దివమందును, చంద్రునకు చెప్పబడిన అయన దిక్కునకు రాత్రియందును పోవలయును. ఇందుకు విపరీతముగా గమనించెనేని మరణమును పొందును.

### సంముఖ శుక్రదోషము.

శ్లో॥ ఉదేతియస్యాందిశియత్రయాతి గోలభ్రమాద్వాథకకుబ్భసంఘే। త్రిధోచ్యతే సంముఖఏవశుక్రో యత్రోదితస్తాంతు దిశాంన యాయాత్ ॥

తా॥ సంముఖశుక్రుడు మూడువిధములు, ఉదయించిన దిక్కున్ను, దక్షిణగోళ, ఉత్తరగోళములలోనే గోళగతిచేత గమనించుచూ ఆగోళదిక్కున్ను, పూర్వోక్త పరిఘాదండ చక్రస్థనక్షత్ర సప్తకములలో ఏదిక్కునయుండునో ఆదిక్కునకున్ను గమనము చేయగూడదు, శుక్రసాంముఖ్యము ఈమూడు విధములు, ఇందులో ముఖ్యముగా శుక్రోదయదిక్కు విడువ తగినది.

### శుక్రవక్రాస్త నీచదోషము సాపవాదము.

శ్లో॥ వక్రాస్తనీచోపగతే భృగోస్సుతే రాజావ్రజన్యాతివశంహి విద్విషాం। బుధోనుకూలోదితత్రిసంచరన్ రిపూన్జయేన్నైవ జయఃప్రతీందుజే॥

తా॥ శుక్రుడు వక్రించియుండగాగాని, అస్తమించియుండగాగాని, నీచంగతుడైయుండగాగాని, సన్నద్ధుడై వెళ్ళిన రాజు యుద్ధములో పరాజితుడయి శత్రువుల



స్వాధీనమగును, అప్పుడు బుధుడు పృష్ఠగతుడయి యుండెనేని శత్రువులను తానే జయించును లేక కుజ బుధులుగూడా సంముఖముగా నుండిరేని జయమును పొందడు.

### ప్రతిశుక్రదోషము సాపవాదము.

శ్లో॥ యావచ్చంద్రఃపూషభాత్కృత్తికాద్యపాదే శుక్రోంధోనదుష్టోగదత్తే । మధ్యేమార్గంభార్గవాస్తేపి రాజా తావత్తిష్ఠేత్సంముఖత్వేపితస్య ॥

తా॥ చంద్రుడు రేవతి మొదలు కృత్తికా ప్రథమచరణమందెంత వరకుండునో అంతకాలము శుక్రుడు అంధుడౌను, ఈఅంధుడు అగ్రిదక్షిణ యానములకు దుష్టుడుగాడు దీర్ఘయాత్రకుబోవు సమయాన మార్గమందు శుక్రుడస్తమించెనేని ఉదయపర్యంతము మార్గమధ్యమునుండి శుభముహూర్తమందు ఇష్టదిక్కునకు పోవలయును, అపిశబ్దమువలన మార్గమధ్యమందు బుధుడు సంముఖుడైనయెడల బుధుడుఅస్తమించి ఉదయంగతుడగు వరకు ప్రయాణము జేయగూడదని తాత్పర్యము సిద్ధమగుచున్నది మార్గమధ్యను శుక్రోదయ నిరీక్షణచేసినంతలో నాశుక్రుడు పృష్ఠగతుడయిన సంపూర్ణఫలమె లేక సముఖుడయినను పోవచ్చును ఫలాల్పతగలుగునుగాని దోషములేదు.

### గమన నిషిద్ధలగ్నములు.

శ్లో॥ కుంభకుంభాంశకౌత్యాజ్యౌ సర్వదాగమనేబుధైః। తత్రప్రయాతుర్నృపతే రర్థనాశఃపదేపదే॥

తా॥ యాత్రయందు కుంభలగ్నమును, కుంభనవాంశయును, ముఖ్యముగా విడువ తగినవి. ఆకుంభలగ్న కుంభనవాంశలయందు ప్రయాణము చేయు రాజుకు కాలుదీసి కాలుపెట్టినప్పుడల్లా ధననాశము గలుగును.

శ్లో॥ అథమీనలగ్నఉతవాంశకేచలితస్యవక్రమిహవర్త్మజాయతే। జనిలగ్నజన్మభవతీశుభగ్రహౌభవతస్తదాతదుదయేశుభోగమః॥

తా॥ మీన లగ్నమందుగాని మీననవాంశయందుగాని ప్రయాణము చేసినవానికి మార్గవక్రము గలుగును జన్మలగ్న జన్మరాశిపతులు శుభులైన యెడల ఆజన్మలగ్న, జన్మరాసులయందు ప్రయాణము జేయవచ్చును.

శ్లో॥ జన్మరాశితనుతోష్టమెథవా స్వారిభాచ్చరిపుభె తనుస్థితే। లగ్నగాస్తదధిపాయదా ధవాన్స్యుర్గతం హినృపతెర్మృతిప్రదమ్॥

తా॥ యాత్రాలగ్నము, స్వజన్మలగ్న, జన్మరాసులకు అష్టమలగ్నమైనను, స్వశత్రువుయొక్క జన్మలగ్నముకును జన్మరాసులకును షష్ఠలగ్నమైనను, లేక స్వజన్మ

లగ్న జన్మరాశ్యష్టమాధిపతులును స్వశత్రుజన్మలగ్న జన్మరాశి షష్ఠాధిపతులును యాత్రాలగ్నమందుండినను, ప్రయాణముజేసిన రాజునకు మరణము గలుగును.

### యాత్రా శుభలగ్నములు.

శ్లో॥ లగ్నే చంద్రేవాపివర్గోత్తమస్థే యాత్రాప్రోక్తా వాంఛితార్థైకదాత్రీ। అంభోరాశౌ వాతదంశే ప్రశస్తం నౌకాయానం సర్వసిద్ధిప్రదాయి॥

తా॥ చంద్రుడు లగ్నమందుగాని, వర్గోత్తమాంశలయందుగాని యుండగా యాత్ర ఇష్టార్థప్రదమగును అంభోరాశి (జలచరరాశి) యందుగాని తదంశయందుగాని నౌకాయానము ప్రశస్తము.

శ్లో॥ దిగ్ద్వారభేలగ్నగతే ప్రశస్తా యాత్రార్థదాత్రీ జయకారిణీచ। హానింవినాశంరిపుతోభయంచ కుర్యాత్తథాదిక్ప్రతిలోమలగ్నే॥

తా॥ దిగ్ద్వారలగ్నములయందు దిఙ్నక్షత్రములయందును యాత్ర జయార్థప్రదయగును అట్లుగాక దిక్ప్రతిలోమలగ్నమందైతే హానియు వినాశము శత్రుభయమును గలుగును.

శ్లో॥ రాశిస్స్వజన్మసమయే శుభసంయుతోయోయస్స్వారిభాన్నిధనగోపిచ వేశిసంజ్ఞః। లగ్నోపగస్సగమనేజయదోథ భూపయోగైర్గమో విజయదోమునిభిః ప్రదిష్టః॥

వ్యా॥ స్వజన్మసమయేయో రాశిః శుభగ్రహసంయుతోయః స్వశత్రురాశేరష్టమోయో వేశిసంజ్ఞోయో లగ్నోపగః సరాశిర్గమనేజయప్రదః అథవాజాతకోక్తరాజయోగేషు గమనంజయప్రదమితిమునిభిః కథితం.

తా॥ శుభగ్రహయుతమైన స్వజన్మరాశియు శత్రురాశికి అష్టమరాశియు వేసిరాశియు లగ్నోపగమమును యాత్రకుమంచివి అథవా జాతకోక్త రాజయోగము లందైనను గమనము శుభప్రదము.

### దిగధిపతులు.

శ్లో॥ సూర్యస్సితోభూమిసుతోథరాహుశ్శనిశ్శశీజ్ఞశ్చ బృహస్పతిశ్చ। ప్రాచ్యాదితోదిక్షు విదిక్షుచాపిదిశామధీశాః క్రమతః ప్రదిష్టాః॥

వ్యా॥ ప్రాచ్యాస్సూర్యః ఆగ్నేయ్యాశ్శుక్రః అవాచ్యాఅంగారకః నైఋత్యారాహుః ప్రతీచ్యాశ్శనిః వాయవ్యాశ్చంద్రః ఉదీచ్యాబుధః ఐశాన్యాగురుశ్చ దిగధిపతయః భవంతి.

తా॥ తూర్పునకు సూర్యుడు, ఆగ్నేయమునకు శుక్రుడు దక్షిణమునకు అంగారకుడు, నైఋతికి రాహువు, పశ్చిమానకు శని, వాయువ్యమునకు చంద్రుడు, ఉత్తరమునకు బుధుడు ఈశాన్యమునకు గురువును అధిపతులు.

### దిక్ప్రతికథన ప్రయోజనము.

శ్లో॥ కేంద్రేదిగధీశేగచ్ఛేదవనీశః। లాలాటినితస్మిన్నేయాదరిసేనామ్॥

తా॥ యాత్రాలగ్నమునకు ౧. ౪. ౭. ౧౦ స్థానములయందు దిగధిపతులుండగా యాత్రచేయవలయును ఆదిక్పతి లాలాటికమందు శత్రువు మీదికి పోగూడదు.

### లాలాటిక యోగములు.

శ్లో॥ ప్రాచ్యాదౌతరణిస్తనౌ భృగుసుతోలాభవ్యయే భూసుతః కర్మస్థోథతమోన వాష్టమగృహేసౌరిస్తథాస్తమే। చంద్రశ్శత్రుగృహాత్మజేపిచబుధః పాతాళగోగీష్పతిర్విత్తభ్రాతృగృహేవిలగ్నసదనాల్లాలాటికాః కీర్తితాః॥

తా॥ యాత్రాలగ్నమందు రవియుండెనేని తూర్పునకును, ౧౧- ౧౨ స్థానముల శుక్రుడుండెనేని ఆగ్నేయమునకు ౧౦ స్థానమందు అంగారకుడుండెనేని దక్షిణమునకును ౮- ౯ స్థానముల రాహువుండెనేని నైఋతిదిక్కునకును, ౭ స్థానమందు శనియుండెనేని పశ్చిమమునకును, ౫- ౬ స్థానముల చంద్రుడుండెనేని వాయవ్యమునకును, ౪ స్థానమందు బుధుడుండెనేని ఉత్తరమునకును, ౨- ౩ స్థానముల బృహస్పతి యుండెనేని ఈశానదిక్కునకును లాలాటికయోగములు.

## లాలాటిక చక్రము.

తూ

గు 3 ర 1

శు 11

పుట భేదనం

## వర్యుషిత యాత్రాయోగ చతుష్టయమ్.

శ్లో॥ మృగగత్వాశివస్థిత్వా దితౌగచ్ఛన్ జయేద్రిపూన్। మైత్రే ప్రస్థాయ శాక్రేహిస్థిత్వా మూలేవ్రజం స్తథా। ప్రస్థాయ హస్తేనిలత్వాష్ట్ర ధిష్ణ్యే స్థిత్వాజయార్థీ ప్రవసేద్ద్విదైవె। వస్వంత్యపుష్యేనిజసీమ్నిచైక రాత్రోషితః క్ష్మాంలభ తేవనీశః॥

తా॥ 1 మృగశీర్ష నక్షత్రమందు తన ఇంటినుంచి బయలుదేరి ఆర్ద్రయందు మరివకయింట్లోయుండి పునర్వసులో గ్రామాంతరము వెళ్ళినను, 2 అనూరాధలో బయలుదేరి జ్యేష్ఠయందు నిలిచి మూలలో వెళ్ళినను, 3 హస్తలో బయలుదేరి చిత్త స్వాతులలో నిలిచి విశాఖలో వెళ్ళినను, శత్రువులను జయించును, అట్లుగానె 4 ధనిష్ఠ రేవతీ పుష్యములలో బయలుదేరి తన పొలిమేరలో నొకరాత్రియుండి తరువాత వెళ్ళిన రాజు భూలాభమును పొందును.

## సమయ బలము.

శ్లో॥ ఉషఃకాలోవినాపూర్వాం గోధూళిఃపశ్చిమాంవినా। వినో త్తరాంనిశీథస్స్యాద్యానె యామ్యాంవినాభిజిత్॥



తా॥ తూర్పుగాక మిగిలిన దిక్కులకు ఉషఃకాలము మంచిది పశ్చిమముగాక మిగిలిన దిక్కులకు గోధూళి మంచిది. ఉత్తరదిక్కుగాక మిగిలిన దిక్కులకు అర్ధరాత్రి మంచిది, దక్షిణముగాక మిగిలిన దిక్కులకు అభిజిత్ మంచిది.

## లగ్నాది ద్వాదశభావ సంజ్ఞలు.

శ్లో॥ లగ్నాద్భావాః క్రమాద్దేహ కోశధానుష్కవాహనం। మంత్రోరిమార్గ ఆయుశ్చ హృద్వ్యాపారాగమవ్యయాః॥

తా॥ 1 దేహము, 2 ధనము, 3 ధానుష్కము, 4 వాహనము, 5 మంత్రము, 6 అరి, 7 మార్గము, 8 ఆయుస్సు, 9 హృదయము, 10 వ్యాపారము, 11 లాభము, 12 వ్యయము, ఇవి లగ్నాది ద్వాదశభావ నామములు.

## గ్రహ బలము.

శ్లో॥ కేంద్రకోణెసౌమ్యఖేటాః శుభాస్స్యుర్వ్యానెపాపాస్త్రిష్వాయ షష్ఠేషుచంద్రః। నేష్టోలగ్నాంత్యారిరంధ్రే శనిః ఖేస్తేశుక్రోలగ్నేట్ నాగాంత్యారిరంధ్రే॥

తా॥ యాత్రాలగ్నమునకు 1. 4. 5. 7. 9. 10 స్థానములనున్న శుభులును 3. 6. 11 స్థానములనున్న పాపగ్రహములును 1. 12. 6. 8. గాక మిగిలిన స్థానములనున్న చంద్రుడును 10 గాక మిగిలిన స్థానములనున్న శనియును, 7 గాక మిగిలిన స్థానములనున్న శుక్రుడును, 6. 7. 8. 12 గాక మిగిలిన స్థానములనున్న లగ్నేశుడును, శుభఫలప్రదులు.

## వర్ణభేదముచేత యాత్రాబలములు.

శ్లో॥ యోగాత్సిద్ధిర్ధరణిపతీనా మృక్షగుణైరపిభూదేవానాం। చౌరాణామపిశకునైరుక్తా భవతిముహూర్తైరపిమనుజానామ్॥

తా॥ యాత్రయందు రాజులకు వక్ష్యమాణయోగములును బ్రాహ్మణులకు నక్షత్రగుణములును, దొంగలకు శకునములును, అన్యజనులకు ముహూర్తములును శుభంకరములు.

## యాత్రా యోగములు.

శ్లో॥ సహజెరవిర్దశమగశ్చంద్రః మాశ్చనిమంగళౌరిపుగౌ హెసిత

స్మృతే । హిబుకే బుధో౽గురురపి హి లగ్నగ స్స్వజయత్యరీన్ప్రచలితో౽ చిరాన్న్రవః॥

తా॥ యాత్రాలగ్నమునకు క్రమముగా 3. ౧౦ స్థానముల రవి చంద్రులును ౬ వ స్థానమందు శని కుజులును, ౫. ౪. ౧ స్థానముల క్రమముగా శుక్ర బుధ గురువులును యుండగా ప్రయాణము చేసిన రాజు శీఘ్రకాలములోనె శత్రువులను జయించును.

శ్లో॥ భ్రాతరి సౌరిర్భూమిసుతో వైరిణి లగ్నే దేవగురుః। ఆయగతే ర్కశ్శత్రుజయశ్చే దనుకూలో దైత్యగురుః॥

తా॥ ఈముందు వ్రాయబోవు యంకెలను స్థానములనుగా తెలుసికొనవలెను. యాత్రాలగ్నమునకు 3 శని ౬ అంగారకుడు, ౧ గురు, ౧౧ రవులుండగా శుక్రుడు అనుకూలుండై (పృష్ఠగతుడై) యుండెనేని శత్రువులను జయించును.

శ్లో॥ తనౌ జీవ ఇందుర్మృతౌ వైరిగోర్కః । ప్రయాతో మహీంద్రో జయత్యేవ శత్రూన్॥

తా॥ ౧ గురు, ౮ చంద్ర, ౬ సూర్యులుండిరేని శత్రువులను జయించును.

శ్లో॥ లగ్నగతస్స్యాద్దేవపురోధాః । లాభధనస్థైశ్శేషనభోగైః॥

తా॥ ౧ గురు, ౧౧. ౨ అన్యగ్రహములుండిరేని శత్రువులను జయించును.

శ్లో॥ ద్యూనే చంద్రే సముదయగేర్కే జీవశుక్రే విది ధనసంస్థే । ఈదృగ్యోగే చలతి నరేశో జేతా శత్రూన్ గరుడ ఇవాహీన్॥

తా॥ ౭ చంద్ర, ౧ రవి, ౨ బుధ గురు శుక్రులునుయుండగా వెళ్లినరాజు సర్పములను, సుపర్ణుడువలె శత్రువులను యమగృహమునకు పంపును.

శ్లో॥ విత్తగతశ్శశిపుత్రో భ్రాతరి వాసరనాథః । లగ్నగతో భూపుత్రస్స్యాశ్శలభా ఇవ సర్వే॥

తా॥ ౨ బుధ, 3 రవి, ౧ అంగారకులుండిరేని అగ్నిలోబడిన మిడతలువలె శత్రువులందరు నశింతురు.

శ్లో॥ ఉదయే రవిర్యది సౌరి రరిగశ్శశీ దశమేపి । వసుధాపతిర్యది యాతి రిపువాహినీ వశమేతి॥

తా॥ ౧ రవి, ౬ శని, ౧౦ చంద్రులుండగా వెళ్ళినరాజు శత్రుసేనను తనస్వాధీనము చేసుకొనును.



శ్లో॥ తనౌ శనికుజౌ రవిర్దశమభే బుధో భృగుసుతోపి లాభదశమే। త్రిలాభరిపుభేషు భూసుతశనీగురుజ్ఞభృగుజా స్తథా బలయుతాః॥

తా॥ ౧ శని కుజ, ౧౦ రవి, ౧౦. ౧౧ బుధశుక్రులును, 3. ౬. ౧౧ అంగారక, శని, గురు, బుధ, శుక్రులును యుండిరేని శత్రువులను జయించును.

శ్లో॥ సముదయగే విబుధగురౌ మదనగతే హిమకిరణే । హిబుకగతౌ బుధభృగుజౌ సహజగతాః ఖలఖచరాః॥

తా॥ ౧ గురువు, ౭ చంద్రుడు, ౪ బుధశుక్రులు, 3 పాపగ్రహములుండిరేని శత్రుజయమును పొందును.

శ్లో॥ త్రిదశగురుస్తనుగో మదనే హిమకిరణో రవిరాయగతః। సితశశిజావపి కర్మగతౌ రవిసితభూమిసుతాస్సహజే॥

తా॥ ౧ గురువు, ౭ చంద్రుడు, ౧౧ రవియు, ౧౦ బుధ శుక్రులు, 3 రవి శుక్రకుజులునుయుండిరేని వాయువు తూలజాలమునువలె శత్రుజాలమును, బారదోలును.

శ్లో॥ దేవగురౌ హి శశిని తనుస్థే వాసరనాథే రిపుభవనస్థే । పంచమగేహే హిమకరపుత్రే కర్మణి సౌరిస్సుహృది సితశ్చ॥

తా॥ గురువుగాని, చంద్రుడుగాని ౧ నుండగా ౬ రవియు, ౫ బుధుడు, ౧౦ శనియు, ౪ శుక్రుడును యుండిరేని యాత్రచేసిన రాజునకు జయము గలుగును.

శ్లో॥ హిమకిరణసుతో బలీ చేత్తనౌ త్రిదశపతిగురుర్హి కేంద్రస్థితః। వ్యయగృహసహజారిధర్మస్థితో యదిచ భవతి నిర్బలశ్చంద్రమాః॥

తా॥ బలవంతుడైన బుధుడు 1 వ గృహమందును, గురువు 1. 4. 7. 10 వ గృహములనుండగా బలహీనుడైన చంద్రుడు 12. 3. 6. 10 నున్న శత్రుజయము గలుగును.

శ్లో॥ అశుభఖగై రనవాష్టమదస్థైర్హిబుక సహోదరలాభ గృహస్థః । కవిరిహ కేంద్రగ గీష్పతిదృష్టో వసుచయలాభకరః ఖలు యోగః॥

తా॥ 7. 8. 9 గాక మిగిలిన గృహములయందు పాపగ్రహములుండగా శుక్రుడు, 3. 4. 11 గృహములనుండి 1. 4. 7. 10 గృహములనున్న గురువుచేత చూడబడుచుండెనేని ధనలాభము గలుగును.

శ్లో॥ రిపులగ్నకర్మహిబుకేశశిజే పరివీక్షితే శుభనభోగ[illegible]ైః॥ వ్యయలగ్నమన్మథగృహేషు జయః పరివర్జితే ష్వశుభనా[illegible]రైః॥

తా॥ బుధుడు 1. 4. 6. 10 లో నుండి శుభగ్రహములచేత చూడబడుచుండగా 12. 1. 7 గాక మిగిలిన స్థానముల పాపులుండిరేని జయము.

శ్లో॥ లగ్నేయదిజీవః పాపా యదిలాభేకర్మణ్యపివాచేద్రాజ్యాధిగమస్స్యాత్। ద్యూనేబుధశుక్రౌచంద్రోహిబుకేవాతద్వత్ఫలముక్తం సర్వైర్మునివర్యైః॥

తా॥ గురువు 1 పాపులు, 10. 11 నున్న రాజ్యలాభము గలుగును, బుధశుక్రులు 7 చంద్రుడు, 4 నున్నను పూర్వోక్తఫలమేను.

శ్లో॥ రిపుతనునిధనేశుక్రజీవేందవోహ్యథబుధభృగుజౌతుర్యగేహేసితౌ। మదనభవనగశ్చంద్రమావాం బుగశ్శశిసుత భృగుజాంతగతశ్చంద్రమాః॥

తా॥ శుక్రుడు 6 గురువు 1 చంద్రుడు 8 నున్న జయములేక బుధశుక్రులు 4 నున్న చంద్రుడు 7 నున్నను జయంలేక చంద్రుడు 4 నుండి బుధశుక్రాంతగతుడైనచో జయము గలుగును.

శ్లో॥ సితజీవభౌమబుధభాను తనూజాస్తనుమన్మథా రిహిబుకత్రిగృహేచేత్ । క్రమతోరిసోదరఖశాత్రవహోరా హిబుకాయుగైగురుదినేఖిలఖేటైః॥

తా॥ శుక్రుడు ౧ గురువు 7 కుజుడు 6 బుధుడు 4 శని 3 నున్న రాజునకు జయము, గురువారమందు రవి 6 చంద్రుడు 3 కుజుడు 10 బుధుడు 6 గురువు 1 శుక్రుడు 4 శని 11 నున్నను ఇదియే ఫలము.

శ్లో॥ సహజేకుజోనిధనగశ్చ భాగవోమదనేబుధోరవి రరాతనా గురుః। అథ చేత్సుర్యరిజ్యసితభానవో జలత్రిగతాహిసౌరిరుధిరౌరిపుస్థౌ॥

తా॥ అంగారకుడు 3 శుక్రుడు 8 బుధుడు 7 రవి 6 గురువు 1 నున్న జయము, లేక గురువు శుక్రుడు సూర్యుడు 3. 4 నున్న శని, కుజులు 6 నున్న యున్నజయము.

శ్లో॥ ఏకోఙ్గేజ్యసితేషుపంచమతపఃకేంద్రేషు యోగస్తథా ద్వౌచేత్త్ర్యధియోగఏషుసకలా యోగాధియోగస్స్మృతః। యోగేక్షేమమథాధియోగ గమనేక్షేమంరిపూణాంవధం చాథోక్షేమమథోపనీశ్చ లభతే యోగాధియోగేవ్రజేత్ ।

తా॥ బుధ గురు శుక్రులలో నొకడు 1. 4. 5. 7. 9. 10 గృహములలో నుండెనేని ఇది యోగమనంబడును. ఇద్దరుండిరేని అధియోగమనబడును, మువ్వురు



నుండిరేని యోగాధియోగమనబడును ఇందులో యోగమందు ప్రయాణముచేసెనేని క్షేమమును అధియోగమందు క్షేమమునున్ను శత్రువధయును, యోగాధియోగమందు క్షేమమును శత్రువధయను శత్రురాజ్యప్రాప్తినిన్ని పొందును.

విజయ దశమీ.

శ్లో॥ ఇషమాససితాదశమీవిజయా శుభకర్మసుసిద్ధికరీకథితా। శ్రవణర్క్షయుతాసుతరాం శుభదానృపతేస్తు గమేజయసిద్ధికరీ॥

తా॥ అశ్వని శుక్లదశమి విజయ దశమి యనబడును ఇది సకల శుభకర్మలకు సిద్ధికరి ఇది శ్రవణనక్షత్రయుతమైన మిక్కిలి శుభప్రద, రాజు దీనియందు గమనము చేసెనేని జయమును పొందును.

శకునములు.

శ్లో॥ చేతోనిమిత్తశకునైః రతిసుప్రశస్తైర్జ్ఞాత్వా విలగ్నబలముర్వ్యధిపః ప్రయాతి । సిద్ధిర్భవేదథపునశ్శకునాదితోపిచేతో విశుద్ధిరధికా నచతాంవినేయాత్ ॥

తా॥ శుభకరములైన శకునములయందును, చేతఃప్రసాదమందును లగ్నబలమును విచారించి గమనము చేసిన కార్యసిద్ధి అగును, శకునములకంటె మనఃప్రసాదము ఎక్కువది ఆమనశ్శుద్ధిలేనిది గమనము జేయగూడదు.

శ్లో॥ వ్రతబంధనదైవతప్రతిష్ఠా కరపీడోత్సవ సూతకాసమాప్తౌ। నకదాపిచలేదకాల విద్యుద్ఘనవర్షా తుహినేపిసప్తరాత్రమ్॥

తా॥ ఉపనయన దేవప్రతిష్ఠ వివాహఉత్సవ ఆశౌచములలో పయనము చేయరాదు, ఉక్తకాల పరిమిత్యనంతరమందు చేయవచ్చును అకాల సంభవ విద్యుత్ గర్జిత వర్షహిమములకు ఏడుదినములలోగా పయనము చేయరాదు అనంతరము జేయవచ్చును.

ఏకదినసాధ్య గమనప్రవేశములందు విశేషము.

శ్లో॥ మహీపతేరేకదినే పురాత్పురేయదాభవేతాం గమనప్రవేశౌ । భవారశూలప్రతిశుక్రయోగినీ ర్విచారయేన్నైవదాపిపండితః॥

తా॥ రాజునకు ఒక దినమందె స్వనగరమునుంచి గమనమును గమ్యస్థానప్రవేశమును సంభవించినయడల అట్టియాత్రకు నక్షత్రవారశూల ప్రతి శుక్ర యోగినీదోషాది విచారముతో పనిలేదు, దినశుద్ధిమాత్రము చాలును.

శ్లో॥ యద్యేకస్మిన్ దివసే మహీపతేర్నిర్గమప్రవేశౌ స్తః। తర్హి విచార్యస్సుధియా ప్రవేశకాలో న యాత్రికస్తత్ర॥

వ్యా॥ రాజ్ఞ ఏకస్మిన్నేవ దివసే స్వనగరాద్గమనం గమ్యస్థానప్రవేశశ్చ భవేత్ తాం యది తర్హి యాత్రా ముహూర్తః ప్రవేశముహూర్తశ్చ న విచార్యః॥

తా॥ రాజునకు యొక దినమందే ప్రయాణ ప్రవేశములు సంభవించెనేని ప్రయాణ ప్రవేశ ముహూర్త విచారముతో అవసరము లేదు.

## ప్రయాణాత్ నవదినే ప్రవేశదోషః.

శ్లో॥ ప్రవేశాన్నిర్గమం తస్మాత్ప్రవేశం నవమే తిథౌ। నక్షత్రేఽపి తథా వారే నైవ కుర్యాత్కదాచన॥

తా॥ గృహప్రవేశ ప్రభృతి నవమ తిథౌ నవమ నక్షత్రే నవమ వారే చ పునర్గమనం న కార్యం గమనదినమారభ్య నవమదినే పునః ప్రవేశశ్చ న కార్యః॥ ప్రవేశించిన 9 వ రోజున తిరిగి బయలుదేరగూడదు బయలుదేరిన 9 వ రోజున తిరిగి ప్రవేశించగూడదు.

## గమనవిధి.

శ్లో॥ అగ్నిం హుత్వా దేవతాం పూజయిత్వా నత్వా విప్రానర్చయిత్వా దిగీశం। దత్వా దానం బ్రాహ్మణేభ్యో దిగీశం ధ్యాత్వా చిత్తే భూమిపాలోఽధిగచ్ఛేత్॥

తా॥ రాజు ముందుగా అగ్నియందు హోమము జేసి ఇష్టదేవతను పూజించి బ్రాహ్మణులను నమస్కరించి గమ్యదిక్పతిని పూజించి బ్రాహ్మణులకు భూరిదానములు చేసి మనోరాజీవమందు గమ్యదిక్పతిని ధ్యానించి బయలుదేరవలెను.

## నక్షత్రదోహదములు.

శ్లో॥ కుల్మాషాంస్తిలతండులానపి తథా మాషాంశ్చ గవ్యం దధి త్వాజ్యం దుగ్ధమథైణమాంసమపరం తస్యైవ రక్తం తథా। తద్వత్పాయసమేవ చాషపలలం మార్గం చ శాశం తథా షాష్టిక్యం చ ప్రియంగ్వపూపమథవా చిత్రాండజాన్ సత్ఫలమ్ ॥ కౌర్మం సారికగోధికం చ పలలం శల్యం హవిష్యం హయాద్వృషే స్యాత్ కృసరాన్నముద్గమపి వా పిష్టం



యవానాం తథా। మత్స్యాన్నం ఖలు చిత్రితాన్నమథవా దధ్యన్నమేవం క్రమాత్ భక్ష్యాభక్ష్యమిదం విచార్య మతిమాన్ భక్షేత్తథా లోకయేత్॥

తా॥ అశ్విన్యాది నక్షత్రములయందు క్రమముగా నీయన్నములను భక్షించి ప్రయాణము చేసిన నక్షత్రోక్తదోషములు నశించును దేశకులాద్యాచారమునుబట్టి ఇందులో భక్షించదగినవాటిని భక్షించవలెను అభక్ష్యములను దర్శించవలెను అన్నములు 1 కుల్మాషాన్నము, 2 తిలమిశ్రితండులములు, 3 మాషములు, 4 ఆవు పెరుగు, 5 ఆవు నెయ్యి, 6 ఆవుపాలు, 7 హరిణమాంసము, 8 హరిణరక్తము, 9 పరమాన్నము 10 పాలపక్షిమాంసము, 11 మృగమాంసము, 12 కుందేటిమాంసము, 13 షాష్టిక్యము (పిండి) 14 ప్రేంఖణ ఫలములు, 15 అపూపములు, 16 చిత్రపక్షులు, 17 ఉత్తమఫలములు, 18 తాబేటిమాంసము, 19 గోరువంకమాంసము, 20 ఉడుముమాంసము, 21 ఏదుపందిమాంసము, 22 హవిష్యము, 23 కుసరాన్నము, 24 ముద్గము (పెసలు) 25 బియ్యంపిండి, 26 మత్స్యమాంస సహిత భోజనము, 27 అనేక పక్వాన్నములు, 28 దధ్యోదనము.

## దిగ్దోహదములు.

శ్లో॥ ఆజ్యం తిలౌదనం మత్స్యం పయశ్చాపి యథాక్రమం। భక్షయేద్దోహదం దిశ్యమాశాం పూర్వాదికాం వ్రజేత్॥

తా॥ తూర్పుకు నెయ్యిని, దక్షిణముకు తిలాన్నమును, పశ్చిమముకు మత్స్యములను, ఉత్తరమునకు పాలనున్ను, భక్షించి వెళ్ళిన దిగ్దోషములు నశించును.

## వారదోహదములు.

శ్లో॥ రసాలాం పాయసం కాంజికం శృతం దుగ్ధం తథా దధి। పయో శ్రితం తిలాన్నం చ భక్షయేద్వారదోహదమ్॥

తా॥ ఆదివారమందు-రసాలమును (దధిశర్కరాదికృతలేహ్యమును) శ్లో॥ రసాలా మార్జికా కాదూర్వాజిహ్వా నాత్విక్షు చాతయోరితి నానార్థరత్నమాలా ॥ సోమవారమందు పరమాన్నమును, మంగళవారమందు కాంజికమును, బుధవారమందు కాచిన పాలును, గురువారమందు పెరుగును, శుక్రవారమందు కాచినపాలు శనివారమందు తిలాన్నమును భక్షించి పోవలయును అట్లైనవారదోషము నశించును.

## తిథిదోహదములు.

శ్లో॥ పక్షాదితోఽర్కదళతండులవారి సర్పిశ్శ్రాణాహవిష్యమపి హేమ

జలంత్వపూపం । భుక్త్వా ప్రజేద్రుచకమంబుచ ధేనుమూత్రం యావా న్నపాయసగుడాన సృగన్నముద్గాన్ ॥

తా॥ పాడ్యమి మొదలు క్రమముగా ఈవస్తువులను భక్షించి గమనము చేయవలెను అట్లైన తిథిదోషములేదు. 1 అర్కపత్రి, 2 నువులు, 3 నెయ్యి, 4 యవాగులు, 5 హవిష్యము, 6 సువర్ణోదకము, 7 అపూపములు, 8 రుచకఫలములు, 9 ఉదకము, 10 గోమూత్రము, 11 యవాన్నము, 12 పాయసము, 13 బెల్లము, 14 నెత్తురు 15 ముద్గాన్నము,

## గమనవిధి.

శ్లో॥ ఉద్ధృత్య ప్రథమతఏవ దక్షిణాంఘ్రిం ద్వాత్రింశత్పదమభిగమ్య దిశ్యయానం। ఆరోహేత్తిలఘృతహేమ తామ్రపాత్రం దత్వాదా గణకవరాయచప్రగచ్ఛేత్ ॥

తా॥ రాజు గమనసమయమందు ముందుగా కుడికాలు ఎత్తివుంచి 32 అడుగులు నడిచి వక్ష్యమాణదిగ్యానము నెక్కి జ్యోతిష్కునకు తామ్రపాత్రలో నువ్వులు నెయ్యి బంగారము వుంచి దానముచేసి నడువవలెను.

## దిగ్యానములు.

శ్లో॥ ప్రాచ్యాంగచ్ఛేద్గజేనైవ దక్షిణస్యాం రథేనచ । దిశిప్రతీచ్యామశ్వేన తథోదీచ్యాం నరైర్నృపః॥

తా॥ రాజు తూర్పునకు గజమును నెక్కిన్ని, దక్షిణమునకు రథము నెక్కిన్ని, పశ్చిమమునకు గుఱ్ఱము నెక్కియున్న ఉత్తరమునకు నరవాహనము నెక్కియున్న పోవలయును.

## నిర్గమ స్థానములు.

శ్లో॥ దేవగృహాద్వాగురుసదనాద్వాస్వగృహాన్ముఖ్యకళత్రగృహాద్వా। ప్రాశ్యహవిష్యంవిప్రానుమతఃపశ్యన్ శృణ్వన్ మంగళమేయాత్ ॥

తా॥ దేవతాగృహమునుంచిగాని గురువు ఇంటినుంచిగాని తనమందిరమునుంచిగాని ప్రధానభార్యాసదనమునుంచిగాని యజ్ఞశిష్టహవిష్యమును భుజించి బ్రాహ్మణులవలన గమనవిషయమై అనుమతినిపొంది మంగళద్రవ్యములను జూచుచు మంగళవాద్యములను వినుచు వెళ్ళవలెను.

## గమన విలంబె ప్రస్థాన వస్తూని.

శ్లో॥ కార్యాద్వైరిహగమనస్యచేద్విలంబోభూదేవాదిభిరుపవీత



మాయుధంవా । క్షౌద్రంచామలఫలమాశుచాలనీయం సర్వేషాంభవతియదేవహృత్ప్రియంవా॥

తా॥ యాత్రాముహూర్తమందు గమనము చేయుటకు ఇతరకార్యములచే వీలుపడనంతట్లో బ్రాహ్మణులు యజ్ఞోపవీతమును రాజులు ఆయుధమును వైశ్యులు తేనెయును శూద్రులు ఫలములను బయలుదేరదీయవలయును లేక అందరు తమకిష్టమైన వస్తువును బయలుదేర దీయవలయును.

## నిర్గమనమ్,

శ్లో॥ గేహాద్గేహాంతరమపిగమస్తద్ధి యాత్రేతిగర్గస్సీమ్నస్సీమాంతరమపి భృగుర్బాణవిక్షేపమాత్రం । ప్రస్థానంస్యాదితికథయతేథోభరద్వాజఏవంయాత్రాకార్యాబహిరపి పురాత్స్యాద్వసిష్ఠోబ్రవీతి॥

తా॥ తన ఇంటినుంచి మరివక గృహమునకు వెళ్ళుట యాత్రయని గర్గుడు చెప్పుతున్నాడు. తన పొలిమేర మొదలు మరివక పొలిమేర వరకు నడుచుట యాత్రయని భృగుడు వక్కాణించుచున్నాడు. శూరునిచేత విడువబడిన బాణము పోయినంత దూరము నడుచుట యాత్రయని భరద్వాజుడు నుడువుతున్నాడు, తనపట్టణమునుంచి బయటకు పోవుట యాత్రయని వసిష్ఠుడు వచించుచున్నాడు.

## మతాంతర నిర్గమనమ్,

శ్లో॥ ప్రస్థానమత్రధనుషాంహి శతానిపంచకేచిచ్ఛతద్వయముశంతిదశైవచాన్యే । సంప్రస్థితోయఇహమందిరతః ప్రయాతో గంతవ్యదిక్షు తదపిప్రియతేన కార్యమ్ ॥

తా॥ తనయింటినుంచి ౫౦౦ ధనుస్సుల దూరము పోవుట ప్రస్థానమనికొందరు చెప్పుతున్నారు. ౨౦౦ ధనుస్సుల దూరగమనమని మరికొందరు వక్కాణించుతున్నారు. ౧౦ ధనుస్సుల దూరగమనమని యింకా కొందరు పలుకుతున్నారు. ధనుస్సు అనగా ౪ మూరలు కార్యవశముచేత దూరము పోవుటకు వీలులేనప్పుడు శుభముహూర్తమందే చెప్పబడిన ప్రకారము స్వయముగానే పోవలయును. వీలులేనియడల పూర్వోక్తప్రస్థాన వస్తువులను బయలుదేరి దీయవలెను. తాను ఏదిక్కునకు పోవదలచియున్నాడో నాదిక్కునకే ప్రస్థానవస్తువులను పంపవలెను. యీప్రస్థానపరి

మూణమంతయు దూరముపోవుటకు వీలులేనప్పుడు ప్రస్తుతము చేయదగినదిగా నెరుంగునది ప్రస్థానమనగా గమనము.

## నిర్గమన దినసంఖ్య.

శ్లో॥ ప్రస్థానభూమిపాలో దశదివసమభివ్యాప్య నైకత్రతిష్ఠేత్సామంతస్సప్తరాత్రం తదితరమనుజఃపంచరాత్రంతథైవ । ఊర్ధ్వంగచ్ఛేచ్ఛుభాహేప్యథగమనదినాత్సప్తరాత్రాణిపూర్వం చాశక్తౌతద్దినే సౌరిపు విజయమనామైథునం నైవకుర్యాత్ ।

తా॥ ప్రస్థానమందు రాజు ౧౦ దినములకు మించి నొకచోట నుండగూడదు సామంతరాజు ౭ రోజులకు మించి నుండగూడదు ఇతరు లందరు ౫ దినములకు మించి యుండగూడదు. ఒకవేళయుండిరేని తిరిగి మంచి ముహూర్తమందు గమనించవలెను. గమనదినముకు ముందు ౭ రోజులనుంచి మైథునమును మానవలెను. భార్యాఋతుస్నాతయయి మానవీలులేనప్పుడు ౧ దినమైనను ముందు మానవలెను.

## నిర్గమనకృత్యం.

శ్లో॥ దుగ్ధంత్యాజ్యం పూర్వమేవత్రిరాత్రం క్షౌరంత్యాజ్యంపంచరాత్రంచపూర్వం । క్షౌద్రంతైలంవాసరేస్మిన్వమిశ్చ త్యాజ్యంయత్నా ద్భూమిపాలేననూనమ్॥

తా॥ యాత్రచేయురాజు పూర్వము ౩ దినములు పాలు త్రాగకూడదు ౫ దినములు క్షౌరము చేయించుకొనగూడదు యాత్రాదినమందు తేనెయు తైలాభ్యంగము ఆరోగ్యము కొరకు వాంతియును జేయగూడదు.

శ్లో॥ భుక్త్వాగచ్ఛతియదిచేత్తైలగుడక్షారపక్వమాంసాని। వినివర్తతేసరుగ్ణస్త్రీద్విజమవమాన్యగచ్ఛతోమరణమ్॥

తా॥ యాత్రాకాలమందు దోహదేతరములైన తైలపక్వ గుడపక్వ క్షారపక్వ మాంసములను భుజించి బయలుదేరినవాడు రోగియై తిరిగివచ్చును స్త్రీలను బ్రాహ్మణులను మనోవాక్కాయములలో దేనిచేతనైనను అవమానించి వెళ్ళినవాడు మార్గమందు మరణమును పొందును తత్తుల్యదశనైనా పొందును.

## అకాలవృష్టి దోషః.

శ్లో॥ యదినస్యాస్సుచతుర్షు పౌషమాసాదిషు వృష్టిర్భవేదకాల



వృష్టిః । పశుమర్త్యపదాంకితానయావద్వసుధాస్యాన్నహితావ దేవదోషః॥

తా॥ పుష్యమాసము మొదలు ౪ మాసములయందు కలిగిన వృష్టి అకాలవృష్టి యనబడును గాని భూమి పశు మనుష్యపద చిహ్నంగానియెడల అకాలవృష్టిదోషము లేదు అనగా పాదచిహ్నములు ఏర్పడెడునంత వర్షమునకు తక్కువ వర్షముకురిసెనేని నది దోషకరముగాదని భావము.

శ్లో॥ అల్పాయాంవృష్టౌ దోషోల్పోభూయస్యాం దోషోభూర్యాజీమూతానాం నిర్ఘోషేవృష్టౌవా జాతాయాంభూపః। సూర్యేందోర్బింబేసౌవర్ణేకృత్వా విప్రేభ్యోదద్యాత్ దుశ్శాకున్యేసాజ్యంస్వర్ణందత్వా గచ్ఛేత్స్వేచ్ఛాభిః॥

తా॥ అకాలవృష్టి స్వల్పమైనదైన దోషము స్వల్పమేను వృష్టిగొప్పదైనదోషముగొప్పదగును గాన యాత్రచేయగూడదు ఆవశ్యకమైన కార్యములనుగూర్చి అకాలవృష్టి మేఘం నిర్ఘోషములయందు గమనము చేయవలసిన యెడల బంగారముతో సూర్యాచంద్ర మసుల ప్రతిమలను జేయించి బ్రాహ్మణులకు దానముచేసి బోవలెను యాత్రయందు దుశ్శకునములు సంభవించిన ఆజ్యసహిత సువర్ణదానముజేసి స్వేచ్ఛగా పోవలయును.

## శుభ శకునములు.

శ్లో॥ విప్రాశ్వేభఫలాన్నదుగ్ధ దధిగోసిద్ధార్థపద్మాంబరం వేశ్యావాద్యమయూరచాషనకులాబద్ధైకపశ్వామిషం । సద్వాక్యంకుసుమేక్షుపూర్ణ కలశచ్ఛత్రాణిమృత్కన్యకా రత్నోష్ణీషసితోక్షమద్య ససుతస్త్రీదీప్తవైశ్వానరాః । ఆదర్శాంజనధౌతవస్త్ర రజకామీనాజ్యసింహాసనం । శావంరోదనవర్జితం ధ్వజమధుచ్ఛాగాస్త్రగోరోచనం। భారద్వాజనృయాన వేదనినదామాంగళ్య గీతాంకుశాదృష్టా స్సత్ఫలదాప్రయాణసమయే రిక్తోఘటస్స్యాన్నుగః ॥

తా॥ బ్రాహ్మణులు అశ్వములు, గజములు, ఫలములు, అన్నము, క్షీరములు, దధి, గోవు, తెల్ల ఆవాలు, పద్మములు, శుభ్రవస్త్రములు, వేశ్య, మృదంగాదివాద్యములు, నెమళ్లు, పాలపక్షి, ముంగిస బద్ధైకపశువు, మాంసము, శుభవాక్యములు, పుష్పములు, చెరుకు, పూర్ణకలశములు, ఛత్రములు, మృత్తికా (శుద్ధగా జేయబడిన

మన్న) కన్య, రత్నములు, తలగుడ్డలు, తెల్లయెద్దు, మద్యము, పుత్రసహితస్త్రీ, దీప్తాగ్ని, అద్దము అంజనము (కాటుక) ధౌతవస్త్రములు, రజకులు, మత్స్యములు నెయ్యి, సింహాసనము, రోదనశూన్యశవము ధ్వజము, తేనె, మేకలు, అస్త్రములు, గోరోచనము, భరద్వాజపక్షి, మనుష్యయానము, వేదధ్వని, మంగళగానము, అంకుశము ఈవస్తువులు ప్రయాణకాలమందు అగ్రమున కనుపించెనేని శుభఫలప్రదములు శూన్యఘటము తనతోకూడా తెచ్చిన శుభము.

## అశుభ శకునములు.

శ్లో॥ వంధ్యాచర్మతుషాస్థిసర్పలవణా గారేంధనక్లీబవిట్ తైలోన్మత్తవసౌషధారిజటిలప్రవ్రాట్తృణవ్యాధితాః । నగ్నాభ్యక్తవిముక్తకేశ పతితవ్యంగక్షుధార్తా అసృక్ స్త్రీపుష్పంసరటస్స్వగేహదహనం మార్జారయుద్ధం క్షుతం ॥ కాషాయీగుడతక్రపంకవిధవాకుబ్జాః కుటుంబె కలిర్వస్త్రాదేస్స్ఖలనంలులాయసమరంకృష్ణానిధాన్యానిచ । కార్పాసంవమనంచ గర్దభరవో దక్షేతిరుగ్గర్భిణీముండార్ద్రాంబరదుర్వచోంధబధిరోదక్యాన దృష్టాశ్శుభాః॥

తా॥ అశుభశకునములను జెప్పుచున్నాడు గొడ్రాలు, చర్మము, ఊక, అస్థి, సర్పము, లవణము, బొగ్గులు, నపుంసకుడు, విష్ట, తైలము, ఉన్మత్తుడు, వస, ఔషధము, శత్రువు, జటిలుడు, సన్యాసి, తృణము, రోగి, దిగంబరుడు, తలంటుకొన్నవాడు, విముక్తకేశుడు, పతితుడు, అంగహీనుడు, ఆకలితోనున్నవాడు, నెత్తురు స్త్రీరజస్సు, తొండ, స్వగృహదహనము, మార్జాలయుద్ధము, తుమ్ము, కాషాయవస్త్రధారి, గుడము, తక్రము (చల్ల) బురద, విధవ, మరుగుజ్జువాడు, కుటుంబకలహము, తనవస్త్రాదులుజారుట, దున్నపోతులయుద్ధము, కృష్ణధాన్యములు, దూది, వమనము, దక్షిణభాగమందు గాడిదకూత, అతిక్రోధము, గర్భిణీస్త్రీ, ముండి, ఆర్ద్రవస్త్రధారి, దుష్టవాక్యములు, అంధులు, బధిరులు, రజస్వల, ఇవి అశుభ శకునములు.

## అన్య శకునములు.

శ్లో॥ గోధాజాహకసూకరాహి శశకానాంకీర్తనం శోభనంనో శబ్దోనపిలోకనంచకపి ఋక్షాణామతోవ్యత్యయః॥ నద్యుత్తారభయప్రవేశసమరే నష్టార్థసంవీక్షణే । వ్యత్యస్తాశ్శకునాన్నృపేక్షణవిధౌ యాత్రోదితాశ్శోభనాః॥



తా॥ ప్రయాణాదులయందు గోధా ఉడుము జాహక (ప్రాణివిశేష) సూకర, సర్ప, శశక (కుందేలు) ములయొక్క నామోచ్చారణము శుభకరము- వీటియొక్క శబ్దముగాని దర్శనముగాని మంచివిగావు- కోతిభల్లూకముల నామోచ్చారణము మంచిదిగాదు వీటిధ్వనిగాని దర్శనముగాని మంచివి, నదీతరణమందును భయమందును, గృహప్రవేశమందును, యుద్ధమందును, నష్టవస్తుదర్శనమందును పూర్వోక్త శుభశకునములు అశుభశకునములగును- అశుభశకునములు శుభకరములు- రాజదర్శనమందు యాత్రోక్త శుభశకునములు శుభకరములు అశుభశకునములు అశుభకరములు.

శ్లో॥ వామాంగేకోకిలావల్లీ పోతకీసూకరీరలా । పింగలాఛుచ్ఛుకాశ్శ్రేష్ఠాశ్శివాః పురుషసంజ్ఞితాః॥

తా॥ కోకిల, బల్లి, కపోతస్త్రీ, సూకరీ, రలాపక్షి, పింగళపక్షి, చుంచు, పురుషనక్కలు, వామాంగమందుండెనేని శుభములు.

శ్లో॥ ఛిక్కరఃపిక్కశోభాస శ్రీకంఠోవానరోరురుః। స్త్రీసంజ్ఞకాః కాకఋక్షశ్వానస్స్యుర్దక్షిణాశ్శుభాః॥

తా॥ ఛిక్కరమృగము, పిక్కకపక్షి, భాసపక్షి, శ్రీకంఠపక్షి, వానరమృగము రురుమృగము, ఇవి స్త్రీలును, కాకము, భల్లూకము, కుక్క, ఇవియును దక్షిణభాగమందున్న శుభము.

శ్లో॥ ప్రదక్షిణగతాశ్శ్రేష్ఠా యాత్రాయాంమృగపక్షిణః । ఓజామృగావ్రజంతోతి ధన్యోవామేఖరస్వనః॥

తా॥ యాత్రయందు మృగములు పక్షులును ప్రదక్షిణముగా వచ్చెనేనిశుభము. విషమసంఖ్యాకమృగములు వామభాగమందుగా వెళ్ళెనేనిశుభము వామమందు రాసభస్వరమును (గాడిదకూత) శుభము.

## అపశకునె కింకార్యమ్,

శ్లో॥ ఆద్యేపశకునేస్థిత్వాప్రాణానేకాదశవ్రజేత్ । ద్వితీయేషోడశప్రాణాం స్తృతీయేనక్వచిద్వ్రజేత్ ॥

తా॥ యాత్రయందు ముందుగా అపశకునము గలిగెనేని ౧౧ శ్వాసలకాలము నిలిచి తదనంతరము శుభశకునమందు గమనము జేయవలెను. మరల రెండుమారు అపశకునమాయెనా ౧౬ షోడశప్రాణపర్యంతము అచ్చటనేయుండి తిరిగి శుభశకునమందు

పోవలయును. తిరిగి మూడవసారి అపశకునము గలిగెనేని ముందును నెంతమాత్రము పోవద్దు. అనగా కార్యావశ్యకతయందు ఒకటి రెండు అపశకునములు గలిగినను కించిత్కాలము అచ్చట నిలిచి తిరిగి శుభశకునమందు పోవలయును. మూడవసారియునట్లె అపశకునము గలిగెనా యెప్పుడును పోవద్దు.

యాత్రానివృత్తౌ గృహప్రవేశః.

శ్లో॥ యాత్రానివృత్తౌ శుభదం ప్రవేశనం మృదుధ్రువైః క్షిప్రచరైః పునర్గమః । ద్విశైనవేదారుణభైస్తథోగ్రభైః స్త్రీగేహపుత్రాత్మవినాశనం క్రమాత్ ॥

తా॥ యాత్రచేసి మళ్ళి ధ్రువ మృదునక్షత్రములయందు స్వగృహప్రవేశము చేయవలెను, క్షిప్ర, చర, నక్షత్రములయందు ప్రవేశమాయెనా తిరిగి గమనము గలుగును. యీప్రవేశము విశాఖానక్షత్రమందైన స్త్రీనాశమును, కృత్తికయందైన గృహనాశమును, దారుణనక్షత్రములయందైన పుత్రనాశమును, ఉగ్రనక్షత్రములయందైన ఆత్మవినాశమును, గలుగును.

యాత్రాయాం వర్జ్యదోషాః.

శ్లో॥ అయనర్క్షమాసతిథికాలవాసరోద్భవశూలసంముఖసితజ్ఞదిక్పాః। భృగువక్రతాదిపరిఘాఖ్యదండకో యువతీరజోవ్యశుచితోత్సవాదికమ్ ॥ మృతపక్షరిక్తరవితర్కసంఖ్యకాస్తిథయశ్చసౌరిరవిభౌమవాసరాః । అపివామపృష్ఠగవిధుస్తథాడలో వసుపంచకాభిజిదథాపి దక్షిణే॥ లగ్నే జన్మర్క్షతన్వోర్మృతిగృహమహితర్క్షాచ్చషష్ఠం తదీశావాలగ్నే కుంభమీనక్షనవలవతనూ చాపిపృష్ఠోదయంచ । పృష్ఠాశామృక్షసంస్థం దశమశనిరథో సప్తమే చాపికావ్యః కేంద్రేవక్రాశ్చవక్రిగ్రహదివస వివాహోక్తదోషాశ్చనేష్టాః॥

తా॥ యాత్రయందు వర్జించతగిన దోషములను చెప్పుతున్నాడు. అయనశూల నక్షత్రశూల, తిథిశూల, వారశూలలును, సంముఖశుక్ర, సంముఖబుధ, సంముఖదిగీశ, దోషములు భృగువక్రత, పరిఘాదండము, మొదలైనవి స్వభార్యారజోదర్శన ఆశౌచ ఉత్సవము మొదలైనవియు మృతపక్షము ౪- ౯- ౧౪- ౧౨- ౬ తిథులును, ౧- ౩- ౭ వారములును వామగతచంద్రుడు అడలము, ధనిష్ఠాపంచకము, అభిజిన్ముహూర్తము, జన్మలగ్నజన్మరాశ్యష్టమలగ్నము, శత్రుజన్మలగ్నజన్మరాశికి షష్ఠలగ్న



ము, తదధిపతులు లగ్నమందుండుట కుంభమీనలగ్ననవాంశలు, పృష్ఠోదయము రాశి దిక్ప్రతిలోమ లగ్నము, దశమ శని, సప్తమశుక్రుడు, కేంద్రవక్రము, వక్రగ్రహవారములును విడువతగినవి. ఈదోషములన్నియు పూర్వమందు విస్తరముగా చెప్పబడినవి. గనుక యిచ్చట తాత్పర్యమంత సంగ్రహముగా వ్రాసితిని. ఇవిగాక వివాహోక్త దోషములును యాత్రయందు వర్జించతగినవి.

ఇతి శ్రీదైవజ్ఞానంత సుతరామసుధీవర విరచితే ముహూర్త చింతామణౌ ఏకాదశం యాత్రాప్రకరణం సమాప్తమ్.

---

గ్రామార్వణము.

శ్లో॥ యద్భం ద్వ్యంకసుతేశదిఙ్మితమసౌ గ్రామశ్శుభో నామభాత్ స్వం వర్గం ద్విగుణం విధాయ పరవర్గాఢ్యం గజైశ్శేషితం । కాకిణ్యస్త్వనయోశ్చ తద్విపరతో యస్యాధికా సోఽర్థదో ద్వారం ద్విజవైశ్యశూద్ర నృపరాశీనాం హితం పూర్వతః॥

తా॥ గృహస్థునకు శ్రౌతస్మార్తకర్మ కరణమావశ్యకము అదిన్ని స్వగృహమందైన ఫలదమగును పరగృహమందైన తత్ఫలము గృహస్వామిదేగాని కర్మకర్తకు లేదు ఇందుకు ప్రమాణము భవిష్యత్పురాణమందు శ్లో॥ పరగేహకృతాస్సర్వాశ్శ్రౌతస్మార్తక్రియాశ్శుభాః। నిష్ఫలాస్స్యుర్యతస్తాసాం భూమీశః ఫలమశ్నుతఇతి॥ కాబట్టి గృహనిర్మాణమావశ్యకము అదిన్ని వాస్తువిధిగా జేయు నెడల చిరస్థాయియు శుభప్రదమునగును అందువలన వాస్తుశాస్త్రకధన మావశ్యకముగాన నదిచెప్పబడుతున్నది, గృహనిర్మాణ కర్తయొక్క నామనక్షత్రరాశికి తాను నివసించబోయె గ్రామ నామనక్షత్రరాశి ౨, ౯, ౫, ౧౧, ౧౦ సంఖ్యలలో నొకటైన శుభము అనగా ఆగ్రామమందు నివసించవచ్చును, ఇంతేకాదు కర్తనామాద్యక్షరమునకు వచ్చిన గరుడాది వర్గసంఖ్యను ద్విగుణంచేసి (౨ చేత హెచ్చించి) గ్రామనామాద్యక్షరమునకైన వర్గసంఖ్యతోకూడి అనగా ద్విగుణిత స్వవర్గయందు గ్రామవర్గసంఖ్యను కలిపి ఎనిమిదిచేత భాగించగా మిగిలిన

శేషము పురుష (నామ) కాకిణులనబడును ఇట్లె గ్రామవర్గసంఖ్యను ద్విగుణంజేసి కర్తృవర్గసంఖ్యతో కలిపి ౮ చేత భాగించగా మిలిగిన శేషము గ్రామకాకిణులనబడును ఇట్లు చేయగా నామకాకిణులకంటె గ్రామకాకిణులు అధికమైన శుభము అనగా నామశేషసంఖ్యకంటె గ్రామశేషసంఖ్య అధికమైనయెడల నాగ్రామమందు నివసించిన ధన ప్రదము ద్వారనిర్ణయమును జెప్పుచున్నాడు తూర్పుబ్రాహ్మణ రాసులకును, దక్షిణము వైశ్యరాసులకును, పశ్చిమము శూద్రరాసులకును, ఉత్తరము క్షత్రియరాసులకును (శ్లో॥ బ్రాహ్మణాదిరాశయ ఉక్తాహ్యూరాసారె ॥ చాపసింహక్రియాభూపాః మీనాళివృషభాద్విజాః। నృయుక్కుంభతులా వైశ్యాశ్శూద్రాస్త్రీ మృగకర్కటా ఇతి॥

శ్లో॥ గోసింహనక్రమిథునంనివసేన్నమధ్యే గ్రామస్యపూర్వకకుభో లిరుషాంగనాశ్చ। కర్కోధనుస్తులభమేషఘటాశ్చ తద్వద్వర్గాస్స్వపంచమపరాబలి నస్స్యరైంద్ర్యాః॥

తా॥ ౨. ౫. ౧౦. ౩ రాసులు గ్రామమధ్యయందు నివసించరాదు తూర్పున ౮ ఆగ్నేయమున ౧౨ దక్షిణమున ౬ నైఋతిన ౪ పశ్చిమమున ౯ వాయవ్యమున ౭ ఉత్తరమున ౧ ఈశాన్యమున ౧౧ రాసులు నివసించగూడదు, ఈరాసులవారి దిక్కులనివసించరాదని భావము ఇట్లెస్వవర్గను అయిదవస్థానమున నివసించగూడదు పూర్వాదిగా అ, క, చ, ట, త, ప, య, శ అను ౮ వర్గలు యిందులో అవర్గకు తవర్గము శత్రుస్థానము సర్వత్ర, స్వవర్గము బలవంతము ౫ వ వర్గము శత్రుస్థానముగాన తత్ర నివాసముగాని ఆదిక్కున ద్వారముగాని ఉంచగూడదు.

## ఇష్టభూమ్యా ఆయామవిస్తారా.

శ్లో॥ ఏకోనితేష్టర్క్షహతాద్వితిథ్యో రూపోనితేష్టాయహతేందు నాగైః। యుక్తాథునైశ్చాపియుతావిభక్తా భూపాశ్విభిశ్శేషమితోహి పిండః। స్వేష్టాయనక్షత్రభవోథదైర్ఘ్య హృతాస్యద్విస్తృతిర్విస్తృత్యాహృచ్ఛదీర్ఘతా॥

తా॥ ఇష్టనక్షత్రసంఖ్యలో ౧ తీసివేసి మిగిలిన సంఖ్యతో ౧౫౨ ను హెచ్చించవలెను తరువాత వక్ష్యమాణ ధూమాద్యాయములలో ఇష్టాయసంఖ్యలో ౧ తీసివేసి మిగిలిన సంఖ్యచేత ౮౧ ని హెచ్చించి ఈమొత్తమును పైమొత్తములో కలిపి అందులో ౧౭ కలిపికూడి ౨౧౬ చేత భాగించగా వచ్చిన శేషము పిండమనబడును దీనికే



కాలామృతమందు పదమనినామము ఇది స్వేష్టాయనక్షత్ర సంభవమైన పిండము ఈపిండమును ఏపెద్దమొత్తముచేత భాగించగా శేషము లేకుండునో ఆపెద్దమొత్తము గృహముకు ఆయామము, ఆలబ్ధము, విశాలము, ఉదాహరణము, ఇష్టనక్షత్రం, రోహిణి ౪ ÷ ౧ ౩ + ౧౫౨ = ౪౫౬ ఇష్టాయం సింహము ౩ ÷ ౧, ౨ + ౮౧ = ౧౬౨ యీ మొత్తమును పైదానితో కలపగా ౬౧౮ దానితో ౧౭ కలపగా ౬౩౫ అగును ఈ ౬౩౫ ను ౨౧౬ చే భాగించగా వచ్చినశేషము ౨౦౩ ఇది పిండము ఈపిండమును ౨౯ చే భాగించిన శేషముండదు వచ్చిన లబ్ధము ౭ ఇదియే విశాలము ౨౯ ఆయామము ఇది మహాగృహము ఇట్లె సర్వత్ర ఊహించునది.

## ద్వార నివేశనము.

శ్లో॥ ఆయాధ్వజోధూమహరిశ్వగోఖరేభధ్వాంక్షకాః పిండఇహాష్టశేషితె। ధ్వజాదికాస్సర్వదిశిధ్వజె ముఖంకార్యం హరౌపూర్వయమోత్తరేతథా। ప్రాచ్యాంవృషె ప్రాగ్యమయోర్గజెథవాపశ్చాదుదక్పూర్వయమేద్విజాదితః॥

తా॥ అష్టశేషితపిండమందు ౧ ధ్వజాయము, ౨ ధూమాయము, ౩ సింహాయము, ౪ శునకాయము, ౫ వృషభాయము, ౬ ఖరాయము, ౭ గజాయము, ౮ కాకాయము ఇందులో ధ్వజాయమందు సర్వదిక్కులకున్ను సింహాయమందు తూర్పు, దక్షిణ, ఉత్తరములకును, వృషభాయమందు తూర్పునకును గజాయమందు తూర్పు దక్షిణమునకును సింహద్వారములనుంచవలెను లేక బ్రాహ్మణులకు పశ్చిమమునకును, క్షత్రియులకు ఉత్తరమునకును, వైశ్యులకు తూర్పునకును, శూద్రులకు దక్షిణమునకును, సింహద్వారముల నుంచవలెను.

## గృహారంభ నిషిద్ధకాలము.

శ్లో॥ గృహేశతత్స్త్రీసుఖవిత్తనాశోర్కేందుజ్యశుక్రె విబలెస్తనీచె। కర్తుస్థితిర్నోవిధుభాస్తునోర్భె పురస్థితెపృష్ఠగతెఖనిస్స్యాత్॥

తా॥ గృహకర్తయొక్క జన్మరాశినిబట్టి సూర్య, చంద్ర, గురు, శుక్రులు బలహీనులు, అస్తంగతులు, నీచంగతులును, అయినప్పుడు గృహనిర్మాణము చేసెనేని క్రమముగా కర్తకు, భార్యకు, సుఖముకు, ధనముకు, నాశము గలుగును. గృహనక్షత్ర దిననక్షత్రములు సంముఖమందున్న గృహమందు స్థితియుండదు. ఆనక్షత్రములు పృష్ఠభాగమందున్న దొంగలు కన్నముచేతురు. నక్షత్రదిక్కులు పైనచెప్పబడినవి

## అంశఫలము.

శ్లో॥ భంనాగతష్టం వ్యయఈరితో సౌ ధ్రువాదినామాక్షరయుక్పపిండః। తష్టోగుణైరింద్రకృతాంత భూపాహ్వాం శాభవేయుర్నశుభోంతకోత్ర॥

తా॥ గృహనక్షత్ర సంఖ్యను ౮ చే భాగించగా మిగిలిన శేషము వ్యయమనబడును- ఈవ్యయమును ధ్రువాదిశాలా నామాక్షరసంఖ్యతో కలిపిన పిండమనబడును దానిని ౩ చే భాగించగా శేషము ౧ అయితే ఇంద్రాంశ, ౨ యమాంశ, ౩ రాజాంశ ఇందులో యమాంశమంచిదిగాదు.

## ధ్రువాంకానయనమ్.

శ్లో॥ దిక్షుపూర్వాదితశ్శాలాధ్రువా భూద్వ్యశ్వృతాగజాః। శాలాధ్రువాంకసంయోగ స్సైకో వేశ్మధ్రువాదికమ్॥

తా॥ తూర్పుద్వారమందు శాలాధ్రువాంకము ౧ దక్షిణమందు, ౨ పశ్చిమమందు ౪ ఉత్తరమందు ౮ యును, ఈశాలాధ్రువాంక సంఖ్యను ౧- ౨- ౪- ౮ కలిపిన ౧౫ అగును ఈసంఖ్యలో ౧ కలిపిన ౧౬ ధ్రువాదికాలాసంఖ్యఅగును- అనగా ధ్రువాదిశాలలు ౧౬ షోడశ అని భావము.

## ధ్రువాదిశాలా నామాక్షరసంఖ్యా.

శ్లో॥ తిథ్యర్కాష్టాష్టిగో రుద్రశక్రైనామాక్షరత్రయం। భూద్వ్యబ్ధీష్వంగదిగ్వహ్ని విశ్వేషుద్వ్యానగాబ్ధయః॥

తా॥ పూర్వోక్తధ్రువాది షోడశశాలా నామములలో ౧౫- ౧౨- ౮- ౧౬- ౯- ౧౧- ౧౪ సంఖ్యావన్నామములు- మూడు అక్షరములు గలవి- 1- 2- 4- 5-6- 10- 3- 13 సంఖ్యవన్నామములు రెండు అక్షరములు గలవి- ౭ సంఖ్యావన్నామము నాలుగు అక్షరములుగలవి- ఈఅర్థము ముందు శ్లోకములో స్పష్టమగును.

## ధ్రువాది నామములు.

శ్లో॥ ధ్రువధాన్యజయనందా ఖరకాంతమనోరమం సుముఖదుర్ముఖోగ్రించ। రిపుదంవిత్తదంనాశం చాక్రందంవిపులవిజయాఖ్యంస్యాత్॥

తా॥ శాలానామములు 1 ధ్రువం, 2 ధాన్యం, 3 జయః, 4 నందః, 5 ఖరం, 6 కాంతం, ౭ మనోరమం, 8 సుముఖి, 9 దుర్ముఖం, 10 ఉగ్రం, 11 రిపుదం, 12



విత్తదం, 13 నాశం, 14 ఆక్రందం, 15 విపులం, 16 విజయః, అత్రద్వ్యక్షరాణి అష్టౌ 8 త్ర్యక్షరాణి సప్త 7 చతురక్షరం ఏకం 1 కలిపి 16 ఇవి నామమును దగిన ఫలము నిచ్చును.

## నవవర్గ గణితమ్.

శ్లో॥ పిండేనవాంకాంగగజాగ్ని నాగనాగాబ్ధినాగగుణితేత్రమేణ। విభాజితైర్నాగనగాంక సూర్యనాగర్క్షతిథ్యర్క్షఖ భానుభిశ్చ। ఆయోవారోంశకోద్రవ్య మృణమృక్షంతిథిర్యుతిః। ఆయుశ్చాథగృహేశర్క్షం గృహైక్యంమృతిప్రదమ్॥

తా॥ పూర్వోక్త పిండమును 9 చేత గుణించి 8 చేతభాగించగా మిగిలినశేషము ఆయము, 9 చేత గుణించి 7 చేత భాగించగా మిగిలిన శేషము వారము 6చేత గుణించి 9 చేత భాగించగా మిగిలిన శేషము అంశ, 8 చేత గుణించి 12 చేత భాగించగావచ్చిన శేషము ధనము- 3 చే గుణించి 8 చేత భాగించగా వచ్చిన శేషము ఋణము - 8 చే గుణించి 27 చేత భాగించగా వచ్చిన శేషము నక్షత్రము, 8 చే గుణించి 15 చే భాగించగా వచ్చిన శేషము తిథి 4 చే గుణించి 27 చే భాగించగా వచ్చిన శేషము యోగము 8 చేత గుణించి 120 చేత భాగించగా వచ్చిన శేషము ఆయువు, ఇందులో గృహనక్షత్రమును గృహస్వామి నక్షత్రమును నొక్కటైన మృతి వీటికిఫలములు కాలామృతాది గ్రంథములయందు చూడదగినవి.

## గణితచక్రం.

| ఆయ | వార | అంశ | ధన | ఋణ | నక్ష | తిథి | యోగ | వయః | ఆయాదయః |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 9 | 9 | 6 | 8 | 3 | 8 | 8 | 4 | 8 | గుణకారః |
| 8 | 7 | 9 | 12 | 8 | 27 | 15 | 27 | 120 | భాగహారః |

## వృషభచక్రమ్.

శ్లో॥ గేహాద్యారంభేర్కభాద్వత్సశీర్షే రామైర్దాహోవేదభైరగ్రపాదే। శూన్యం వేదైఃపృష్ఠపాదే స్థిరత్వం రామైఃపృష్ఠే శ్రీర్యు

గైర్దక్షకుక్షౌ॥ లాభో రామైఃపుచ్ఛగైస్స్వామినాశో వేదైర్నైస్స్వం వామకుక్షౌముఖస్థైః। రామైఃపీడాసంతతంచార్కధిష్ణ్యా ద్వక్త్రైరుద్రైర్దిగ్భిరుక్తంహ్యాసత్సత్॥

తా॥ గృహారంభమందు వృషభాకారముగా నొకచక్రమును వ్రాసి దాని అంగములయందు నీక్రమముగా నక్షత్రములను వ్రాయవలెను సూర్యుడున్న నక్షత్రము మొదలు 3 నక్షత్రములు శిరస్సున వ్రాయవలెను ఇట్లే ముందరిపాదమందు 3 వెనుకటిపాదమందు, 4 పృష్ఠమందు 3 దక్షిణకుక్షియందు, 4 తోకయందు, 3 వామకుక్షియందు, 4 ముఖమందు 3 ను వ్రాయవలెను. ఇందుకు ఫలము నిత్యనక్షత్రము శిరస్సుననున్న మూడు నక్షత్రములలో నొకకైన దహనము, ముందరి పాదమందున్న 4 లో నొకకైన శూన్యము, వెనుకపాదమందున్న 4 లో నొకకైన స్థిరత్వము, పృష్ఠమందున్న 3 లో నొకకైన లక్ష్మీ, దక్షిణకుక్షియందున్న 4 లో నొకకైన లాభము, తోకయందున్న 3 లో నొకటయిన యజమాననాశము, వామకుక్షియందున్న 4 లో నొకటయిన దారిద్ర్యము ముఖమందున్న 3 లో నొకటయిన నిత్యపీడ, ఇది వృషభచక్రఫలము ఇంకొక విధము సూర్యుడున్న నక్షత్రము మొదలు 7 నక్షత్రములు అశుభము. 11 శుభము 10 అశుభము ఇది ఏక విధము.

## ముఖభేదేన గృహారంభమాసాః.

శ్లో॥ కుంభేర్కేఫాల్గునే ప్రాగపరముఖగృహం శ్రావణేసింహకర్కోర్కేః। పౌషేనక్రేధయామ్యోత్తరముఖసదనంగోజగేర్కేధరాథే। మార్గేజూకాలిగేసద్ధ్రువమృదు వరుణస్వాతి వస్వర్కపుష్యై న్నూత్నేగేహాంత్యదిత్యాం హరిభవిధిభయోస్తత్రశస్తఃప్రవేశః॥

తా॥ రవి కుంభమందుండగా ఫాల్గుణమాసమందు తూర్పు, పశ్చిమ, ద్వారములుగల గృహమును సింహకటకములయందుండగా శ్రావణమాసమందును మకరమందుండగా పుష్యమాసమందును దక్షిణోత్తర ద్వారగృహమును శుభప్రదము ఇంతేకాదు మేష వృషభములందుండగా వైశాఖమందును తులావృశ్చికములయందుండగా మార్గశీర్ష మాసమందును దక్షిణోత్తరద్వార గృహనిర్మాణము శుభము గృహనిర్మాణ నక్షత్రములు ధ్రువ, మృదు, శతభిషక్, స్వాతి, ధనిష్ఠ, హస్త, పుష్యములు, సూతికాగృహనిర్మాణము పునర్వసు యందును ప్రవేశము శ్రవణ రోహిణులయందును ప్రశస్తములు.



## సౌరచాంద్రమాసైక్యముచేత గృహనిర్మాణమాసములు.

శ్లో॥ కైశ్చేన్మేషరవౌమధౌ వృషభగేజ్యేష్ఠేశుచౌకర్కటే భాద్రే సింహగతే ధటేశ్వయుజిచోర్జేలౌమ్యగేపౌషకే। మాఘేనక్రఘటే శుభం నిగదితంగేహాంతథోర్జేనసత్కన్యాయాంచ తథాధనుష్యపినసత్కృష్ణాదిమాసాభవేత్॥

తా॥ మేషమందు రవియుండగా చైత్రమందును, వృషభమందుండగా జ్యేష్ఠమందును, కటకమందుండగా ఆషాఢమందును, సింహమందుండగా భాద్రపదమందును, తులయందుండగా ఆశ్వయుజమందును, వృశ్చికమందుండగా కార్తీకమందును, మకరమందుండగా పుష్యమాసమందును, మకరకుంభముల యందుండగా మాఘమాసమందును, గృహనిర్మాణము మంచిదని కొందరు చెప్పుచున్నారు కన్యయందును కార్తీకమందును ధనుస్సునందును అశుభము కృష్ణపక్షము మొదలు మాసగణన.

## తిథి వరత్వేన ద్వారనిషేధః.

శ్లో॥ పూర్ణేందుతఃప్రాగ్వదనం నవమ్యాదిషూత్తరాస్యం త్వథ పశ్చిమాస్యం। దర్శాదితశ్శుక్లదలేనవమ్యాదౌ దక్షిణాస్యంనశుభం వదంతి।

తా॥ తిథినిబట్టి ద్వారనిషేధమును చెప్పుచున్నాడు పూర్ణిమ మొదలు అష్టమీపర్యంతము ప్రాగ్ద్వారమును, నవమి మొదలు చతుర్దశీ పర్యంతము ఉత్తరద్వారమును, అమావాస్య మొదలు శుక్లాష్టమి పర్యంతము పశ్చిమద్వారమును, నవమీ మొదలు శుక్లచతుర్దశీ పర్యంతము దక్షిణద్వారమును, అశుభకరములు.

## గృహారంభే వారముహూర్తాది శుద్ధిః.

శ్లో॥ భౌమార్కరిక్తామాద్యూనే చరోనేంగేవిపంచకే। వ్యంత్యాష్టస్థైశ్శుభైర్గేహారంభస్త్ర్యాయారిగైఃఖలైః॥

తా॥ 1. 3. గాక మిగిలిన వారములయందును 1. 4. 9. 14. 30 గాక మిగిలిన తిథులయందును స్థిరద్విస్వభావరాసులయందును ధనిష్ఠాపంచకముగాక మిగిలిన నక్షత్రములయందును శుభగ్రహములు ౧౨. ౮ గాక మిగిలిన స్థానములయందుండగాను 3. 6. 11 స్థానముల పాపగ్రహము లుండగానున్న గృహారంభము శుభకరము

## రాహు ముఖఫలము.

శ్లో॥ దేవాలయె గేహవిధౌ జలాశయె రాహోర్ముఖంశంభు దిశో విలోమతః। మీనార్క సింహార్క మృగార్కతస్త్రిభిః ఖాతేముఖాత్పృష్ఠవిదిక్ శుభా భవేత్॥

తా॥ దేవాలయమందు 12 వ రాశి మొదలు మూడేసి రాసులయందు సూర్యుడుండగా ఈశానాది విలోమంగావి దిక్కులయందు రాహుముఖముండును. అనగా సూర్యుడు 12. 1. 2 రాసులయందున్నప్పుడు ఈశాన్యమందును, 3. 4. 5 రాసులయందున్నప్పుడు వాయవ్యమందును ఇట్లె 6. 7. 8 నైఋతియందును 9. 10. 11 ఆగ్నేయమందును, రాహుముఖముండును, ఇట్లె గృహమునకు సింహము మొదలు తటాకమందు మకరము మొదలు చూచేది యీఅర్థము చక్రమందుస్పష్టమగును ఇందుకు ఫలం రాహువు ముఖమందు భూమిశోధనజేయగూడదు ముఖమునకు ౫ వ విదిక్ పృష్ఠము యీపృష్ఠము శుభము అనగా చైత్ర, వైశాఖ, జ్యేష్ఠమాసములయందు రాహుముఖము ఈశాన్యమందుండును దీనికి పృష్ఠము నైఋతివిదిక్ ఇదిశుభకరము ఇట్లె అంతయు నూహించునది.

## రాహు ముఖచక్రమ్.

రాసులయందు సూర్యుడుండగా

| దేవాలయమందు | గృహారంభమందు | తటాకమందు | రాహుముఖస్థితి |
|---|---|---|---|
| 12-1-2 | 5- 6- 7 | 10-11-12 | ఈశాన్యమందు |
| 3- 4- 5 | 8- 9 10 | 1- 2- 3 | వాయవ్యమందు |
| 6- 7- 8 | 11- 12- 1 | 4- 5- 6 | నైఋతియందు |
| 9-10-11 | 2- 3- 4 | 7- 8- 9 | ఆగ్నేయమందు |

## కూపఖనమ్.

శ్లో॥ కూపెవాస్తోర్మధ్యదేశే ధననాశస్త్వైశానాదౌ పుష్టిరైశ్వ



ర్యవృద్ధిః। సూనోర్నాశస్త్రీవినాశో మృతిశ్చ సంపత్పీడా శత్రుతస్స్యాచ్చసౌఖ్యమ్॥

తా॥ గృహమునకు మధ్యమ కూపము త్రవ్వినధననాశమును ఈశాన్యమందు పుష్టి తూర్పున ఐశ్వర్యవృద్ధి ఆగ్నేయమందు పుత్రనాశము, దక్షిణమందు స్త్రీనాశము, నైఋతియందు కళత్రనాశమును పశ్చిమమందు సంపత్, వాయవ్యమందు శత్రువలన పీడ, ఉత్తరమందు సౌఖ్యమును గలుగును. గాన ౧. ౫. ౭. ౮ దిక్కులయందు కూపఖననము శుభము.

## స్నానాది గృహదిఙ్నిర్ణయః.

శ్లో॥ స్నానస్యపాకశయనాస్త్రభుజశ్చధాన్యభాండారదైవతగృహాణిచ పూర్వతస్స్యుః। తన్మధ్యతస్తుమథనాజ్య పురీషవిద్యాభ్యాసాఖ్య రోదనతౌషధిసర్వధామ॥

తా॥ చతురస్రగృహమందు తూర్పున స్నానగృహము, ఆగ్నేయమున పాకశాల, దక్షిణమున శయనాగారము, నైఋతిన శస్త్రసదనము, పశ్చిమమున భోజన మందిరము, వాయవ్యమున ధాన్యాలయము ఉత్తరమున ధననికేతనము ఈశాన్యమున దేవభవనమును శుభకరములు, ప్రాగాగ్నేయమధ్యను దధిమథనసదనమును, ఆగ్నేయదక్షిణ మధ్యను ఆజ్యగేహమును, దక్షిణనైఋతిమధ్యను, పురీషస్థానమును నైఋతి పశ్చిమ మధ్యమ విద్యాభ్యాస నివేశనమును పశ్చిమవాయవ్య మధ్యమ, రోదన సదనమును, వాయవ్యోత్తర మధ్యను సంభోగనిలయమును ఉత్తరేశాన్య మధ్యను, ఔషధభవనమును, ఈశాన్యప్రాఙ్మధ్యను, సమస్తవస్తు భవనమును ప్రశస్తములు.

## గృహమునకు ఆయుర్దాయ యోగములు.

శ్లో॥ జీవార్కవిచ్ఛుక్రశనైశ్చరేషు లగ్నారిజామిత్రసుఖత్రిగేషు। స్థితిశ్శతంస్యాచ్ఛరదాంసితార్కారేజ్యేతనుత్ర్యంగసుతేశతేద్వే॥

తా॥ గృహారంభమునకు గురువు, 1 వ స్థానమందును, రవి 6 వ స్థానమందును, బుధుడు 7 వ స్థానమందును, శుక్రుడు 4 వ గృహమందును, శని 3 వ గృహమందుండిరేని ఆగృహము 100 సంవత్సరములుండును. కించ - శుక్రుడు 1 వ గృహమందును రవి, 3 వ గృహమందును, కుజుడు 6 వ గృహమందును గురువు 5 వ గృహమందును నుండగా నిర్మించిన గృహము 200 సంవత్సరములుండును.

శ్లో॥ లగ్నాంబరాయేషు భృగుజ్ఞభానుభిః కేంద్రే గురౌ నవర్షశతాయురాలయః। బంధ్వాగురుర్వ్యోమ్ని శశీకుజార్కజౌ లాభే తదాశీతి సమాయురాలయః॥

తా॥ లగ్నమందు శుక్రుడును, దశమమందు బుధుడును, ఏకాదశమందు రవియు, లగ్నవర్జిత కేంద్రములయందు గురువును యుండిరేని గృహము 100 సంవత్సరములుండును. తథా గురువు చతుర్థమందును దశమమందు చంద్రుడును, ఏకాదశమందు కుజ శనులును నుండిరేని 80 సంవత్సరములుండును.

శ్లో॥ స్వోచ్చేశుక్రేలగ్నగేవాగురౌ వేశ్మగతేతథా। శనౌస్వోచ్చే లాభగేవాలక్ష్మ్యా యుక్తంచిరంగృహమ్॥

తా॥ శుక్రుడు ఉచ్చయందుగాని, లగ్నమందుగాని యుండగానైనా గురువు, ఉచ్చయందుగాని, చతుర్థమందుగాని వుండగానైనా, శని ఉచ్చయందుగాని, లాభస్థానమందుగాని వుండగానైనా నిర్మించిన గృహము చిరకాలము లక్ష్మితోగూడియుండును.

## పరహస్తగామి యోగః.

శ్లో॥ ద్యూనాంబరేయద్యేకోపి పరాంశస్థోగ్రహోగృహం। అబ్దాంతఃపరహస్తస్థం కుర్యాచ్చేద్వర్ణపోఽబలః॥

తా॥ ఒకగ్రహము శత్రునవాంశగతుడై సప్తమ దశమములలో నెచ్చటనైనా యుండగా వర్ణాధీశుడు బలహీనుడై యుండగా నిర్మించిన గృహము ఒక సంవత్సరములోగానే పరాధీనమగును.

## శుభయోగ ద్వయమ్.

శ్లో॥ పుష్యధ్రువేందుహరిసార్ప జలైస్సజీవైర్ద్వాసరేణచ। కృతం సుతరాజ్యదంస్యాత్ । ద్వీశాశ్వితక్షవసుపాశిశివైస్స శుక్రైర్వారే సితస్యచగృహం ధనధాన్యదంస్యాత్ ॥

తా॥ గురువు పుష్యధ్రువ, మృగశీర్ష, శ్రవణ, ఆశ్లేష, పూర్వాషాఢనక్షత్రములయందుండగా గురువారమందు కట్టబడిన గృహము పుత్రప్రదము, రాజ్యప్రదమగును. శుక్రుడు విశాఖ, అశ్వినీ, చిత్ర, ధనిష్ఠ, శతభిషక్, ఆర్ద్ర, నక్షత్రములయందుండగా శుక్రవారమందు కట్టబడిన గృహము ధనధాన్యప్రదమగును.



## శుభాశుభయోగ ద్వయమ్

శ్లో॥ సారైఃకరేజ్యాంత్యమఘాంబు మూలైఃకౌజేహ్ని వేశ్మాగ్ని సుతార్తిదంస్యాత్ । సజ్ఞైఃకదాస్త్ర్యమతక్షహస్తైర్జ్ఞస్యైవవారే సుఖపుత్రదంస్యాత్ ॥

తా॥ కుజుడు హస్త, పుష్య, రేవతీ, మఖ, పూర్వాషాఢ, మూలా నక్షత్రములయందుండగా కుజవాసరమందు కట్టిన గృహము అగ్నిబాధ, పుత్రబాధలు గలదగును. బుధుడు రోహిణి, అశ్విని, ఉత్తరా, చిత్ర, హస్తలయందుండగా బుధవారమందు కట్టబడిన గృహము సుఖప్రదమును, పుత్రవృద్ధి ప్రదమును నగును.

## మఱియొక అశుభయోగము.

శ్లో॥ అజైకపాదాహిర్బుధ్న్యశక్రమిత్రానిలాంతకైః । సమందైర్మందవారేస్యాద్రక్షోభూతయుతంగృహమ్॥

తా॥ శని పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, జ్యేష్ఠ, అనూరాధ, స్వాతి, భరణీ నక్షత్రములయందుండగా శనివారమందు కట్టబడిన గృహము రాక్షసులతోను, భూతములతోను, కూడియుండును.

## ద్వారచక్రఫలమ్.

శ్లో॥ సూర్యర్క్షాద్యుగభైశ్శిరస్యథఫలంలక్ష్మీస్తతః కోణభైర్నాగైరుద్వసనంతతోగజమితైశ్శాఖాసుసౌఖ్యంభవేత్ । దేహల్యాంగుణభైర్మృతిర్గృహపతేర్మధ్యస్థితైర్వేదభైస్సౌఖ్యం చక్రమిదం విలోక్యసుధియాద్వారం విధేయంశుభమ్ ॥

తా॥ ద్వారచక్రమందు సూర్యుడున్న నక్షత్రము మొదలు నిత్యనక్షత్రము వరకు లెక్కించగా శిరస్సునయున్న ౪ నక్షత్రములు లక్ష్మీకరములు, నాలుగుకోణములయందున్న ౮ నక్షత్రములు ఉద్వసనకరమును అనంతరం శాఖలయందున్న ౮ నక్షత్రములు సౌఖ్యదములు. మండిగమందున్న 3 నక్షత్రములు గృహస్వామికిమరణప్రదములు మధ్యనున్న ౪ నక్షత్రములు సౌఖ్యప్రదములు. గాన విద్వాంసుడు ఈద్వారచక్రమును ఆలోచించి పైనక్షత్రములలో శుభనక్షత్రమందు ద్వారమును

స్థాపించవలెను. సూర్యుడున్న నక్షత్రము మొదలు ద్వారశిరస్సు మొదలుకొని పూర్వోక్త క్రమముగా నక్షత్రములను వ్రాయవలెను.

ఇతి శ్రీదైవజ్ఞానంత సుతరామ సుధీవర విరచితే ముహూర్తచింతామణౌ ద్వాదశం వాస్తుప్రకరణం సమాప్తమ్.

---

(ద్వారచక్రం.)

శిరస్సు.




సూర్యుడున్న నక్షత్రము మొదలుకొని లెక్కించి నిత్య నక్షత్రము వచ్చుటనున్నదో చూచి పూర్వోక్తరీతిగా ఫలమును తెలుసుకొనవలెను.

## గృహప్రవేశము.

శ్లో॥ సౌమ్యాయనే జ్యేష్ఠతపోంత్యమాధవే యాత్రానివృత్తౌ నృపతేర్నవే గృహే । స్యాద్వేశనం ద్వాస్థమృదుధ్రువోడుభిః జన్మర్క్షలగ్నోపచయోదయే స్థిరే॥

తా॥ రాజాదులకు యాత్రానివృత్తియందును నూతనగృహ రచనానంతరమందును గృహప్రవేశము చేయదగినది ఈ రెండువిధములగల గృహప్రవేశమునకు కాలశుద్ధ్యాదికము చెప్పబడుచున్నది ఉత్తరాయణమందును వైశాఖ, జ్యేష్ఠ, మాఘ, ఫాల్గుణ మాసములయందును ద్వారస్థ, మృదుధ్రువ, నక్షత్రములయందును జన్మరాశి జన్మలగ్నములకు 3. ౬. ౧౦. ౧౧ వ లగ్నమందును స్థిరలగ్నమందును నూతనగృహప్రవేశమును యాత్రానివృత్తి గృహప్రవేశమును శుభకరములు ద్వారస్థములనగా ద్వారదిక్స్థిత నక్షత్రములు.

## జీర్ణగృహే విశేషః.

శ్లో॥ జీర్ణేగృహేగ్న్యాదిభయాన్నవేపి మార్గోర్జయోః శ్రావ



ణకేపి సత్స్యాత్ । వేశోంబుపేజ్యానిలవాసవేషు నావశ్యమస్తాది విచారణాత్ర॥

తా॥ జీర్ణగృహమును మరమ్మతుచేసి తిరిగి నూతనంగా చేయబడిన ఆగృహమందు శతభిషక్, పుష్య, స్వాతి, జ్యేష్ఠనక్షత్రములయందును ఆశ్వయుజ కార్తీక శ్రావణమాసములయందును పూర్వోక్తమాసములయందును ప్రవేశించవచ్చును ఇట్టి ప్రవేశమందు శుక్రాస్తాది దోషము లేదు.

## వాస్తుపూజా.

శ్లో॥ మృదుధ్రువక్షిప్రచరేషు మూలభే వాస్త్వర్చనం భూతబలించ కారయేత్ । త్రికోణకేంద్రాయధనత్రిగైః శుభైర్లగ్నే త్రిషష్ఠాయగతైశ్చ పాపకైః॥

తా॥ ప్రవేశమునకుముందు మృదు, ధ్రువ, క్షిప్ర, చర, మూల నక్షత్రములయందును శుభగ్రహములు 1. 2. 3. 4. 5. 7. 9. 10. 11 స్థానముల నుండగానున్ను పాపగ్రహములు 3. 6. 11 స్థానములయందుండగాను వాస్తుపూజయు, భూతబలియును జేయవలయును.

## లగ్నశుద్ధ్యాదికమ్.

శ్లో॥ శుద్ధాంబురంధ్రే విజనుర్భమృత్యౌ వ్యర్కారరిక్తాచరదర్శచైత్రే । అగ్రేంబుపూర్ణం కలశం ద్విజాంశ్చ కృత్వా విశేద్వేశ్మ భకూటశుద్ధమ్॥

తా॥ 4. 8 స్థానములు గ్రహశూన్యములై యుండగాను జన్మరాశి జన్మలగ్నములకు అష్టమముగాని లగ్నమందును రవి మంగళేతరవారములయందును 4. 9. 14. 30 గాక మిగిలిన తిథులయందును చైత్రేతరమాసములయందును చరాన్య లగ్నములయందును పూర్ణకలశమును బ్రాహ్మణులనున్ను ముందుంచుకొని వివాహప్రకరణోక్త నక్షత్రకూటాది శుద్ధమైన గృహమును ప్రవేశించవలెను.

## వామరవి.

శ్లో॥ వామోరవిర్మృత్యుసుతార్థలాభతోర్కే పంచమే ప్రాగ్వ

దనాదిమందిరే । పూర్ణాతిథౌ ప్రాగ్వదనే గృహే శుభో౽సందాదికేయామ్యజలోత్తరాననే ॥

తా॥ ప్రాగ్ద్వారమందిర ప్రవేశమందు అష్టమస్థానము మొదలు అయిదు స్థానములనున్న రవి వామరవియనబడును దక్షిణద్వారగృహప్రవేశమందు పంచమస్థానము మొదలు అయిదు స్థానములనున్న రవి వామరవి పశ్చిమద్వార గృహప్రవేశమునకు ద్వితీయ స్థానము మొదలు అయిదు స్థానములనున్న రవి వామరవి ఉత్తరద్వార గృహమునకు ఏకాదశ స్థానము మొదలు అయిదు స్థానములనున్న రవి వామరవియనబడును క్రమముగా పూర్వాది ద్వార గృహప్రవేశములు 5- 10- 15- 1- 6- 11, 2- 7- 12, 3- 8- 13, తిథులయందు శుభములు- అనగా 5- 10- 15 తిథులు తూర్పుద్వారమునకును, 1- 6- 11 దక్షిణద్వారమునకును, 2- 7- 12 పశ్చిమ ద్వారమునకును, 3- 8- 13 ఉత్తరద్వారమునకును మంచివి.

వామరవిచక్రమ్.

| స్థానములందున్న రవి వామరవి యనబడును. | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | 8 | 9 | 10 | 11 | 12 | ప్రాగ్ద్వార గృహ ప్రవేశె |
| | 5 | 6 | 7 | 8 | 9 | దక్షిణద్వార గృహప్రవేశె. |
| | 2 | 3 | 4 | 5 | 6 | పశ్చిమేద్వార గృహప్రవేశె |
| | 11 | 12 | 1 | 2 | 3 | ఉత్తరద్వార గృహప్రవేశె |

కలశచక్రమ్.

శ్లో॥ వక్త్రే భూరవిభాత్ప్రవేశసమయె కుంభెగ్నిదాహః కృతాః ప్రాచ్యాముద్వసనం కృతాయమగతా లాభః కృతాః పశ్చిమె । శ్రీర్వేదాః కలిరుత్తరేయుగమితా గర్భె వినాశోగుదెరామాస్థైర్యమతస్థిరత్వమనలాః కంఠెథ వేత్సర్వదా ॥



రవి ౧
౩
౪ ౪ ౪
౪ ౪
౩

తా॥ ఈప్రకారముగా కలశచక్రమును వ్రాసి సూర్యుడున్న నక్షత్రము శిరస్సున వ్రాసి తరువాత ౪ తూర్పున, ౪ దక్షిణమున, ౪ పశ్చిమమున, ౪ ఉత్తరమున, ౪ గర్భమందును, ౩ గుదమందును, ౩ కంఠమందును వ్రాయవలెను, ఈచక్రమందు పైని కిందనున్న ౪ తూర్పుని కిందియూడును పైనున్న ౪ పశ్చిమమును అని తెలుసుకొనవలయును గృహప్రవేశ సమయమందు ప్రవేశనక్షత్రము శిరస్సైనా అగ్నిదాహము, తూర్పైనా వస్త్రాభావము, దక్షిణమైనా లాభము, పశ్చిమమైనా సంపత్, ఉత్తరమైనా కలహము, గర్భమైనా భార్యకు గర్భనాశము, గుదమైనా స్థిరత్వము, కంఠమైనా స్థిరత్వమును కలుగును.

ప్రవేశానంతర కృత్యము

శ్లో॥ ఏవంసులగ్నె స్వగృహం ప్రవిశ్య వితానపుష్ప శ్రుతిఘోషయుక్తం । శిల్పజ్ఞ దైవజ్ఞ విధిజ్ఞపౌరాన్ రాజార్చయేద్భూమిహిరణ్యవస్త్రైః ॥

తా॥ ఈప్రకారముగా రాజాదులు శుభలగ్నమందు చాందనీపుష్ప వేదఘోషములతోగూడిన స్వగృహమును ప్రవేశించి గృహనిర్మాణవిధి ప్రదాయకులకునున్ను శుభలగ్నప్రదాయకులనున్ను గృహనిర్మాణకర శిల్పులనున్ను ఆగత, స్థాయి, బ్రాహ్మణులనున్ను సేవకులనున్ను, భూమి, బంగారము వస్త్రములు మొదలైన వాటిచేత పూజించి సుఖముగా ప్రవేశించవలెను.

ఇతి శ్రీ దైవజ్ఞానంత సుతరామ సుధీవర విరచితే ముహూర్త చింతామణౌ త్రయోదశం గృహప్రవేశప్రకరణం సమాప్తమ్.

---

శ్లో॥ ఆసీద్ధర్మపురే షడంగనిగమాధ్యేతృద్విజైర్మండితే జ్యోతిర్విత్తిలకః ఫణీంద్రరచితె భాష్యే కృతాతిశ్రమః । తత్తజ్జాతకసంహితాగణిత కృన్మాన్యోమహాభూభుజాం తర్కాలంకృతి వేదవాక్య విలసద్బుద్ధిస్సచింతామణిః । జ్యోతిర్విద్గణవందితాంఘ్రికమలస్తత్సూనురాసీత్కృతీనామ్నానంత ఇతిప్రథామధిగతో భూమండలాహస్కరః । యోరమ్యాంజనిపద్ధతింసముకరోద్దుష్టాశయధ్వంసినీం టీకాంచోత్తమ కామధేనగణితె౽కార్షీత్సతాంప్రీతయె ॥ తదాత్మజ ఉదారధీర్విబుధనీల

కంఠానుజో గణేశ పదపంకజం హృదినిధాయ రామాభిధః । గిరీశనగరే వరే భుజభుజేషుచంద్రైర్మితే శకే వినిరమాదిమంఖలు ముహూర్త చింతామణిమ్॥

గ॥ అస్త్యఖిల భూమండలమండనాయమానం విదర్భదేశాంతర్గతం శిక్షా వ్యాకరణం ఛందో నిరుక్తం జ్యోతిషం తథా కల్పశ్చేతి షడంగాని వేదస్యాహుర్మనీషిణ ఇత్యుక్త షడంగసహిత సమస్త వేదపారదృశ్వభిః ఫలవదర్థావబోధపర్యంత విద్యావరిశ్రమైర్విప్రవరైరాకీర్ణం ధర్మపురం నామ నగరం సర్మదాఖ్యర్ణే తత్రజాతకసంహితా గణితశాస్త్ర వేదో మహారాజమాన్యస్తర్కాలంకృతి వేదాంతమీమాంసాదినిపుణో జ్యోతిర్విదామగ్రణీ రధీతాహింపతి ఫణితశాస్త్రో నంత మహిమా చింతామణిర్నామ కశ్చిద్బ్రాహ్మణోభూత్ – తస్య దైవజ్ఞ వందితపాదకమలో జాతకపద్ధతి కర్తా ఆర్యభటమతపంచాంగసాధక కామధేనగణితశాస్త్రస్య టీకాకర్తా బహుకృతీ అనంతదైవజ్ఞ ఇతిపుత్రోభూత్ తత్పుత్రో నీలకంఠబుధానుజో రామసుధీర్ముక్తిప్రదే గిరీశనగరే (కాశ్యాం) గణపతింధ్యాత్వా ౧౫౨౨ మితె శాలివాహన శకకాలె వ్యరచయదిమం ముహూర్తచింతామణిమ్.

తా॥ ఈశ్లోకముల తాత్పర్యమును కుతూహలముచే ముందు సంస్కృత గద్యరూపముగా వ్రాసితిని తరువాత నిది సర్వజనోపయోగి గాదను తలంపుతో నాంధ్రతాత్పర్యముతోగూడ వ్రాయుచున్నాను విశ్వంభరా మండలాలంకారాయమానంబును విదర్భదేశాంతర్గతంబును, విదిత వేద వేదాంగార్థ విద్వజ్జనాకీర్ణంబును నైన ధర్మపురమను నొక పురవరంబుగలదు, ఆపత్తనోత్తమమందు జాతకసంహితా గణితశాస్త్రవేదియు, మహారాజమాన్యుడును, తర్కాలంకార వేదాంతమీమాంసాది తాత్పర్యజ్ఞాన విచక్షణుడును, అనంతమహిమవంతుడు నైన చింతామణియను నొకభూదేవోత్తముండుగలడు, ఆద్విజోత్తమునకు దైవజ్ఞ బృందవందిత పాదారవిందుడును జాతకపద్ధతి కర్తయు ఆర్యభటమత పంచాంగసాధక గణితశాస్త్రటీకాకర్తయు, కృతానేక కృతియు నైన అనంతదైవజ్ఞుడును, నొక పుత్రుడుగలడు, అతనికి నీలకంఠవిద్వాంసుడు, రామపండితుడునను నిరువురు పుత్రులుగలరు, అందవరజుడైన రామపండితుడు కైవల్యప్రదయగు కాశీనగరమందు ౧౫౨౨ శాలివాహనశకవత్సరంబున గణపతిధ్యాన పూర్వకముగా నీముహూర్త చింతామణియను గ్రంధమును రచించెను.

ఈప్రకారముగా నాంధ్రతాత్పర్య సహితమైన ముహూర్తచింతామణి ముగిసెను.

# ప్రాచీన ఫలగ్రంధే.

## ఉప్పెన సంభవించుటకు మార్గము.

శ్లో॥ స్వాతిభవతివిశాఖే స్వాతినక్షత్రయుక్తే । రవికుజశనివారే కార్తికేక్షీణచంద్రే వియతఘనతవృష్టి వాయునాఘాతపాతం నరపశుమృగజాలం ఖేచరస్యాచహంతి॥

## వారదోష భంగము.

శ్లో॥ తిథిర్నదోషాఉదయేచకాలే । నక్షత్రదోషాఅభిజిన్ముహూర్తే । లగ్నాదిదోషాస్తమయేచకాలే నవారదోషాఃప్రభవంతిరాత్రౌ॥

## పంచాంగశుద్ధిక్రమము.

శ్లో॥ తిథివారభయోగానాం కరణస్యతుమేళనం । పంచాంగమస్య సంశుద్ధిః పంచశుద్ధిముదాహృతం । యస్మిన్ పంచాంగదోషేస్మిన్ తస్మిన్ లగ్ననిరర్థకమ్॥

## హోరా ప్రశస్థమ్,

శ్లో॥ గురుర్వివాహేగమనేచ శుక్రేజ్ఞానేబుధేసౌరి గృహప్రవేశే। భౌమేవియుద్ధేనృపదర్శనార్కే సర్వేషుకార్యేషుశశాంకహోరా॥

## లగ్నస్థిత గురుశుక్రబలమ్.

ఫలగ్రంథే॥ శ్లో॥ లగ్నంచదోషం తిథివారదోషం గండాంతదోషంచ ముహూర్తదోషం । కంపాదిదోషం గ్రహజన్మఋక్షం జ్వాలాముఖివిషనాడికానాం । ఏతానిదోషాణి వినాశయంతీ సర్వైశ్చ లగ్నే గురుశుక్రలగ్నే ।

## గౌరీ పంచాక్షరీ జపమ్,

అస్యశ్రీ గౌరీపంచాక్షరీ మహామంత్రస్య, వామదేవఋషిః. గాయత్రీచ్ఛందః। శ్రీసాంబసదాశివో రుద్రో దేవతా । శ్రీం బీజం, నమశ్శక్తిః, శివాయేతికీలకం, మమపరమశ్రేయః ప్రాప్త్యర్థం ఉమామహేశ్వరప్రీత్యర్థం మమ దేహారోగ్యసిద్ధ్యర్థం గౌరీపంచాక్షరీ మహామంత్రజపేవినియోగః గురుప్రార్థనంకృత్వా॥

ఓం శ్రీం అంగుష్ఠాభ్యాంనమః, ఓం నం తర్జనీభ్యాంనమః॥ ఓం మం మధ్యమాభ్యాంనమః। ఓం శిం అనామికాభ్యాంనమః॥ ఓం వం కనిష్ఠికాభ్యాంనమః । ఓం యం కరతలకర పృష్ఠాభ్యాంనమః॥ ఏవం హృదయాదిన్యాసః॥ శ్లో॥ కైలాసశిఖరేరమ్యే పార్వత్యాసహితప్రభో। ఆగచ్ఛదేవదేవేశ త్వద్భక్తానాంచరక్షణమ్॥

### సంస్కార నియమము.

సూ॥ గర్భాధానం పుంసవనం సీమంతోన్నయనం జాతకర్మనామకరణాన్నప్రాశన చౌలోపనయనం చత్వారి వేదవ్రతానిస్నానం సహధర్మచారిణీ సంయోగః పంచానాంయజ్ఞానామనుష్ఠాన మష్టకాపార్వణశ్రాద్ధం శ్రావణ్యాగ్రహాయణీ చైత్ర్యాశ్వయుజీతి సప్తపాకసంస్థా అగ్న్యాధాన మగ్నిహోత్రం దర్శపౌర్ణమాసౌ చాతుర్మాస్యాన్యాగ్రయణేష్టి నిరూఢ పశుబంధ సౌత్రామణీతి సప్తహావిర్యజ్ఞసంస్థా అగ్నిష్టమోత్యగ్నిష్టోమ ఉక్థ్య షోడశీవాజపేయోతి రాత్రాప్తోర్యామ ఇతిసప్తసోమయజ్ఞసంస్థా ఇత్యేతేచత్వారింశత్సంస్కారాః॥ అష్టావాత్మగుణాః దయాసర్వభూతేషు క్షాంతిరనసూయా శౌచమనాయాసో మాంగల్యమకార్పణ్యమస్పృహేతి। యస్యైతేచత్వారింశత్సంస్కారాః అష్టావాత్మగుణాంశ్చసబ్రాహ్మణఃసాయుజ్యమాప్నోతి॥

తా॥ గర్భాధానము, పుంసవనము, సీమంతోన్నయనము, జాతకర్మ, నామకరణము, అన్నప్రాశనము, చౌలము, ఉపనయనము, నాలుగు వేదవ్రతములు. స్నాతకవ్రతము, సహధర్మచారిణీ సంయోగము. దేవయజ్ఞము, పితృయజ్ఞము, భూతయజ్ఞము, మనుష్యయజ్ఞము, బ్రహ్మయజ్ఞము, అష్టకాదిసప్తపాకసంస్థలును, అగ్న్యాధానాది సప్తహావిర్యజ్ఞ సంస్థలును, అగ్నిష్టోమాది సప్తసోమయజ్ఞ సంస్థలును, వెరసి ౪౦ సంస్కారంబులు. వీటితోడ ౧ సర్వభూతదయ, ౨ క్షాంతి, ౩ నిరసూయ, ౪ శౌచము, ౫ అనాయాసము, ౬ మాంగల్యము, ౭ అకార్పణ్యము, ౮ నైస్పృహ్యము, అను ౮ ఆత్మగుణంబులు వెరసి (౪౮) అయినది, ఇవన్నియు నెవనికిగలదో వాఁడు బ్రాహ్మణుండనంబడును. అట్టి బ్రాహ్మణుడు సాయుజ్యమునందును, వాఁడుగదా ఇహపరపూజ్యుండు. ఈ పేళ్లనుకూడ నరచియుండు మహాత్ములు కలికాలము యొక్క బ్రాహ్మణులని చెప్పఁబడును.

---

ఆర్యానంద ప్రెస్. బందరు. క. 26. 500, 12-12-46.